శ్రీ

# ధ్రువోపాఖ్యానము

బమ్మెర పోతనామాత్య కవీంద్ర ప్రణీతము.

టీకాతాత్పర్యసహితము.

పండితులచే పరిష్కరింపఁబడినది.



ప్రకాశకులు.

## ఆర్య పుస్తకాలయము.

రాజమహేంద్రవరము.

1928

---

# పీఠిక.

ధ్రువోపాఖ్యానము భాగవతమునఁ జతుర్థస్కంధమున వచ్చు స్వాయంభువ మన్వంతర కథాసందర్భమునఁ జెప్పబడిన భక్తచరిత్రము. శ్రీమద్భాగవతము సంస్కృతమున వ్యాసమహర్షి చే విరచింపఁబడియె. ఇది యష్టాదశపురాణములలో నొక్కటి యని పెక్కండ్రయభిప్రాయము. దేవీభాగవత మను పేరఁ బార్వతీదేవియవతారవిశేషముల వర్ణించు మఱియొక గ్రంథము కలదు. అయ్యదియే పదునెనిమిది పురాణములలోఁ బేర్కొనఁబడిన భాగవత మని కొందఱి యభిప్రాయము. శ్రీమద్భాగవతము విష్ణులీలాచరిత్రమును బ్రతిపాదించును. వ్యాసుఁడు వేదాంతశాస్త్రమును బ్రహ్మసూత్రముల రూపముగా నెలకొల్పెను. అది సకలజనుల కర్థ్యము కాకపోవుటచే భాగవతకథారూపమున వేదాంతదర్శనరహస్యము లుద్బోధించుటకై వ్యాసులీ గ్రంథమును రచించిరి. దీనికి సంస్కృతభాషలోఁ బెక్కులు వ్యాఖ్యానములు గలవు వానిలోఁ జాలఁ బ్రాచీనమైనది శ్రీధరకృతము అది యద్వైతమునే విశేషముగా స్థాపించును

దీనిఁ దెనిఁగించిన కవి బమ్మెర పోతనామాత్యుఁడు. ఇతఁడు శివభక్తుఁడగు కేసనకు లక్కమాంబయందు జనించినవాఁడు; కౌండిన్యగోత్రజుఁడు పరమేశ్వరోపాసనచేఁ గవితాశక్తి బడసినకవి. సహజపాండిత్యబిరుదము వహించినందున నితఁడు గురుకులక్లేశమున విద్య సాధింపక స్వయంకృషిచే సాహిత్యమునందును దర్శనములందును బ్రౌఢపాండిత్య మలవఱచుకొనియె. ఇతని దేశకాలముల గుఱించి భిన్నాభిప్రాయములు గలవు. క్రీ. శ. 1420 ప్రాంతమున నితని భాగవతము రచింపఁబడియుండునని పలువురి యభిప్రాయము. భాగవతాంధ్రానువాదమున కితఁడే మొదటివాఁడు. ఇతఁడోరుగల్లను నేకశిలానగరమున నుండె నని మామతము. కొందఱితఁడు కడపమండలములోని యొంటిమిట్టలో వసించె నని చెప్పుదురు. ఓరుగంటివాఁ డనుటకనేక హేతువులు గానవచ్చుచున్నవి క్రింద సూచించెదము. ఆంధ్రభాషలో మహాగ్రంథము లగు మహాభారతమును భాస్కరరామాయణమును శ్రీమద్భాగవతమును బహుకవిప్రోక్తము లయ్యెఁ గాని కేవల మేకకవికృతములు గాకపోయెను. భారతములో నారణ్యపర్వమున నన్నయ కవిత నిలిచిపోయెను. తిక్కనవిరాట

పర్వమునుండి గ్రంథము ముగింప నరణ్యపర్వశేషము నెఱ్ఱాప్రగడ తెనిఁగిం
చెను. ఇట్లే భాస్కరుఁడు ప్రారంభించిన భాస్కరరామాయణము శిథిలము
కాఁగా నారణ్యకాండ యుద్ధకాండపూర్వభాగములవక్కఁ దక్కిన
కాండములు మల్లికార్జునాదులచేఁ బూరింపఁబడియె. భాగవతము సైతము
పోతనకృత స్కంధములు కొన్ని శిథిలము కాఁగా గంగన బొప్పన నారనసింగ
నాదులు పూరించిరి. ఇట్లు శిథిలమగుటకు ముఖ్యహేతు వేమి? రాజనరేం
ద్రుఁడు క్రీ. శ. 1020 లోఁ జనిపోవఁగా నతనిపుత్రుఁడు కులోత్తుంగుఁడు
చోళదేశము పరిపాలించుచుండెను. రాజనరేంద్రుని తమ్ముఁడు విద్వత్పక్ష
పాతి గాక క్రూరుఁడగుటచేతను నన్నయ ప్రియుఁడగుటచే భారతరచ
న నిలిచిపోయుండును. భాస్కరుఁడు ప్రతాపరుద్రుని సేనాని యగుమారని
కంకితమిచ్చి రచించెను. 1323 కాలమున నోరుగల్లు తురకలచేఁ బడినందున
భాస్కరరామాయణము నష్టమయ్యె. నష్టభాగములఁ దత్పుత్రాదులు పూరిం
చిరి. ఇట్లే 1430 ప్రాంతమున నోరుగల్లు తురకలచే నాక్రమింపఁబడిన
ప్పుడు భాగవతము సైతము లోకవ్యాప్తము కాకమున్నె కొన్ని స్కంధ
భాగములు నష్టములయ్యె ననుట సత్యమునకు దూరము గాదు. కాకతీయ
రాజ్యము మహోన్నతదశలో నున్న కాలము నన గా క్రీ. శ. 1000 నుండి
1440 వఱకు రచింపఁబడిన గ్రంథసహస్రములో నుభయభాషలలోను
20—30 కంటె నెక్కువగా మనకాలమునకు నిలిచినవి కావు. రాజ్యవిప్లవముల
వలనఁ బ్రజలు దేశభ్రష్టులై ప్రాణమానములు దక్కించుకొనఁ బాఱిపోవు
నప్పుడు తాళపత్రసంపుటములఁ గొనిపోవుదు రనుట యసంభవము. అట్టి
కాలములోని గ్రంథ మగుభాగవతము కొంతభాగమైనను లభించుట మన
భాగ్యమే యని సంతుష్టి నొందఁదగు. భాగవతములో 1, 2, 7, 10 [పూర్వ
భాగము] స్కంధములు మాత్రమే పోతన కవిత్వమనియు 3, 4, 5, 8, టిలో
గొన్ని భాగములు పరపూరితములనియు 6, 10 (ఉత్తరభాగము), 11, 12,
స్కంధములు పోతన కవిత గాదనియుఁ బెద్దలు నిశ్చయించిరి. ఏర్చూరి సింగ
న షష్ఠస్కంధము మొదలుపెట్టెను. సింగనాదులు తృతీయ చతుర్థ పంచమ
స్కంధములు పూరించిరి. అష్టమశేష నవమస్కంధముల నేకాదశ ద్వా
దశస్కంధముల నారయాదులు ముగించిరి. పోతనకవిత శ్రేష్ఠమైనది

ప్రాయశః నిర్దుష్టము. పూరించినకవుల కవితలు నీరసములై దోషబహుళములై యుండుట నిస్సంశయము. దశమస్కంధమును మాత్రము మడికిసింగన్న ద్విపదరూపమున రచించె. అది పోతన గ్రంథమునకు శిథిలత్వపూరణము కాదనియు స్వతంత్రరచనమనియుఁ దోచుచున్నది. పూరించిన కవులలో నేర్చూరి సింగన, మడికి సింగనయు, నోరుగంటి కుత్తరమున రామగిరివాసులు ఏర్చూరి సింగన కువలయాశ్వచరిత్రకూడ రచించెను. బొప్పనార్యుని త్రిభువనగిరి రాచగిరివారు షష్ఠైకాదశ ద్వాదశ స్కంధములు తెనిఁగించిన హరిభట్టు కంబముమెట్టువాసి. అన్య షష్ఠస్కంధకర్తలగు మల్లన సింగనలు బెజవాడ సమీపవాసులు దీని సూచింప భాగవతరచన నోరుగంటిచుట్టు నేఁబది మైళ్ళదూరములో నిముడుచున్నది.

పై యంశము లాలోచింప బమ్మెర పోతన యోరుగంటిలో నుండె నని తోచకమానదు. గ్రంథము శిథిలమగుటకుఁ గారణము సులభగోచరమగును. 1420 ప్రాంతమునఁ గడపమండలము విద్యానగర రాజగు దేవరాయుని పాలనమునందుండెను, అతని మంత్రులాంధ్రులు. పెక్కండ్రాంధ్రభాషలో గ్రంథరచనఁ జేయించిరి. వారి రాజ్యములో భాగవతమువంటి గ్రంథము నశించుటకు వీలుండదు. పోతన యేకశిలానగరవాసి యని భాగవతములోఁ జెప్పుకొనెను. నగరశబ్దము సాధారణముగా రాజధానికి నామము కార్వేటి నగరాదు లపవాదకోటిలోఁ జేరును. ఏకశిలానగర మను పేరు సుప్రసిద్ధముగా నోరుగంటికిఁ జేరు. బమ్మెరగ్రామము తత్సమీపమున నున్నది. ఇప్పుడింటిపేరొకచోట వాసము మఱియొకచోటఁ దఱచైనను పూర్వకాలమున నంత తఱచుగా నుండదని మా మతము. పోతనగ్రంథము సర్వజ్ఞసింగభూపాలుఁడు కోరె ననుటయుఁ బోతన రచించినభోగినీదండక తద్వేశ్యాప్రశస్తికమనుటయు సింగభూపాలుఁడు రాచగిరిలో రాజ్యము చేసినవాఁడనుటయుఁ బోతన తత్సమీపప్రదేశవాసి యను నంశము స్థిరీకరించుచున్నది. రసార్ణవసుధాకరచమత్కారచంద్రికాది గ్రంథముల రచించిన లేక రచింపించిన సింగభూపాలుఁడు శ్రీనాథునికంటెఁ జాలఁ బ్రాచీనుఁడని స్పష్టమైనది చమత్కారచంద్రికలోని చక్రబంధశ్లోకము (“సత్క్ష్మాచక్రదిశావిలాసి

నయనా" అనునది) విద్యారణ్యుల సోదరుఁడగు సాయణునిచే విరచితమగు నలంకారసుధానిధిలో నుదాహరింపఁబడినది. సాయణుఁడు 1330 లో దీని రచించినందున రసార్ణవసుధాకరాది కర్త సింగభూపతి 1360 లో నుండె ననుట యసంభవము కాదు. కొందఱితఁడు శ్రీనాథసమకాలికుఁడని భ్రమపడిరి కాని యది యసాధ్యమని తేలెఁగదా! కర్ణాటరాజుల క్రింద నుండు కడపమండలవాసి శ్రీనాథాదులచే శ్రీసూక్తికీర్తి యను దేవరాయల విడిచి పరరాష్ట్ర ప్రభువగు సింగభూపతి నాశ్రయించె ననుట మహత్తరమగు కారణమున్నంగాని మనకు సమ్మతిపాత్రము కాదు. శ్రీనాథుఁడు బహుదేశ సంచారి రాజులను రాజ్యములను జెడుచుండఁ దాను రాజ్యలక్ష్మివలె నూతనప్రభువుల నాశ్రయించుచుండె. కేవలము భగవత్కైంకర్యము నభిలషించిన పోతన రాజపరంపర స్తుతించి జీవించెనా యను నచ్చెరువు కలుగుచున్నది. పైయంశములఁ గ్రోడీకరించి నిష్పక్షబుద్ధితోఁ జూచిన నతఁడోరుగల్లునాసి యనియు భాగవతము రాజ్యవిప్లవమున క్షీణించెననియు నంగీకరింపఁదగు.

పోతన శ్రీధరస్వామిశిష్యుఁడని యోరుగంటి ప్రాంతమునఁ బ్రతీతి గలదు. పోతన శ్రీధరవ్యాఖ్యానుసారముతోఁ జేర్చి తెనిఁగించె ననుట నిశ్చయము. శ్రీధరుఁడు. రాచగిరిప్రాంతపుయతి. భాగవతముకాక వీరభద్రవిజయము కూడఁ బోతన రచితమే. ముద్రితగ్రంథమున నాల్గవ యాశ్వాసము పోతన కృతము కాదు.

ధ్రువోపాఖ్యానభాగమున నొండు రెండుపద్యములు దక్కఁ బోతన కవననైపుణి యెందును గానరాదు. అది గంగనాదుల కవితరచనయా యని తోఁచును. అయినను వెన్నెలకంటి సూరన రచించిన విష్ణుపురాణము లోని ధ్రువోపాఖ్యానపు రచనకంటె నిది పెక్కుభంగుల గుణవత్తర మనుట నిస్సంశయము.

ప్రకాశకులు.





శ్రీ హయగ్రీవాయ నమః

# ధ్రువోపాఖ్యానము.



టీకాతాత్పర్యసహితము.

క. విను నిఖిలభువన పరిపా
లనమునకై చంద్రధరక • ళాలలితుండై
వనజజునకు స్వాయంభువ
మను వపు డుదయించెఁ గీర్తి • మంతుం డగుచున్, 1

అర్థము. విను = వినుము; నిఖిల, భువన, పరిపాలనమునకై = లోకముల నన్నిటిని ఏలుటకొఱకు; చంద్రధర, కళా, కలితుండు, ఐ = చంద్రునిధరించిన శివునియొక్క తేజముతోఁ గూడియున్నవాఁడై; వనజజునకున్ = [విష్ణుమూర్తి నాభిమండలి పద్మమునందుపుట్టిన] బ్రహ్మకు; కీర్తిమంతుండు, అగుచున్ = కీర్తితోఁ గూడినవాఁడై; స్వాయంభువమనువు = [స్వయముగా పుట్టిన బ్రహ్మకొడుకయిన] స్వాయంభువుఁడనెడి మనువు; అపుడు = అప్పుడు; ఉదయించెన్ = పుట్టెను.

తా. మైత్రేయుఁడు విదురునితోఁ జెప్పుచున్నాఁడు. "విదురా వినుము, సమస్తలోకములను ధర్మమార్గమునఁ బరిపాలించుటకొఱకు శివుని తేజమును ధరించి, మిగులఁగీర్తినిగాంచి, బ్రహ్మకు కుమారుఁడై స్వాయంభువ మనువు పుట్టెను."

తే. గీ. రూఢి నమ్మనువునకు శత • రూపవలన
భూనుతు లగు ప్రియవ్రతో • త్తానపాదు
లనఁగ నిద్దఱు పుత్త్రులై • రందులోన
భవ్యచారిత్రుఁ డుత్తాన • పాదునకును. 2

అర్థ. రూఢిన్ = ప్రసిద్ధమగునట్లు, ఆమ్మనువునకున్ = ఆస్వాయంభువమనువునకు; శతరూపవలనన్ = శతరూప అను భార్యయందు; ప్రియవ్రత, ఉత్తానపాదులు = ప్రియవ్రతుఁడును, ఉత్తానపాదుఁడును; అనఁగన్ = అను పేళ్లతో; భూనుతులు, అగు = భూమియందు పొగడ్తగన్న. ఇద్దఱుపుత్రులు, ఐరి = ఇద్దరుకొడుకులుపుట్టిరి; అందులోనన్ = వారిద్దఱిలోను; భవ్యచారిత్రుఁడు = ఎన్నికగన్ననడవడిగల; ఉత్తానపాదునకును = ఉత్తానపాదునికి [ముందుపద్యముతో నన్వయము.]

తా. ఆస్వాయంభువమనువునకు అతని భార్యయగు శతరూపకును ప్రియవ్రత, ఉత్తానపాదు లను పేర్లుగలవారును, మంచినడవడిగలవారును నగు నిద్దఱుకొడుకులుపుట్టిరి. ఆయిద్దఱిలో ఉత్తానపాదునకు

క. వినుము, సునీతియు సురుచియు
నను భార్యలు గలరు; వారి ♦ యందును ధ్రువునిం
గనిన సునీతియు నప్రియ
యును, సురుచియుఁ బ్రియయును నగుచు ♦ నున్నట్టియెడన్.

అర్థ. వినుము = వినుము; [ఉత్తానపాదునకు;] సునీతియు, సురుచియు, అను, భార్యలు కలరు = సునీతి, సురుచి అను భార్యలుండిరి; వారియందును = వారిద్దఱిలో; ధ్రువునిగనిన సునీతియు, అప్రియయును = ధ్రువునితల్లియైన సునీతి ఉత్తానపాదునకు ఇష్టురాలు కాకుండను; సురుచియు, ప్రియయును = సురుచిఅనుభార్య ఇష్టురాలును; అగుచున్, ఉన్నట్టి ఎడన్ = అయిఉండఁగా [ముందఱిపద్యముతో నన్వయము.]

తా. ఉత్తానపాదునకు సునీతి, సురుచి అను నిద్దఱు భార్యలుండిరి వారిలో ధ్రువునితల్లియైన సునీతి భర్తకిష్టురాలుకాదు; సురుచి యిష్టురాలైయుండెను. ఇట్లుండఁగా-

సీ. ఒకనాఁడు సుఖలీల ♦ నుత్తానపాదుండు
నెఱఁ బ్రియురాలైన ♦ సురుచిగన్న

కొడుకు నుత్తముఁ దన ♦ తొడలపై నిడికొని
యుపలాలనము సేయుచున్న వేళ
నర్థిఁ దదారోహ ♦ ణాపేక్షితుండైన
ధ్రువునిఁ గనుంగొని ♦ తివుట నాద
రింపకుండుటకు గ ♦ ర్వించి యా సురుచియు
సవతిబిడ్డండైన ♦ ధ్రువునిఁ జూచి
తే. గీ. తండ్రితొడ నెక్క వేడుక ♦ దగిలె నేనిఁ
బూని నాగర్భమున నాఁడ ♦ పుట్ట కన్య
గర్భమునఁ బుట్టి కోరినఁ ♦ గలదె నేఁడు
జనకుతొడ యెక్కు భాగ్యంబు ♦ సవతికొడుక. 4

అర్థ. ఒకనాఁడు = ఒకదినమున ; సుఖలీలన్ = సౌఖ్యముగా ; ఉత్తానపాదుండు = ఉత్తానపాదుఁడు; నెఱిన్ = ప్రియములో; ప్రియంరాలైన, సురుచి, కన్న, కొడుకున్ = తనకిష్టురాలయిన సురుచియందు పుట్టినకొడుకగు; ఉత్తమున్ = ఉత్తముఁడనువానిని; తనతొడలపైన్, ఇడికొని = తనతొడలమీఁద నుంచుకొని; ఉపలాలనము, చేయుచున్న వేళన్ = ముద్దులాడుచుండఁగా; అర్థిన్ = కోరికతో; తత్, ఆరోహణ, అపేక్షితుండు, ఐన = ఆతొడలమీద నెక్కుటకు అభిలాషపడుచున్న ; ధ్రువునిన్ = ధ్రువుని; కనుంగొని = చూచి; తివుటన్ = ప్రేమతో; ఆదరింపకుండుటకున్, గర్వించి = చేరఁదీయలేదుగదా అని గర్వముపొంది; ఆసురుచియు = ఆసురుచి; సవతిబిడ్డండు, ఐన, ధ్రువునిన్, చూచి = తన సవతియైన సునీతికొడుకయిన ధ్రువునిచూచి; తండ్రితొడన్ ఎక్క, వేడుక = తండ్రితొడపైనుండు ఉత్సాహము; తగిలె నేనిన్ = పుట్టినట్టయితే; పూని = కోరికతో; నా, గర్భమునన్ = నాకడుపులో; నాఁడ = మొదటనే; పుట్టక = జన్మింపక; అన్యగర్భమునన్ = మఱియొకతె

కడుపున; పుట్టి = పుట్టి; నేఁడు = ఈదినమున; కోరినన్ = కావలెనని; సవతికొడుక = నాసవతిపుత్రుఁడవగు ధ్రువుఁడా; జనకుతొడ, ఎక్కు, భాగ్యంబు = తండ్రితొడపైఁ గూర్చుండుభాగ్యము; కలదె = కలుగునా?

తా. ఒకనాఁ డుత్తానపాదుఁడు సౌఖ్యముగాఁ గూర్చుండి తన ప్రియురాలగు సురుచి కొడుకయిన ఉత్తముని తొడపైనుంచుకొని ముద్దులాడుచుండఁగా ధ్రువుఁడును అతనితొడపైఁ గూర్చుండ నుత్సహించుచుండెను. అతనిని ఉత్తానపాదుఁడు ఆదరించలేదు. అదిచూచి సురుచి గర్వముతో ధ్రువునిజూచి ధ్రువుఁడా సవతికొడుకా, నీవు తండ్రి తొడ నెక్కవలెనని యున్నదా? అట్టి యుత్సాహము గలవాఁడవు మొదట నాగర్భమునందే పుట్టి యుండిన బాగుండెడిది. అట్లుపుట్టక యిప్పుడు తండ్రితొడపైఁ గూర్చుండుభాగ్యము కావలెనని న కలుఁగునా?

క. అదిగాన నీ వధోక్షజు
    పదపద్మము లాశ్రయింపు • పాయక హరి నా
    యుదరమునఁ బుట్టనిచ్చును
    వదలక యట్లయిన ముదము • వఱలెడి నీకున్. 5

అర్థ. అది, కానన్ = అందుచేత; నీవు = నీవు; అధోక్షజు = ఇంద్రియములను జయించినవారికి ప్రత్యక్షమగు శ్రీమహావిష్ణువుయొక్క; పదపద్మములు = పద్మములవంటి పాదములను; ఆశ్రయింపు = ఆశ్రయింపుము; పాయక = తప్పక; హరి = ఆవిష్ణువు; వదలక = నిన్నువిడిచిపెట్టక; నా, ఉదరమునన్ = నాగర్భమునందు; పుట్టనిచ్చును = పుట్టునట్లుచేయును; అట్లు, అయినన్ = అట్లునీవు నాగర్భమునజనించినయెడల; నీకున్ = నీకు; ముదము, వఱలెడిన్ = నీకుసంతోషముకలుగును.

తా. అందుచేత నీవుతపస్సుచేసి శ్రీవిష్ణువుయొక్క పాదపద్మముల నాశ్రయించినయెడల శ్రీహరి నిన్నుతప్పక నాగర్భమునందుపుట్టునట్లుచేయును. అట్లునీవు నాగర్భమునందు పుట్టినయెడల నీకుసంతోషము కలుగును.

క. అని యీరీతి నసహ్యా వ
చనములు పినతల్లి యపుడు ♦ జనకుఁడు వినఁగాఁ
దను నాడిన దుర్భాషా
ఘనశరములు మనము నాటి ♦ కాఁటియఁ బెట్టన్. 6

అర్థ. అని = ఇట్లు; ఈ, రీతిన్ = ఈప్రకారముగా; అప్పుడు = అప్పుడు; జనకుడు; వినఁగాన్ = తండ్రివినుచుండఁగానే; పినతల్లి = సవతితల్లియైన సురుచి; అసహ్యవచనములు = సహింపరాని మాటలను; తను = తన్ను; ఆడిన = పలికిన; దుర్భాషా, ఘన, శరముల నాటి = చెడుమాటలనెడు గొప్పబాణములు; మనము = మనస్సునందు నాటి; కాఁటియన్, పెట్టన్ = హింసించఁగా.

తా. ఇట్లు తనపినతల్లియైన సురుచి సహింపరానిమాటలను తన తండ్రి వినుచుండఁగనే తన్నుపలుకఁగా ధ్రువుఁ డాకఠినవచనములనెడు బాణములు తనమనస్సున నాటి హింసింపఁగా- (ముందుపద్యముతో నన్వయము.)

క. తను నట్లు పేక్ష సేసిన
జనకునికడఁ బాసి దుఃఖ ♦ జలనిధిలోనన్
మునుఁగుచును దండతాడిత
ఘనభుజగముఁబోలె రోష ♦ కలితుండగుచున్. 7

అర్థ. తనున్ = తన్ను; అట్లు = ఆవిధముగా; ఉపేక్ష, చేసిన = అనాదరణము చేసిన; జనకుని, కడన్ = జనకునియెదుట; పాసి = వదలి; దుఃఖ, జలనిధిలోన్ = దుఃఖసముద్రములో; మునుఁగుచును = మునుఁగుచు; దండ, తాడిత = కఱ్ఱతో కొట్టఁబడిన; ఘన, భుజగము, పోలెన్ = గొప్పసర్పమువలె; రోష, కలితుండు, అగుచున్ = మిక్కిలిఆగ్రహముపొందినవాఁడై- (ముందుపద్యముతో నన్వయము.)

తా. ఇట్లు తన్ను నాదరించిన తండ్రియెదుటనుండి వెడలిపోయి దుఃఖసముద్రములో మునుఁగుచు కఱ్ఱచే కొట్టబడిన గొప్పసర్పమువలె కోపముపొంది.

క. ఘనరోదనంబు సేయుచుఁ
గనుఁగవలను శోకబాష్పకణములు దొరఁగన్
జననికడ కేఁగుటయుఁ దన
తనయునిఁ గని యాసునీతి దద్దయుఁ బ్రేమన్. 8

అర్థ. ఘనరోదనంబు, చేయుచు = గట్టిగా ఏడ్చుచు; కనుఁగవలను = రెండుకన్నులవెంబడి; శోక, బాష్పకణములు = దుఃఖమువలన కలిగిన కన్నీటిబొట్టులు; దొరఁగన్ = కాలుచుండఁగా; జననికడకు, ఏఁగుటయు = తల్లియొద్దకుపోవఁగా; తనయునిన్, కని = తనకుమారునిచూచి; ఆ, సునీతి = ఆసునీతి; దద్దయున్, ప్రేమన్ = ఎక్కువయైన ప్రేమతో.

తా. ధ్రువుఁడు గట్టిగానేడ్చుచు, కన్నులవెంబడి దుఃఖాశ్రువులు కాలుచుండఁ దల్లియొద్దకు పోఁగా ఆసునీతి తనకుమారునిజూచి మిక్కిలియుఁ బ్రేమతో-(ముందుపద్యముతో నన్వయము.)

వ. తన తొడలపై నిడుకొని

అర్థ. తొడలపైన్, ఇడికొని = తొడలమీద గూర్చుండఁ బెట్టుకొని.

క. కర మనురక్తిని మోము ని
విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః
పురవాసులుఁ జెప్పిన విని
పఱపుగ నిట్టూర్పు లెసఁగ బాష్పాకులయై. 10

అర్థ. కరము, అనురక్తిన్ = మిక్కిలిఅనురాగముతో; మోము, నివిరి = మొగముతడివి; తద్, వృత్తాంతము, ఎల్లన్ = ఆసంగతియంతయు, వెలఁదులును = స్త్రీలును; అంతఃపురవాసులును = అంతఃపురము

నందలివారును; చెప్పఁగన్ = చెప్పఁగా; విని = విని; పరపుగన్ = విస్తారముగా ; నిట్టూర్పులు = దీర్ఘనిశ్వాసములు ; ఎసఁగన్ = ఎక్కువయగునట్లు ; బాష్ప, ఆకుల, ఐ = కన్నీటిచేత కలఁతనొందినదై

తా. సునీతి మిక్కిలియు ప్రేమతోఁ దనకుమారుని మొగముతడవి, జరిగినవృత్తాంతమంతయు చెలికత్తెలును అంతఃపురవాసులును జెప్పఁగా విని నిట్టూర్పులువిడుచుచు కన్నీరుకార్చుచు- (ముందుపద్యముతో నన్వయము.)

తే. గీ. సవతి యాడిన మాటలు ♦ సారెఁ దలఁచి
కొనుచుఁ బేర్చినదుఃఖాగ్నిఁ ♦ గుందుచుండె
దావపావకశిఖలచేఁ ♦ దగిలి కాంతి
వితతిఁ గందిన మాధవీ ♦ లతిక పోలె. 11

అర్థ. సవతి = తనసపత్నియైన సురుచి; ఆడిన = పలికిన; మాటలు = మాటలను; సారెకు = పలుమారు, తలఁచికొనుచు = జ్ఞప్తికి తెచ్చుకొనుచు ; పేర్చిన = ఎక్కువయగుచున్న ; దుఃఖ అగ్ని = దుఃఖమనెడి అగ్నిచేత; దావ, పావక, శిఖలచేన్ = కార్చిచ్చుమంటలచే ; తగిలి = ఆవరింపఁబడి ; కాంతి, వితతిన్ = కాంతిసమూహముచే ; కందిన వాడిన ; మాధవీలతిక, పోలెన్ = గురువిందతీఁగవలె ; కుందుచుండెన్ = దుఃఖించుచుండెను

తా. తనసవతియైన సురుచి పలికినపలుకులను మాటిమాటికిని దలంచుకొనుచు, దుఃఖమతిశయించుచుండఁగా, కార్చిచ్చుమంట లంటుకొనిన మాధవీలతవలె మిక్కిలియు కాంతిమాసి శోకించుచుండెను.

వ. అంత నాసునీతి బాలకుం జూచి తండ్రి దుఃఖింపకు మని యిట్లనియె

అర్థ. అంతన్ = పిమ్మట; ఆసునీతి = సునీతి; బాలకునిన్, చూచి = కొడుకగు ధ్రువునిచూచి ; తండ్రీ, దుఃఖింపకుము = నాయనా; విచారింపకుము ; అని, ఇట్లనియె = అనిపలికి యిట్లు చెప్పెను.

తా. అప్పుడా సునీతి ధ్రువునిఁజూచి- నాయనా, విచారింపవ లదు, అనిపలికి మరల నిట్లుచెప్పెను.

క, అనఘా ! యీదుఃఖమునకుఁ
బనిలే దన్యులకు సొలయ న్ బలవంతంబై
తనపూర్వజన్మదుష్కృత
ఘనకర్మము వెంటనంటఁగా న్ నెవ్వలనన్. 12

అర్థ. అనఘా = పాపములేనివాఁడా, ధ్రువుఁడా, ఏ, వలనన్ = అన్ని విధముల చేతను ; అన్యులకున్, సొలయన్ = ఇతరులచే బాధపడ వలయునని ; బలవంతంబై = దాఁటశక్యముకానిదై; తన, పూర్వ, జన్మ, దుష్కృత, ఘన, కర్మము = తనపూర్వజన్మమందు చేసికొనిన పాపము వలనఁగలిగిన గొప్పకర్మము ; వెంటనంటఁగా = వెంటననుసరించి యుం డగా ; దుఃఖమునకుఁబనిలేదు = ఈదుఃఖముపొందుటవలన కార్యములేదు.

తా. పాపరహితుఁడా ధ్రువుఁడా ! మనపూర్వజన్మమునందు చేసిన పాపమునకు ఫలముగా ఇతరులవలన మనము బాధలుపడవలసి యుం డఁగా ఈదుఃఖమువలన నేమిప్రయోజనము ?

వ. కావున.

అర్థ. కావునన్ = అందుచేత.

క. పెనిమిటిచేతను పెండ్లా
మనికాదు, నికృష్టదాసి న్ యనియును బిలువం
గను జాలని దుర్భగురా
లనఁగల నాకుక్షి నుదయ న్ మందినకతనన్. 15

అర్థ. పెనిమిటిచేతను = భర్తచేత; పెండ్లామని కాదు = భార్య అనికాక; నికృష్ట, దాసి, అనియును = నీచదాసి అని కూడ; పిలువం

గనుచాలని = పిలుచుటకుతగని; దుర్భగురాలు, అనఁగల = దురదృష్టశా లురాలని పిలుచుటకుతగిన; నాకుక్షిన్ = నాగర్భమునందు; ఉదయమందినకత నన్ = పుట్టుటవలన.

తా. భర్త నన్ను భార్యయని పిలువకుండుట యటుండఁగ ఓనీచదాసీ! అనికూడ పిలుచుటకుఁదగని నాయట్టి దురదృష్టవంతురాలి కడుపునఁబుట్టితివి కనుక - (ముందుపద్యముతో నన్వయము.)

క. నిను నాడిన యా సురుచి వ
చనములు సత్యంబులగును ♦ సర్వశరణ్యుం
డనఁగల హరిచరణంబులు
గను జనకునియంక మెక్కఁ ♦ గాఁ దలఁతేనిన్.

అర్థ. నినున్, ఆడిన = నిన్నుదూషించినట్టి; ఆ, సురుచి, వచనములు = అనుచితమాటలు; సత్యంబులు, అగును = సత్యమైనవే, సర్వశరణ్యుండు, అనఁగన్ = సమస్తప్రాణికోటికిని శరణు జొచ్చుటకు వీలగువాఁడనఁగల; జనకుని, అంకము. ఎక్కఁగాన్. తలఁతు, ఏనిన్ = తండ్రితొడపైనెక్కుటకు కోరెదవేని; హరిచరణంబులు. కనుము = శ్రీమహావిష్ణుని పాదములనాశ్రయింపుము

తా. నిన్నుదూషించుచు సురుచి పలికిన పలుకులన్నియును సత్యంబులే. నీవు నీతండ్రితొడపై నెక్కఁగోరితివేని సమస్తప్రాణులకును రక్షకుఁడగు శ్రీహరిపాదముల నాశ్రయింపుము.

వ. కావునం బినతల్లియైన యా సురుచియాదేశంబున నధో క్షజు నాశ్రయింపు మని వెండియు నిట్లనియె.

అర్థ. కావునన్ = అందుచేత; పినతల్లి, ఐన = సవతితల్లియగు; ఆ, సురుచి, ఆదేశంబునన్ = ఆసురుచి అజ్ఞప్రకారము; అధోక్ష జున్ = ఇంద్రియములను జయించినవారికి సులభుఁడైన శ్రీహరిని ఆశ్రి;

యింపుము, అని = శరణము వేఁడుము అని; వెండియన్, ఇట్లు అని యెన్ = తిరిగి యిట్లు చెప్పెను

తా. అందు చేత నీవు నీసవతితల్లి యైన సురుచియాజ్ఞాప్రకారము జితేంద్రియుడవై శ్రీహరి నాశ్రయింపు మని తిరిగి యిట్లు చెప్పెను.

సీ. పరికింప నీవిశ్వ ♦ పరిపాలనమునకై
యర్థి గుణవ్యక్తుఁ ♦ డైనయట్టి
నారాయణుని పాద ♦ నలినముల్ సేవించి
తగ బ్రహ్మ బ్రహ్మప ♦ దంబునొందె
ఘనుఁడు మీ తాత యా ♦ మనువు సర్వాంతర
యామిత్వమగు నేక ♦ మైనదృష్టిఁ
జేసి యాగముల య ♦ జించి తా భౌమసు
ఖములను దివ్యసు ♦ ఖములమోక్ష
సుఖములను బొందె నట్టియ ♦ చ్యుతునిఁ బరుని
వితతయోగీంద్ర నికర సం ♦ వేష్ట్యమాణ
చరణసరసిజయుగళు శ ♦ శ్వత్ప్రకాశు
భక్తవత్సలు విశ్వసం ♦ పాద్యు హరిని.

అర్థ. పరికింపన్ = పరీక్షింపఁగా; ఈవిశ్వ, పరిపాలనమునకై = ఈజగత్తునంతటిని పరిపాలించుటకొఱకు; అర్థిన్ = కోరికతో; గుణవ్యక్తుఁడు, ఐనయట్టి = గుణములచేతనే తెలియుటకువీలయిన; నారాయణుని = నారాయణమూర్తి యొక్క; పాదనలినముల్ = పాదపద్మములను; సేవించి = ఆశ్రయించి; తగన్ = ఒప్పునట్లుగా; బ్రహ్మ = బ్రహ్మదేవుఁడు; బ్రహ్మపదంబున్, అందెన్ = తనబ్రహ్మపదవినిపొందెను; ఘనుఁడు = గొప్పవాఁడగు; మీ, తాత- ఆ, మనువు = మీతండ్రియైన ఆస్వాయం

భువమనువు; సర్వాంతరయామిత్వము, అగు = సర్వమునందును ఈశ్వరుఁడు నిండియున్నాఁడను; ఏకదృష్టిఁజేసి = నిశ్చలమైన తలంపుతో; యాగములన్ = యజించి = యజ్ఞములుచేసి, తాన్ = తాను; భౌమసుఖముల = ఐహికసుఖములను; దివ్యసుఖములన్ = స్వర్గసౌఖ్యములను, మోక్షసుఖములను = సంసారమునుండి విముక్తిం బొందుటవలనఁ గలుగుసుఖములను; పొందెన్ = పొందెను; అట్టి = అటువంటి; అచ్యుతునిన్ = నాశనములేనివానిని; పరుని = అంతఅకంటెను శ్రేష్ఠుఁడైనవానిని, వితత. యోగీంద్రనికర,సంవేష్ట్యమాణ = సమస్తయోగీంద్రసంఘము చేతను చుట్టబడియున్న; చరణ, సరసిజ, యుగళున్ = పాదపద్మముల జంటనుగలవానిని, శశ్వత్, ప్రకాశున్ = శాశ్వతముగా వెలుగుచుండువానిని, భక్తవత్సలున్ = భక్తులయెడల బిడ్డలయందువలె ప్రేమగలవానిని; విశ్వ, సంపాద్య[illegible] = విశ్వమునంతటిని రక్షించువానిని హరిని = విష్ణుమూర్తిని

తా. బ్రహ్మ తనపదవినిపొందుటకును మీతాతయైన స్వాయంభువమనువు ఐహిక, పారలౌకిక, మోక్షసుఖములను బొందుటకును, ఏ యచ్యుతుని, వరుని, యోగీంద్రసేవితుని, శాశ్వతప్రకాశముకలవానిని, భక్తవత్సలుని సేవించిరో ఆ శ్రీహరిని. [ముందుపద్యముతో నన్వయము.]

వ. మఱియును.

అర్థ. మఱియును = ఇంకను.

క. కరసరసీజగృహీతాం
బురుహాయు నరవిందగర్భ • ముఖగీర్వాణుల్
పరికింపంగల లక్ష్మీ
తరుణీమణిచేత వెదకఁ • దగు పరమేశున్. 20

అర్థ. కర, సరసిజ, గృహీత, అంబురుహాయున్ = పద్మమువంటి చేతితో పట్టుకొనఁబడిన పద్మముకలదియు; అరవిందగర్భ, ముఖగీర్వాణుల్ = తామరపువ్వునందు పుట్టినబ్రహ్మయు మొదలయిన దేవతలు; పరి

కింపఁగల = వెదుకఁబడఁదగినట్టి; లక్ష్మీ, తరుణీమణి చేత = లక్ష్మియనెడు శ్రేష్ఠురాలగు స్త్రీచేత; వెదకఁదగు = కనఁగొనఁదగినట్టి; పరమేశున్ = శ్రేష్ఠుఁడైనప్రభువును.

తా. చేతియందు తామరపువ్వునుబట్టుకొని బ్రహ్మాదులచే వెదుకఁదగిన లక్ష్మిచే వెదకఁజగిన యాప్రభుశ్రేష్ఠుని. [ముందుపద్యముతో నన్వయము.]

-: ధ్రువుండు నారదోపదేశంబువడసి తపంబుసేయుట :-

వ. నిజధర్మపరిశోభితంబైన యేకాగ్రచిత్తంబున నిలిపి సేవిం పుమమ్మహాత్మునికంటె నీదుఃఖంబపనయించువాఁ డన్యుం డొక్కరుండుకలండే యని పలికినఁ బరమార్థప్రాప్తిహేతుకంబులైన తల్లివాక్యంబులు విని తన్నుఁదాన నియమించుకొని పురంబువెడలి చను నవసరంబున నారదుండు తద్వృత్తాంతంబెఱింగి యచ్చటికిం జనుదెంచి యతనిచికీర్షితంబు దెలిసి పాపనాశకరంబైన కరతలంబున నాధ్రువుని శిరంబంటి మానభంగంబునకు సహింపని క్షత్త్రియుల ప్రభావం బద్భుతంబుగదా బాలకుండయ్యుఁ బినతల్లియాడిన దురుక్తులు చిత్తంబునంబెట్టి చనుచున్న వాఁడని మనంబున నాశ్చర్యంబునొంది, "యోబాలక ! సకలసంపత్సమృద్ధంబగు మందిరంబుదెగడి యొంటి నెందు నేగెదవు ? స్వజనకృతంబగు నవమానంబుచే నిను సంతప్తుఁగాఁదలంచెద" ననిన ధ్రువుం డిట్లనియె, "సపత్నీమాతృవాగిషుక్షతంబగు వ్రణంబు భగవద్ధ్యానయోగరసాయనంబున మాపికొందు" ననిన విని ధ్రువునకి నారదుం డిట్లనియె.

అర్థ. నిజ= తనదైన; ధర్మ= ధర్మముచేత; పరిశోభితంబు, ఐన= పరికాశించునట్టి; ఏకాగ్రి, చిత్తంబునన్= ఒక్కలక్ష్యమునందే నిలిపిన మనస్సునందు; నిలిపి= ఉంచి; సేవింపుము= కొలువుము; అమ్మహాత్ముని కంటెన్= ఆపరమపురుషుఁడగుశ్రీహరికంటెను; నీదుఃఖంబు, అపనయించువాఁడు = నీదుఃఖమును తొలఁగింపఁగలవాఁడు; అన్యుఁడు, ఒక్కరుండు, కలండే = ఇతరుఁడొక్కఁడైనను గలఁడా? అని, పల్కనన్ = అనిచెప్పఁగా; పరమార్థ, ప్రాప్తి, హేతుకంబులు, ఐన = అన్నిటికంటెను శ్రేష్ఠవస్తువును పొందుటకు కారణములైన; తల్లివాక్యంబులు, విని = తల్లిచెప్పినమాటలు విని; తప్పు తాన, నియమించుకొని = తనకుఁ దానే తపస్సుచేయవలెనని నిశ్చయించుకొని; పురంబు, వెడలి, చను, అవసరంబునన్ = నగరము వదలివెళ్లునప్పుడు; నారదుండు = నారదమహర్షి తత్, వృత్తాంతంబు, ఎఱింగి = ఆసంగతిని తెలిసికొని; అచ్చటికిన్, చనుదెంచి= అచ్చటికివచ్చి; అతని చికీర్షితంబు తెలిసికొని= అతనికోరిక తెలిసికొని పాపనాశకరంబైన = పాపములను నశింపఁజేయునట్టి; కరతలంబునన్= చేతితో; ఆ, ధ్రువుని, శిరంబు, అంటి= ఆధ్రువునితలను ముట్టి; మానభంగమునకు= మానముపోవుటకు; సహింపని = ఓర్వలేని; క్షత్త్రియులప్రభావంబు = క్షత్త్రియుల మహిమ; అద్భుతంబుగదా= ఆశ్చర్యకరముగాదా; బాలకుండు, అయ్యును = చిన్నవాఁడైనను; సవతల్లి, ఆడిన దురుక్తులు = సవతితల్లిపలికిన దుర్వాక్యములను; చిత్తంబునన్, పెట్టి = మనస్సునందుంచుకొని; చనుచున్నవాఁడు, అని= ఈతఁడు తపస్సు చేయఁబోవుచున్నాఁడని; మనంబునన్, ఆశ్చర్యంబునన్, ఒంది= మనస్సులో ఆశ్చర్యమునుబొంది; ఓ, బాలక = ఓకుఱ్ఱవాఁడ; సకల, సంపత్, సమృద్ధంబు, అగు= సకల సంపదలచేతనిండియున్న; మందిరంబున్, తెగడి= యింటినివదలి, ఒంటిన = ఒక్కఁడవే; ఎందున్, ఏగెవు= ఎచటికి పోయెదవు? స్వజన, కృతంబు, అగు= నీబంధువులచేత చేయఁబడిన; అవమానంబుచేత = అవమానముచేత; నినున్ = నిన్ను, సం

తప్తున్, కాన్ = పరితపించుచున్నవానినిగా; తలంచెదన్ = తలంచుచు, న్నాను; అనినన్ = అనఁగా. ధ్రువుండు, ఇట్లు, అనియెన్ = ధ్రువుం డిట్లు పలికెను; సపత్నీమాతృ, వాక్, ఇషు, క్షతంబు, అగు = సవతితల్లి; మాటలనెడి బాణములచేఁ గొట్టఁబడిన; వ్రణంబున్ = పుండును; భగవత్ ధ్యాన, యోగ, రసాయనంబునన్ = భగవంతుని ధ్యానమునందు చేర్ప బడినమనస్సనెడు ఔషధముచేత; మాన్కొందున్ = పోగొట్టుకొందును అనినన్, విని = అది పలుకఁగావిని; ధ్రువునికి, నారదుండు, ఇట్లు, అని యెన్ = ధ్రువునితో నారదుఁడిట్లు పలికెను.

తా. ఆశ్రీహరిని ఏకాగ్రచిత్తముతో సేవించినయెడల నాతఁడు నీదుఃఖమును బోఁగొట్టును. అట్లుచేయఁగలవాఁడు మఱియొకఁడు లేఁడు. అని చెప్పఁగావిని ధ్రువుఁడు పురమువిడిచి పోవునప్పుడు నారదుఁడతని కెదురై యాతఁడు చేయనెంచినపనిని గ్రహించి, ఆతనిశిరస్సుమీఁద తనచేతినుంచి, ఆతనిప్రభావంబునకు ఆశ్చర్యమునొంది, ఆతనితో “బాలకా,, నీగృహమున సకలసంపదలు నున్నవిగదా ఇల్లువిడచి ఒంటరిగా ఎక్కడికి వెళ్ళుచున్నావు? నీవారెవరైన నిన్ను మాటలాడి యుందురు, అనఁగా ధ్రువుఁడు “సవతితల్లిమాటలచే కొట్టఁబడినదై నామనస్సు బాధ నొందుచున్నది. దానిని భగవద్ధ్యానమను ఔషధముచేత పోఁగొట్ట నెంచితిని,, అని చెప్పఁగా విని నారదుఁడు ధ్రువునితో నిట్లనెను.

క. విను పుత్త్రక! బాలుఁడవై
యనయంబును గ్రీడలందు • నాసక్తమనం
బునఁ దిరిగెడు నిక్కాలం
బున నీకవమానమాన • ములు లేవెందున్. 22

అర్థ. పుత్త్రక = కుఱ్ఱవాఁడా! విను = వినుము; బాలుఁడవై = చిన్న వాఁడవై; అనయంబును = ఎల్లప్పుడును; క్రీడలందు = ఆటలలో; ఆసక్త = తగులుకొనిన; మనంబునన్ = మనస్సుతో; తిరిగెడి = తిరుగ

వలసిన; ఈకాలంబునన్ = ఈవయస్సునందు; నీకు = నీకు; అవమాన మానములు = మానము, అవమానము అనునవి ; ఎందుఁ, లేవు = ఎప్పుడును ఉండఁగూడదు.

తా. బాలుఁడా! నీవయస్సున ఆటలాడుకొనుచుండవలసినదే గాని నీకు మానావమానములతోఁ బనిలేదు.

తే. గీ. కాన మనమునఁ దద్వివే ♦ కంబు నీకుఁ
గలిగెనేనియుఁ సంతోష ♦ కలితులయిన
పురుషు లాత్మీయకర్మ వి ♦ స్ఫురణఁ జేసి
వితత సుఖదుఃఖములనుభ ♦ వింతు రెపుడు. 23

అర్థ. కానన్ = అందుచేత; మనమునన్ = మనస్సులో; తద్, వివేకంబు = ఆమానావమానముల భేదము; నీకున్, కలిగెనేనియున్ = నీకుకలిగినట్టయితే; సంతోష, కలితులు, అయిన = సంతోషముంబొందినట్టి; పురుషులు = జనులు; ఆత్మీయ = తమయొక్క; కర్మ, విస్ఫురణన్, చేసి = సుకృత దుష్కృతములను కర్మలఫలముగా; వితత = విస్తారమైన; సుఖదుఃఖములు = సుఖములను దుఃఖములను; ఎపుడున్ = ఎల్లప్పుడును; అనుభవింతురు = పొందుదురు.

తా. నీకు మానావమానములను వివేకము కలిగినయెడల చెప్పెదను వినుము. సంతోషములనుపొందిన పురుషులు తమకర్మలకు ఫలముగా సుఖదుఃఖముల ననుభవించుచుందురు.

వ. కావున వివేకంబుగల పురుషుండు దనకుం బ్రాప్తంబులగు సుఖదుఃఖంబులు దైవవశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుండగు నీవును దల్లిచెప్పిన యోగమార్గప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబునం బొందెదనంటివేని. 24

అర్థ. కావునన్ = అందుచేత; వివేకంబు, కల, పురుషుండు = సదసద్వివేకముగలవాఁడు; తనకున్ = తనకు; ప్రాప్తంబులు, అగు = సంభవించునట్టి, సుఖదుఃఖంబులు = సుఖము, దుఃఖము అనునవి; దైవ, వశంబులు; కాన్ = దైవాధీనములని; తలంచి = ఎంచి; తావత్, మాత్రంబునన్ = ఆసమయమునకుమాత్రమే; పరితుష్టుండు, అగున్ = సంతోషించినవాఁడగును - నీవును = నీవుకూడ; తల్లి, చెప్పిన, యోగమార్గ ప్రకారంబునన్ = నీతల్లియుపదేశించిన యోగమార్గము ననుసరించి; సర్వేశ్వరఅనుగ్రహంబునన్, పొందెదను, అంటివి; ఏనిన్ = సర్వేశ్వరుని అనుగ్రహమును పొందెదనని తలంచినయెడల.

తా. తనకుసంభవించిన సుఖదుఃఖములు దైవవశమున గలిగినవని యెంచి ఆసమయమునకు మాత్రముసంతోషించువాఁడే వివేకి అనఁబడును. నీవు నీతల్లి యుపదేశప్రకారముగా సర్వేశ్వరునిధ్యానించి, అతనిదయను సంపాదించెదనని తలంచినయెడల [ముందుపద్యముతో నన్వయము.]

సీ. అనఘాత్మ యోగీంద్రు • లనయంబు ధరఁ బెక్కు
జన్మంబులందు ని • స్సంగమైన
మతిని బ్రయోగ సమాధి నిష్ఠలఁ జేసి
యైనను దెలియలే • రతనిమార్గ
మదిగాన నతఁడు దు • రారాధ్యుఁడగు నీవు
నుడుగుము నిష్ఫలో • ద్యోగ మిపుడు
గాక నిశ్శ్రేయస • కాముఁడ వగుదేనిఁ
దండ్రివర్తించు త • త్కాలమందుఁ
బూని సుఖదుఃఖములు రెంటి • లోన నెద్ది
దైవవశమునఁ జేకుఱు • దానఁ జేసి

డెందమునఁ జాల సంతుష్టి * నొందువాఁడు
విమలవిజ్ఞాని యన ధర * వెలయుచుండు

అర్థ. అనఘ ఆత్మ = పాపములేనివాఁడా! యోగ, ఇంద్రులు = గొప్పయోగులు ; అనయంబున్ = ఎల్లప్పుడును; ధరన్ = భూమియందు; పెక్కు, జన్మంబులందు = అనేకజన్మములలో; నిస్సంగము, ఐన, మతిని = ఫలములను కోరనికర్మలచేయుట యందాసక్తికలవారై; క్రియోగ = కర్మలను చేయుట; సమాధి = ఈశ్వరునియందుమనస్సును నిల్పుట; నిష్ఠలఁ జేసి, ఐనను = తదేకధ్యానము చేయుట మొదలయినవి చేసినప్పటికిని; అతని, మార్గము = ఈశ్వరుని చర్యను ; తెలియలేరు = తెలిసికొనలేరు ; అదిగాన = అందుచేత ; అతఁడు ; దురారాధ్యుఁడు, అగున్ = అతనిని నీవారాధించుట కష్టమగును ; నీవును = నీవు ; ఇపుడు = ఇప్పుడు ; నిష్ఫల, ఉద్యోగము = ఫలరహితమైన ప్రయత్నమును; ఉడుగుము = మానుము ; కాక = అట్లు చేయక ; నిశ్శ్రేయస, కాముఁడవు, అగుదు ఏనిన్ = మోక్షమును కోరినవాఁడయినయెడల ; తండ్రి = నీతండ్రియైనఉత్తానపాదుఁడు ; వర్తించు = బ్రతికియున్న ; తత్, కాలమందు = ఆకాలమున; పూని = శ్రద్ధతో ; సుఖ, దుఃఖములు, రెంటిలోనన్ = సుఖము, దుఃఖము అను రెండింటిలోను ; ఎద్ది = ఏది ; దైవవశమునన్, చేకుఱున్ = దైవవశమున ఏది ప్రాప్తించునో ; దానన్, చేసి = దానితో ; డెందమునన్ = మనస్సులో; చాలన్, సంతుష్టిన్ ఒందువాఁడు = ఎక్కువగా సంతోషించువాఁడు ; విమల, విజ్ఞాని, అనన్ = స్వచ్ఛమైన జ్ఞానముకలవాఁడని ధరన్ = భూమియందు ; వెలయుచుండున్ = ఒప్పుచుండును.

తా. ఓయీ పాపరహితుఁడవైన ధ్రువుఁడా ! మహాయోగీశ్వరులైనను యజ్ఞ, ధ్యాన, నిష్ఠలచేత పెక్కుజన్మములలోనైనను ఈశ్వరుని తెలిసికొనలేరు. కావున నీవాతనిఁ దెలిసికొని భజింపలేవు. నీ ప్రయత్నము విడువుము. నీకు మోక్షము కావలసినయెడల నీతండ్రి బ్రతికియున్నంత కాలము నీకు దైవవశమున కలుగు సుఖదుఃఖములను యథాప్రాప్తముగా

అనుభవించుచు సంతోషము పొందియుండును. అట్లు యథాలబ్ధ సంతుష్టుఁడయినవాఁడు జ్ఞానియని చెప్పఁబడును.

వ. మఱియు గుణాఢ్యుండగువానిం జూచి సంతోషించుచు నాభాసుండగువానిం జూచి కరుణించుచు సమానుని యెడ మైత్రిసలుపుచు వర్తించు చున్నవాఁడు తాపత్రయాదికంబులం దోఁఅంగునని నారదుండు పలికినవిని ధ్రువుం డిట్లనియె “వనఘా యీశమంబు సుఖదుఃఖహతాత్ములగు పురుషులకు దుర్గమంబని కృపాయుక్తుండవైన నీచేత వినంబడె నట్లయినం బరభయంకరంబగు క్షాత్రస్వభావంబు నొందిన యవినీతుండనగు నేను సురుచి దురుక్తిబాణ నిర్భిన్నహృదయుండ నగుట మదీయ చిత్తంబున శాంతి నిలువదు కావునం ద్రిభువనోత్కృష్టంబు నన్యాధిష్ఠితంబు నగు పదంబు నంబొంద నిశ్చయించిన నాకు సాధుమార్గంబు నెఱిగింపుము నీవు భగవంతుండగు నజుని యూరువువలన జనించి వీణావాదన కుశలుండవై జగద్ధితార్థంబు సూర్యుండునుంబోలె వర్తింతు వనిన విని. 26

అర్థ. మఱియున్ = ఇంకను ; గుణ, ఆఢ్యుండు, అగు, వానిన్ = సద్గుణములుగలవానిని; చూచి = చూచి; సంతోషించుచు = సంతోషమునుఁ పొందుచు ; ఆభాసుండు, అగు వానిన్ = దుర్గుణములుగలవానిని; చూచి = చూచి;కరుణించుచున్ = దయచూపుచు; సమానునియెడన్ = తనతో సమానుఁడయిన వానిపట్ల; మైత్రిసలుపుచు = స్నేహముచేయుచు ; వర్తించుచు, ఉన్నవాఁడు = ప్రవర్తించువాఁడు ; తాపత్రియ, ఆదికంబులన్

= ఆదిభూత, అధిదైవ, ఆధ్యాత్మ సంబంధములు అయిన తాపములను; త్రో
అంగున్ = విడచును ; అని = అని ; నారదుండు = నారదుఁడు ; పలికి
నన్ = చెప్పఁగా ; విని = విని ; ధ్రువుండు, ఇట్లు, అనియెన్ = ధ్రువుఁ
డిట్లు చెప్పెను ; అనఘా = పాపరహితుఁడవైన నారదుఁడా ; ఈశమం
బు = ఈశాన్తి అనగా సుఖదుఃఖముల నొక్కరీతిగా చూచుకొనుట ; సు
ఖ, దుఃఖ, హత, ఆత్ములు, అగు, పురుషులకు = సుఖదుఃఖప్రాప్తిచేత
చలనము కలిగిన మనస్సుగల మనుష్యులకు; దుర్గమంబు, అని = పొంద
శక్యము కాదని ; కృపా, ఆయత్తుండవు అయిన, నీచేతన్ = కృపతో
కూడియున్న నీ చేత ; వినంబడెన్ = చెప్పబడినది; అట్లు, అయినన్ =
అట్లయినయెడల ; పరభయంకరంబు అగు = శత్రువులకు భయముగొల్పె
డు ; క్షాత్రస్వభావంబునన్ = క్షత్రియస్వభావమును ; పొందిన = పొం
దినట్టి ; అవినీతుండను, అగు, నేను, = వినయములేని నేను ; సురుచి దురు
క్తి, బాణ, నిర్భిన్న హృదయుండను, అగుటన్ = సురుచి యాడిన కఠి
నవాక్కులను బాణములచే పగులగొట్టఁబడిన హృదయము కలవాఁడన
గుటచేత ; మదీయచిత్తంబునన్ = నామనస్సునందు ; శాంతి, నిలువదు =
శాంతికుదురుకొనదు ; కావునన్ = అందుచేత ; త్రిభువన, ఉత్కృష్టం
బును = మూడులోకములలోను శ్రేష్ఠమయినదియు ; అనన్య, అధిష్ఠి
తంబును = ఇతరులచేత పొందబడనట్టియు ; అగు = అయిన ; పదంబు
నన్ =, పొందన = స్థానమును పొందుటకు ; ఇచ్ఛయించిన = కోరిన ; నా
కు = నాకు ; సాధు మార్గంబును = మంచిమార్గమును ; ఎఱిగింపుము
= తెలుపుము ; నీవు = నీవు ; భగవంతుండు, అగు = ఐశ్వర్యయుక్తుఁడైన ; అ
జుని = బ్రహ్మయొక్క ; ఊరువు వలనన్ = తొడనుండి ; జనించి = పుట్టి ;
వీణావాదన కుశలుండవు, ఐ = వీణవాయించుటయందు నేర్పరివై ; జ
గత్, హిత, అర్థంబు = లోకములమేలుకొఱకు ; సూర్యుండునుంబోలె, పో
లెన్ = సూర్యుని వలె ; వర్తింతువు, అనినన్, విని = తిరుగుచుందువు అని
పలుకఁగా విని; (ముందుపద్యముతో అన్వయము.)

తా. గుణవంతునిఁ జూచి సంతోషించుచు, దుర్గుణునిఁ జూచి దయ చూపుచు, సమానునితో స్నేహము చేయుచు జీవనము గడపువాఁడు తాపత్రయములను విడుచునని నారదుఁడు చెప్పఁగా విని ధ్రువుఁడు "అయ్యా, సుఖదుఃఖములచే సంచలనము పొందిన మనస్సునకు శాంతిలేదని నీవు చెప్పితివి. నాకు శత్రుభీతికరంబైన క్షాత్రస్వభావము కలుగుచున్నది. నేను నా మనస్సును నిలుపఁజాలను. కనుక మూఁడులోకములలోను శ్రేష్ఠమును, ఇతరులచే పొందఁబడనట్టియు స్థానమును పొందఁగోరిన నాకు దానిని పొందఁదగు మార్గమును తెలుపుము. నీవు బ్రహ్మకుమారుఁడవు. వీణను వాయించుటయందు నేర్పరివి. సూర్యుఁడు సర్వలోకహితార్థమై యెట్లు సంచరించుచుండునో నీవును అట్లే లోకములందు సంచరించుచుందువు" అని పలుకఁగా విని- [ముందు పద్యముతో అన్వయము.]

క. నారదుఁ డిట్లను ననఘ కు
మారక విను నిన్ను మోక్ష * మార్గంబునకుం
బ్రేరేచినవాఁ డిప్పుడు
ధీరజనోత్తముఁడు వాసు * దేవుం డగుటన్. 27

అర్థ. నారదుఁడు, ఇట్లు, అనున్ = నారదుఁ డిట్లనుచున్నాఁడు; అనఘ, కుమారక = పాపములేనివాఁడా; కుఱ్ఱా; విను = వినుము; నిన్ను = నిన్ను; మోక్షమార్గంబునకున్ = మోక్షము నొందుటకు; ప్రేరేచినవాఁడు = ప్రేరేపించినవాఁడు; ఇపుడు = ఇప్పుడు; ధీరజన ఉత్తముఁడు = ధైర్యముగల జనులలో శ్రేష్ఠుఁడైన; వాసుదేవుండు, అగుటన్; విష్ణుమూర్తి. అగుటచేత (ముందుపద్యముతో అన్వయము)

తా. నారదుఁ డిట్లనుచున్నాఁడు, "పాపరహితా, కుమారా, వినుము, నిన్నిప్పుడు మోక్షముపొంద ప్రేరేపించినవాఁడు విష్ణుమూర్తి యగుటచేత- [ముందుపద్యముతో అన్వయము.]

వ. నీవు నమ్మహాత్ముని పదధ్యానప్రవణ చిత్తుండవై భజియింపుము. 28

అర్థ. నీవును = నీవును; ఆ, మహాత్మునిన్ = ఆపరమపురుషుని; పద, ధ్యాన, పరిణత చిత్తుండవు, ఐ = పాదధ్యానమునం దాసక్తి పొందినమనస్సుకలవాఁడవై; భజియింపుము = కొలువుము,

తా. నీ వాతని పాదధ్యానమునందు మనస్సునిలిపి సేవింపుము.

క. పురుషుఁడు దవిలి చతుర్విధ
పురుషార్థశ్రేయము మాత్మఁ * బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదయుగళంబు దక్క * నన్యము గలదే. 29

అర్థ. పురుషుఁడు = మనుష్యుఁడు; తవిలి = కోరికతో; చతుర్విధ; పురుషార్థ = ధర్మార్థకామమోక్షములఫలనగలుగు; శ్రేయము = శ్రేయస్సు ఆత్మన్ = మనస్సునను; పొందెదన్, అనినన్ = పొందెద నన్న యెడల; ధరన్ = భూమియందు; తత్, ప్రాప్తికిన్ = దానిని పొందుటకు; హేతువు = సాధనము; హరి, పద, యుగళంబు, తక్కన్ = శ్రీహరిపాదపద్మములజ టతప్ప; అన్యము = ఇతరము; కలదే = కలదా ?

తా. మనుష్యుఁడు ధర్మార్థకామమోక్షములఫలమును పొందఁగోరిన యెడల శ్రీహరి పాదపద్మములను సేవించుటకంటె మఱియొక సాధనము లేదు.

వ. కావున

అర్థ. కావునన్ = కాఁబట్టి.

క. వర యమునానదితటమున
హరిసాన్నిధ్యంబు. శుచియు * నతిపుణ్యమునై
పరఁగిన మధువనమునకును
సరసగుణా చనుము మేలు * సమకూఱు నచటన్. 31

అర్థ. వర = శ్రేష్ఠమైన; యమునానది, తటమునన్ = యమునయను నది ఒడ్డున; హరి, సాన్నిధ్యంబు = విష్ణుమూర్తికి చేరువయు; శుచియు =

పవిత్రమును; అతిపుణ్యమును, ఐ = మిక్కిలిపుణ్యవంతము నై; పరఁగిన = ఒప్పిన; మధువనమునకును = మధువనమును అనునికి; సరసగుణా = మంచి గుణములుగల ధ్రువుఁడా; చనుము = వెళ్లుము; అచటన్ = అచ్చట; మేలు, సమకుఱున్ = మేలుకలుగును.

తా. ధ్రువుఁడా, నీవు యమునానది ఒడ్డున హరికిసమీపమును, పవిత్రమును, పుణ్యవంతము నైన మధువనమునకు పొమ్ము అచ్చట నీకు మేలు కలుగును.

క. ఆ యమునాతటినీ శుభ
తోయములం గ్రుంకి నిష్ఠ ♦ తో నచ్చట నా
రాయణునకును నమస్కృతు
లాయతమతిఁ జేసి చేయు ♦ యమనియమములన్ 32

అర్థ. ఆ, యమునాతటినీ, శుభతోయములన్ = ఆ యమునానది పవిత్రజలమందు; క్రుంకి = మునిగి; నిష్ఠతోన్ = శ్రద్ధతో; అచ్చటన్ = అక్కడ; నారాయణునకున్ = విష్ణుమూర్తికి; నమస్కృతులు = నమస్కారములు; ఆయతమతిన్, చేసి = స్వాధీనమందుంచఁబడిన మనస్సుతో చేసి; యమ నియమములన్ = యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ మనన, సమాధులను అష్టాంగయోగములతో; చేయుము = చేయుము.

తా. ఆ యమునానది పవిత్రజలములందు స్నానము చేసి, అచ్చట నారాయణునకు నమస్కరించి, యోగధ్యానము చేయుము.

వ. మఱియు బాలుండవగుటం జేసి వేదాధ్యయనాద్యుచిత కర్మానష్ఠాండ వయ్యు నుచితంబులగు కుశాజినంబులం జేసి స్వస్తిక ప్రముఖాసనంబులం గల్పించికొని త్రివృత్ప్రాణా యామంబులం చేతం బ్రాణేంద్రియమనోమలంబులను

జాంచల్యదోషంబులఁ బ్రిత్యాహరించి స్థిరంబయిన చిత్తం
బున. 33

అర్థ. మఱియు = ఇంకను; బాలుండవు, అగుటంజేసి = చిన్నవాఁడ వగుటచేత; వేద, అధ్యయన, ఆది ఉచిత, కర్మ, అనర్హుండవు, అయ్యున్ = వేదాధ్యయనము మొదలగు కర్మలను చేయుటకు నీకధికారము లేకున్నను; ఉచితంబులు, అగు = నీకుతగినట్టి; కుశ, అజినంబులన్, చేసి = దర్భలు, జింకచర్మములు మొదలయినవానితో; స్వస్తిక, ప్రముఖ ఆసనంబులన్ = స్వస్తిక మొదలగు ఆసనంబులను; కల్పించికొని = వైచికొని; త్రివృత్; ప్రాణాయామంబులచేతన్ = మూఁడువిధములైన కుంభక, పూరక, రేచకరూపమైన ప్రాణాయామములతో; ప్రాణ, ఇంద్రియ మనః మయంబులు = ప్రాణమునకును, ఇంద్రియములకును, మనస్సునకును సంబంధించిన; చాంచల్యదోషంబులన్ = చంచలత్వమను దోషములను; ప్రత్యాహరించి = విడిచిపెట్టి, స్థిరంబయిన, చిత్తంబునన్ = ఏకాగ్రచిత్తముతో, (ముందుపద్యముతో అన్వయము.)

తా. నీవు బాలుఁడవు. కావున నీవు వేదాధ్యయనాది కర్మలఁ జేయుట కర్హుఁడవు కావు. అయినను నీకు తగునట్లు దర్భలను జింకచర్మములను కల్పించుకొని అందుపై యోగాసనములను వైచికొని, ప్రాణాయామము చేయుచు, ప్రాణేంద్రియమనస్సులకు సంబంధించిన దోషములను పరిహరించి ఏకాగ్రచిత్తముతో, [ముందుపద్యముతో నన్వయము]

సీ. ఆశ్రితసత్ప్రసా ♦ దాభిముఖుండును
నిద్ధప్రసన్నాన ♦ నేక్షణుండు
సురుచిరనాసుండు ♦ సుభ్రూయుగుండును
సుకపోలతలుఁడును ♦ సుందరుండు
హరినీలసంశోభి ♦ తాంగుండుఁ దరుణుండు
నరుణావలోకనో ♦ ష్ఠాధరుండుఁ

గరుణాసముద్రుండుఁ • బురుషార్థనిధియును
ప్రణతాశ్రయుండు శో • భనకరుండు

తే. లలిత శ్రీవత్సలక్షణలక్షితుండు
సర్వలోకశరణ్యుండు • సర్వసాక్షి
పురుషలక్షణయుక్తుండుఁ • బుణ్యశాలి
యసితమేఘనిభశ్యాముఁ • డవ్యయుండు. 34

అర్థ. ఆశ్రిత = ఆశ్రయించినవారికి; సత్, ప్రసాద, అభిముఖుండును = మంచివరములు నిచ్చుటకు సిద్ధముగనున్నవాఁడును; ఇద్ధ, ప్రసన్న ఆనన, ఈక్షణుండు = స్తుతింపఁదగిన ప్రసన్నతతోఁ గూడిన ముఖమును చూపునుగలవాఁడును; సు, రుచిర నాసుండు = మనోహరమైన ముక్కు గలవాఁడును; సు, భ్రూ, యుగుండును = చక్కని రెండు కనుబొమలు కలవాఁడును; సు, కపోల, తలుఁడును = మంచినుదుటిభాగముగలవాఁడును; సుందరుండు = చక్కనివాఁడును; నీరదనీల, సంశోభిత, అంగుండు = ఇంద్రనీలమణులవలె కాంతిగల శరీరముగలవాఁడును; తరుణుండు = యౌవనవంతుఁడును; అరుణ, అవలోకన, ఓష్ఠ, అధరుండు = ఎఱ్ఱని చూపులును, పెదవులునుగలవాఁడును; కరుణాసముద్రుండు = కరుణకు సముద్రమువంటివాఁడును; పురుషార్థనిధియును = ధర్మార్థకామమోక్షములను ఆటపట్టయినవాఁడును; ప్రణత, ఆశ్రయుండు = తన్ను నమస్కరించువారికి ఆశ్రయమైనవాఁడును; శోభనకరుండు = కల్యాణమునుకలుగఁ జేయువాఁడును; లలిత = సుందరమైన; శ్రీవత్స, లక్షణ, లక్షితుండు = శ్రీవత్సమను లాంఛనముతో నొప్పువాఁడును; సర్వలోక, శరణ్యుండు = సర్వలోకములును శరణుచొరఁదగినవాఁడును; సర్వసాక్షి = సమస్తమును చూచుచున్నవాఁడును, పురుషలక్షణ, యుక్తుండు = మహాపురుషలక్షణములుగలవాఁడును; పుణ్యశాలి = పుణ్యవంతుఁడును; అసిత,

మేడు, నిభ శ్యాముఁడు = నల్లని మేఘము వలె శ్యామవర్ణము గలవాఁడును;
అవ్యయుండు = నాశనములేనివాఁడును. (ముందుపద్యము తో నన్వయము)

తా. ఆశ్రితుల కభిముఖుఁడై ఉన్నవాఁడును, ప్రసన్నమైన ముఖమును చూపులును గలవాఁడును, మంచిముక్కును, కనుబొమలును, గలవాఁడును, మంచి నుదురు గలవాఁడును, చక్కనివాఁడును, ఇంద్రనీలకాంతిగల శరీరము గలవాఁడును, యౌవనస్థుఁడును, ఎఱ్ఱని చూపులును పెదవులును గలవాఁడును, కరుణాసముద్రుఁడును, చతుర్విధ పురుషార్థములకు తావయినవాఁడును, తన్ను, నమస్కరించువారికి ఆశ్రయుఁడును, కళ్యాణకరుఁడును, శ్రీవత్సలాంఛనుఁడును, సర్వలోకశరణ్యుండును, సర్వసాక్షియు, మహాపురుషలక్షణములు గలవాఁడును, పుణ్యవంతుఁడును, నీలమేఘశ్యాముఁడును; నాశనములేనివాఁడును- (ముందుపద్యముతో నన్వయము)

వ. మఱియును

అర్థ. మఱియును = ఇంకను.

సీ. హారకిరీటకే • యూరకంకణ ఘన
భూషణుం డాశ్రిత • పోషణుండు
లాలితకాంచీక • లాపశోభితకటి
మండలుం డంచిత • కుండలుండు
మహనీయకౌస్తుభ * మణికీలితాచ్ఛ వై
వేయకుం డానంద • దాయకుండు
సలలిత ఘనశంఖ • చక్రగదా పద్మ
హస్తుండు భువనప్ర • శస్తుఁడజుఁడుఁ
గమ్రసౌరభ వనమాలి • కాధరుండు
హతవిమోహుండు సర్వ పీ • తాంబరుండు

లలితకాంచన నూపురా ♦ లంకృతుండు
నిరతిశయ సద్గుణుండు దర్శ ♦ నీయతముండు. 36

అర్థ. హార, కిరీట కేయూర, కంకణ, ఘన, భూషణుండు = హారములు, కిరీటము, భుజకీర్తులు, కంకణములు మొదలగు గొప్ప అలంకారములను ధరించినవాఁడును; ఆశ్రితపోషణుండు = ఆశ్రితులను పోషించువాఁడును; లాలిత, కాంచీకలాప, శోభిత, కటిమండలుండు = చక్కని మొలనూలితో ఒప్పుచున్న కటిప్రదేశముగలవాఁడును; అంచిత, కుండలుండు = చక్కని కుండలములు గలవాఁడును; మహనీయ, కౌస్తుభమణి కీలిత, అచ్ఛ, గ్రైవేయకుండు = గొప్పదయిన కౌస్తుభమణి తాఁపిన చక్కని కంఠహారములు గలవాఁడు; సలలిత, ఘన, శంఖ చక్ర, గదా, పద్మ, హస్తుండు = చక్కని శంఖము, చక్రము, గద, పద్మము అనువానిని చేతియందు ధరించినవాఁడును భువనప్రశస్తుఁడు = లోకములందెల్ల శ్రేష్ఠుఁడును; అజుఁడు = పుట్టువులేనివాఁడును; కమ్ర, సౌరభ, వనమాలికా, ధరుండు = కమ్మని వాసనగల వనమాలికలను ధరించినవాఁడును; హత, విమోహుండు = మోహములేనివాఁడును, నవ్య, పీతాంబరుండు = క్రొత్తదయిన పీతాంబరమును ధరించినవాఁడును; లలిత, కాంచన, నూపుర, అలంకృతుండు = చక్కని బంగారపు అందెలచేత అలంకరింపఁబడినవాఁడును; నిరతిశయ, సద్గుణుఁడు = సాటిలేని సద్గుణములు గలవాఁడును; దర్శనీయతముఁడు = చూడచక్కనివాఁడును, (ముందు పద్యముతో అన్వయము.)

తా. స్పష్టము.

క. సరసమునోలోచనము
త్కరుఁడు సుహృత్పద్మకర్ణి ♦ కానివసితవి
స్ఫురదురునఖమణిశోభిత
చరణసరోజాతుఁ డతుల ♦ శాంతుఁడు ఘనుఁడున్. 37

అర్థ. సరస, మనోలోచన, ముత్, కరుఁడు = రసికత్వముగల మనస్సను కంటికి సంతోషము గలిగించువాఁడును; సుహృత్, పద్మ = స్నేహితుఁడను పద్మములోని; కర్ణికా = దుద్దులో; నివసిత = నివాసము చేయుచున్న; విస్ఫురత్, ఉరు, నఖమణి = ప్రకాశించు పెద్దగోళ్లను మణులచేత; శోభిత = ప్రకాశింపఁజేయఁబడిన; చరణ సరోజాతుఁడు = పాదపద్మములుగలవాఁడును; అతుల, కాంతుఁడు = సాటిలేని కాంతము గలవాఁడును; ఘనుఁడున్ = గొప్పవాఁడును; (ముందుపద్యముతో అన్వయము.)

తా. మనస్సునకు సంతోషము కలిగించువాఁడును, తనకు స్నేహితులయినవారిచేత నమస్కరింపఁబడు పాదపద్మములుగలవాఁడును మిక్కిలి కాంతుఁడును, గొప్పవాఁడును-[ముందుపద్యముతో అన్వయము.]

వ. అయిన పురుషోత్తముం బూజించుచు హృదయగతుండును, సానురాగవిలోకనుండును, వరదశ్రేష్ఠుండును నగు నారాయణు నేకాగ్రచిత్తంబునం ధ్యానంబు సేయుచుఁ బరమనివృత్తిమార్గంబున ధ్యానంబు సేయంబడ్డ పురుషోత్తముని దివ్యమంగళస్వరూపంబు చిత్తంబునం దగిలిన నురల మగుడ నేరదదియునుం గాక యేమంత్రంబేని సప్తవాసరంబులు పఠియించిన ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగునట్టి ప్రణవయుక్తం బగు ద్వాదశాక్షరకలితంబును దేశకాలవిభాగవేది యగు బుధానుష్ఠితంబును నయిన వాసుదేవమంత్రంబునం జేసి 38

అర్థ. అయినపురుషోత్తమున్ = అయినట్టి పురుషశ్రేష్ఠుని; పూజించుచు = పూజ చేయుచు; హృదయగతుఁడును = హృదయమునందుండువాఁడును; సానురాగవిలోకనుండును = అనురాగముతోఁ గూడిన చూపు

లుగలవాఁడును; వరదశ్రేష్ఠుండును = వరములనిచ్చువారిలో నుత్తముఁడును, అగు = అయిన; నారాయణుఁడున్ = శ్రీమహావిష్ణువును ; ఏకాగ్రచిత్తంబునన్ = నిలుకడయైన మనస్సుతో; ధ్యానంబు, చేయుచున్ = ధ్యానించుచు; పరమ, నివృత్తి, మార్గంబునన్ = గొప్పదయిన మోక్షమార్గమునందు, ధ్యానంబు, చేయఁబడ్డ = ధ్యానింపఁబడిన; పురుషోత్తముని, దివ్యమంగళ, స్వరూపంబు = శ్రీమహావిష్ణువుయొక్క కాంతిమంతమయినరూపము ; చిత్తంబునన్ = మనస్సులో ; తగిలినన్ = కుదురుకొన్నయెడల; మరలన్, మగుడన్, సేరదు = తిరిగిపోఁజాలదు ; అదియునుం గాక = ఇంతేకాక ; ఏమంత్రంబేని = ఏమంత్రమయితే ; సప్తవాసరంబులు, పఠియించినన్ = ఏడుదినములు జపించినయెడల; ఖేచరులన్, కనుంగొను, సామర్థ్యంబు, కలుగు = దేవతలను కనుఁగొనుశక్తి గలుగునో; అట్టి = అటువంటి; ప్రణవయుక్తంబగు = ఓంకారసహితమైన; ద్వాదశాక్షరకలితంబును = "ఓంనమో భగవతే వాసుదేవాయ" అను పండ్రెండక్షరములతోఁ గూడినదియును, దేశ, కాల, విభాగ, వేది అగు = దేశకాలభేదమును తెలిసికొన్న ; బుధ = ప్రాజ్ఞులచేత, అనుష్ఠితంబును, అయిన = ఆచరింపఁబడునదియు నయిన ; వాసుదేవమంత్రంబునం జేసి = వాసుదేవమంత్రమువలన. [ముందుపద్యముతో అన్వయము.]

తా. స్పష్టము.

సీ. దూర్వాంకురంబుల ♦ దూర్వాంకురశ్యాముఁ
జలజంబులను జారు ♦ జలజనయనుఁ
దులసీదళంబులఁ ♦ దులసికాదాముని
మాల్యంబులను సున్నై ♦ రన్మాల్యచరితుఁ
బత్త్రంబులను బక్షి ♦ పత్త్రునిఁ గడు వన్య
మూలంబులను నాది ♦ మూలఘనుని

సంచితభూర్జత్వ • గాదినిర్మితవివి
ధాంబరంబులను బీ • తాంబరునిని

తే. దనరుభక్తిని మృచ్ఛిలా • దారురచిత
రూపములయందుఁ గాని ని • రూఢమైన
సలిలములయందుఁ గాని సు • స్థలములందుఁ
గాని పూజింపవలయు న • క్కమలనాభు. 39

అర్థ. దూర్వాంకురశ్యామున్ = లేఁతపచ్చికవలె శ్యామలవర్ణము గలవానిని; దూర్వాంకురంబులన్ = లేఁతపచ్చికతోడను; చారు, జలజ, నయనున్ = సుందరమైన పద్మములవంటి కన్నులుగలవానిని; జలజంబులను = పద్మములచేతను; తులసీదామునిన్ = తులసీమాలను ధరించిన వానిని; తులసీదళంబులన్ = తులసీదళముల చేతను; సు, నైర్మల్య, చరితున్ = మంచి నిర్మలచరిత్రముగలవానిని; మాల్యంబులను = పూలదండల చేతను; పక్షిపత్త్రినిన్ = పక్షివాహనుని; పత్త్రింబులన్ = ఆకుల చేతను; ఆదిమూల, ఘనునిన్ = లోకములకన్నింటికిని మూలమైన శ్రేష్ఠుని; కడుఁక = మిక్కిలిగా; వన్యమూలంబులను = అడవిదుంపల చేతను; పీతాంబరునిని = పీతాంబరము ధరించినవానిని; అంచిత, భూర్జత్వక్, ఆది, నిర్మిత, వివిధ, అంబరములను = ఒప్పుచున్న, భూర్జపత్త్రములు మొదలగు వానిచే చేయఁబడిన అనేకవిధములగు బట్టల చేతను; తనరు: భక్తిని = ఎక్కువయగు భక్తితో; మృత్, శిలా, దారు, రచిత, రూపములయందు గాని = మట్టి, రాయి, కఱ్ఱ, మొదలయినవానితో చేయఁబడిన ప్రతిమల రూపములఁగాని; నిరూఢమైన, సలిలములయందుఁ గాని = పవిత్రజలములలోఁగాని; సుస్థలములందున్, గాని = మంచిస్థలములలో గాని; ఆ కమలనాభున్, పూజింపవలయున్ = ఆవిష్ణుమూర్తిని పూజచేయవలెను.

తా. లేఁతపచ్చికవర్ణముగలవానిని లేఁతపచ్చిక చేతను పద్మములవంటి కన్నులుగలవానిని పద్మముల చేతను తులసీహారుని తులసీదళముల

చేతను ; మంచి చరిత్రముగలవానిని పుష్పహారముల చేతను, గరుడవాహనుని ఆసుల చేతను , జగత్తునకు స్థూలమైనవానిని అడవిదుంపల చేతను, పీతాంబరధరుని భూర్జపత్రాదులచే చేయఁబడిన బట్టలచేతను మట్టి, శిలలు కఱ్ఱలు మొదలగువానితో చేయఁబడిన ప్రతిమలరూపమునఁగాని, పవిత్రజలములందుఁగాని మంచిస్థలములందుగాని సేవింపవలెను.

క. ధృతచిత్తుఁడు శాంతుఁడు ని
యతపరిభాషణుఁడు సుమహి ♦ తాచారుఁడు న
ర్తితహరిమంగళగుణుఁడును
మితవన్యాశనుఁడు నగుచు ♦ మెలఁగుచు మఱియున్. 40

అర్థ. ధృతచిత్తుఁడు = ధైర్యముగల మనస్సుగలఁవాఁడును ; శాంతుఁడు = శాంతముగలవాఁడును ; నియత, పరిభాషణుఁడు = మితభాషియును ; సుమహిత, ఆచారుఁడు = గొప్ప ఆచారమును పాలించువాఁడును ; వర్తిత, హరి, మంగళ, గుణుఁడు = హరిసంకీర్తనము చేయు మంగళకరమైన గుణములుగలవాఁడును; మిత; వన్య, అశనుఁడు = = అడవిలోఁ పుట్టు దుంపలన్ మితముగా భుజించువాఁడును; అగుచు = అగుచు; మెలఁగుచున్ = సంచరించుచు; మఱియున్ = ఇంకను.

తా. ధైర్యచిత్తుఁడును శాంతముగలవాఁడును, మితభాషియును, హరిసంకీర్తనము చేయు మంగళగుణములుగలవాఁడును , అడవిదుంపలను మితముగా తినువాఁడును, అయిసంచరించుచు ఇంకను- [ముందుపద్యముతో నన్వయము.]

తా. ధైర్యముగలిగి, శాంతుఁడై మితభాషియై, హరిసంకీర్తనము చేయుచు, మితాహారుఁడై సంచరించుచు- [ముందు పద్యముతో అన్వయము.]

వ. ఉత్తమశ్లోకుండగు పుండరీకాక్షుండు నిజమాయాస్వేచ్ఛావతారచరితంబులచేత నచింత్యంబుగా నద్ది సేయు

నద్దియు హృదయగతంబుగా ధ్యానంబు సేయుం దగు
మఱియుం గార్యబుద్ధిం జేసి చేయంబడు పూజావిశేషం
బులు వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింప
వలయు నిట్లు మనోవాక్కాయకర్మంబులచేత మనో
గతంబగునట్లుగా భక్తియుక్తంబులయిన పూజలచేతఁ
బూజింపంబడి సర్వేశ్వరుండు మాయాభిభూతులు గాక
సేవించుపురుషులకు ధర్మాదిపురుషార్థంబులలోన నభిమ
తార్థంబు నిచ్చు విరక్తుండగువాఁడు నిరంతరభావం
బయిన భక్తియోగంబునం జేసి మోక్షంబుకొఱకు భజి
యించు నని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రద
క్షిణపూర్వకంబుగా నమస్కరించి మహర్షిజనసేవ్యంబై
సకలసిద్ధుల నొసంగుచు భగవత్పాదసరోజాలంకృతం
బైన మధువనమునకుం జనియె నంత **41**

అర్థ. ఉత్తమశ్లోకుండు, అగు = మంచికీర్తి గలవాఁడగు; పుండరీక, అక్షుండు = పద్మనేత్రుఁడయిన శ్రీమహావిష్ణువు; నిజ, మాయా, స్వేచ్ఛావతార, చరితంబులచేత = తనమాయవలన పొందుచుండు అవతారములందలి చరిత్రములవలన; అచింత్యంబుగాన్ = ఊహింపశక్యముకానట్లు; ఎద్ది, చేయున్ = ఏది చేయునో; అద్దియు = దానిని ; హృదయ, గతంబుగాన్ = హృదయమునందునిలిపి; ధ్యానంబు, చేయుందగున్ = ధ్యానం పవలెను; మఱియున్ = ఇంకను; కార్యబుద్ధింజేసి = ఒకకోరిక సిద్ధింపవలెనను ఉద్దేశముతో, చేయంబడు, పూజావిశేషంబులు = చేయఁబడిన వివిధపూజలు ; వాసుదేవమంత్రంబునన్ = ఓంనమోభగవతే వాసుదేవాయ అను మంత్రపూర్వకముగా; సర్వేశ్వరునికి = శ్రీమహావిష్ణువునకు, సమర్పింపవలయున్ = సమర్పణచేయవలెను; ఇట్లు = ఈవిధముగా; మనః,

వాక్, కాయ, కర్మంబుల చేతన్ = మనస్సు, మాట శరీరము పని అను వాని చేత ; మనోగతంబు అగునట్లుగాన్ = మనస్సున కుదురుకొనునట్లు; భక్తియుక్తంబులయిన పూజలచేతన్, పూజింపంబడి = భక్తితోఁ గూడిన పూజల చేత ఆరాధింపఁబడి సర్వేశ్వరుండు = శ్రీమహావిష్ణువు; మాయా, అభిఘాతులు, కాక = మాయ చేత కొట్టఁబడక; సేవించు, పురుషులకు = కొలుచుజనులకు; ధర్మ, ఆది, పురుషార్థంబులలోనన్ = ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థములలో ; అభిమత, అర్థంబున్ = కోరిన కోరికను ; ఇచ్చున్ = ఇచ్చును; విరక్తుండు, ఆగువాఁడు = సంసారమునుండి విరక్తి పొందినవాఁడును; నిరంతర, భావంబు, అయిన = ఎడ తెగక నిలచియున్న ; భక్తియోగంబునంజేసి = భక్తిని కలిగియుండి ; మోక్షంబుకొఱకున్, భజియించున్ = మోక్షముకొఱకు ఆరాధించును ; అని, చెప్పినన్, విని = అని చెప్పగాఁ విని; ధ్రువుండు = ధ్రువుఁడు; నారదునకున్ = నారదునకు ; ప్రదక్షిణపూర్వకంబుగాన్ = ముందుగా ప్రదక్షిణము చేసి; నమస్కరించి = నమస్కారము చేసి ; మహర్షి జన, సేవ్యంబై = మహర్షుల చేత సేవింపఁబడి ; సకలసిద్ధులన్. ఒసంగుచున్ = అన్ని సిద్ధులను ఇచ్చును ; భగవత్, పాదసరోజ అలంకృతంబు = భగవంతుని పాదపద్మముల చే అలంకరింపఁబడిన ; మధువనంబునకున్, చనియెన్ = మధువనమునకు వెళ్ళెను; అంతన్ = ఆపిమ్మట,

తా. స్పష్టము.

తే. పద్మభవసూనుఁ డుత్తాన • పాదుకడకు
సరిగి యా రాజుచే వివి • ధార్చనముల
నంది సంప్రీతుఁ డై యుచి • తాసనమున
నెలమిఁ గూర్చుండి యాతని • వలను సూచి 42

అర్థ. పద్మభవ, సూనుఁడు = బ్రహ్మకొడుకయిన నారదుఁడు ; ఉత్తానపాదు, కడకున్ అరిగి = ఉత్తానపాదమహారాజు వద్దకు వెళ్లి, ఆ రాజుచేన్ = ఆ రాజు చేత; వివిధ అర్చనములన్ అనేకపూజలనుపొంది;

ఉచిత, ఆసనమునన్ = తగిన ఆసనముమీఁదను; ఎలమిన్ = సంతోషముతో
కూర్చుండి = కూర్చొని; అతని, వలను చూచి = అతనివైపు చూచి.

తా. రాజుఁ ఉత్తానపాదుని యొద్దకు వెళ్లి, అతనిచేత పూజలను గొని, ఉచితాసనమునఁ గూర్చుండి ఆరాజువైపు మొగంబై- (ముందు పద్యముతో అన్వయము)

వ. ఇట్లనియె. 43

క. భూనాయక నీ విపు డ
మ్లానాస్యుఁడ వగుచుఁ జాల ♦ మదిలోఁ జింతం
బూనుట కేమికతం బన
నానారదుతోడ నాతఁ ♦ డనియెన్ మరలన్. 44

అర్థ. ఇట్లు, అనియెన్ = ఈరీతిగా పలికెను.

అర్థ. భూనాయక = రాజా; నీవు, ఇపుడు, అమ్లాన, ఆస్యుఁడవు అగుచున్ = నీవిప్పుడు వాఁడిన మొగముగలవాఁడవై; చాలన్ = ఎక్కువగా; మదిలోన్ = మనస్సునందు; చింతన్, పూనుటకు = విచారించుటకు; ఏమి, కతంబు, అనన్ = కారణమేమని అడుగఁగా; ఆనారదు తోడన్, ఆతఁడు, అనియెన్, మరలన్ = ఆనారదునితో తిరిగి యిట్లు చెప్పెను.

తా. రాజా, నీ మొగము వాఁడియున్నది. నీ మనస్సులోని విచారమునకు కారణమేమి? అని అడుగఁగా ఆతఁ డిట్లనెను.

క. మునివర వివేకశాలియు
ననఘుఁడు నై పేర్ల బాలుఁ ♦ డస్మత్ప్రియసూనుఁ
డనుఁ బడియుండ నగుచునా చే
తను బరిభవ మొంద చనియెఁ ♦ దల్లియుఁ దానున్. 45

అర్థ. మునివర = మునిశ్రేష్ఠుఁడా; వివేకశాలియున్ = తెలివిగలవాఁడును; అనఘుఁడున్ = పాపములేనివాఁడును; అయి దేండ్లబాలుఁ

డు = ఆఱుయేండ్ల సంవత్సరముల వయస్సుగల బాలుఁడైన; అస్మత్. ప్రియ నందనుఁడు = నా ప్రియమైనకొడుకు; అదయుఁడను, అగు, నాచేతన్ = దయలేని నాచేత ; పరిభవము , ఒంది = అవమానముపొంది ; తల్లియున్, తానున్ = చనియెన్ = తల్లితోకూడ వెళ్ళెను.

తా. నారదమునీంద్రా ! వివేకశాలియు, పాపరహితుఁడును అగు కుమారుఁడు నాచే నవమానముఁ బొందినవాఁడై తల్లితో కలసివెళ్లి పోయెను.

సీ॥ చనియుగ్రాటవిఁజొచ్చి యచ్చటఁబరి • శ్రాంతుండుక్షుత్పీ<br>
డితుం, డును నామ్లానముఖాంబుజుండునన ఘుం • డుబా<br>
లుఁడున్నైనమ, త్తనయున్ ఘోరవృకాహిభల్లముఖస •<br>
త్త్వశ్రేణినిర్జించెనో, యని దుఃఖించెద నాదు చిత్తమున<br>
నా • ర్యస్తుత్య యిట్లౌటకున్. 46

అర్థ. చని = అట్లు తల్లితోపోయి; ఉగ్ర, అటవిన్, చొచ్చి = భయంకరమైన అడవిని ప్రవేశించి; పరిశ్రాంతుండున్ = అలసిపోయిన వాఁడును ; క్షుత్, పీడితుండును = ఆకలిచే బాధింపఁబడినవాఁడును ; ఆమ్లాన ముఖ, అంబుజుండును = వాడినముఖపద్మముగలవాఁడు ; అనఘుండున్ = పాపములేనివాఁడును ; బాలుఁడున్ , ఐన = పిల్లవాఁడును అయిన ; మత్, తనయున్ = నాకొడుకును , ఘోర = భయంకరమైన ; వృక, అహి, భల్ల, ముఖ, సత్త్వ, శ్రేణి = తోడేళ్ళు, పాములు, ఎలుగుగొడ్డులు , మొదలగు జంతుసమూహము ; నిర్జించెనో, అని = చంపివేసెనో అని; ఇట్లు ఔటకున్ = ఈవిధముగా జరుగుటకు ; ఆర్యస్తుత్య = పెద్దలచే పొగడఁబడఁదగినవాఁడా ; నాదు, చిత్తమునన్, దుఃఖించెదన్ = నామనస్సులో శోకము పొందుచున్నాను.

తా. అట్లు నాకుమారుఁడు తల్లితో ఘోరాటవులఁజొచ్చి, అలసి ఆఁకలిపొంది , వాఁడిన మొగములవాఁడై , యచట ఘోరజంతువులచే చంపఁబడెనేమో యని మనస్సులో దుఃఖించుచున్నాను.

తే. అట్టియుత్తమబాలు నా • యంకపీఠ
మందుఁ గూర్చుండ నీక ని • రాకరించి
యంగనాసక్తచిత్తుండ • నైనయట్టి
నాదురాత్మ్య మిది ముని • నాథచంద్ర 47

అర్థ. అట్టి, ఉత్తమ, బాలున్ = అట్టి శ్రేష్ఠుఁడైనకుమారుని, నా, అంకపీఠమందు = నాతొడమీఁద ; కూర్చుండనీక = కూర్చుండనీయక ; నిరాకరించి తిరస్కారభావముతో ; అంగనా, ఆసక్త, చిత్తుండను, ఐన, అట్టి = స్త్రీలోలుఁడయిన ; మునినాథచంద్ర = మునిశ్రేష్ఠుడా ఇది, నాదు, దౌరాత్మ్యము = ఇది నా దుష్టబుద్ధియే.

తా. అట్టిశ్రేష్ఠుఁడైన బాలుని నాతొడపై నెక్కనీయక త్రోసివైచి స్త్రీలోలుఁడనై యుండుట నాదుర్బుద్ధితప్ప మఱియొకటి కాదు.

ఉ. నా విని నారదుండు నర • నాథున కిట్లను నీకుమారుఁ డా
దేవకిరీటరత్నరుచి • దీపితపాదసరోజుఁ డైన రా
జీవదళాక్షరక్షితుఁడు • శేషజగత్పరికీర్తనీయకీ
ర్తివిభవప్రశస్తసుచ • రిత్రుఁడు వానికి దుఃఖ మేటికిన్ 48

అర్థ. నాన్, విని = అది విని ; నారదుండు = నారదుఁడు ; నరనాథునకున్, ఇట్లు అనున్ = రాజుతో ఇట్లు చెప్పుచున్నాఁడు. నీ, కుమారుఁడు = నీకొడుకు ; ఆ, దేవ, కిరీట, రత్న, రుచి, దీపిత, పాద సరోజుఁడు, ఐన = ఆ దేవతలకిరీటములందలి రత్నములకాంతిచేత వెలిగింపఁబడిన పాదపద్మములుగలవాఁడగు ; రాజీవదళ, అక్ష, రక్షితుఁడు = పద్మపత్రాక్షుఁడయిన విష్ణుమూర్తి రక్షణను పొందియున్నవాఁడు; అశేష, జగత్, పరికీర్తనీయ, కీర్తి, విభవ, ప్రశస్త, సు, చరిత్రుఁడు = సమస్తలోకములచేతను స్తుతింపఁబడదగిన కీర్తివైభవముచేత ప్రఖ్యాతిపొందిన సచ్చరిత్రములుగలవాఁడు ; వానికిన్, దుఃఖము, ఏటికిన్ = వానికొఱకు దుఃఖింపనేల ?

తా. అనఁగా విని నారదుఁడుత్తానపాదమహారాజుతో ఇట్లు పలికెను. రాజా! నీకుమారుఁడు శ్రీమహావిష్ణురక్షను బొందియున్నాఁడు అతనికీర్తిని సమస్తలోకములును స్తుతింపుచున్నవి. అట్టివానికోసము నీవు దుఃఖింప నవసరము లేదు.

ఉ. కావున నమ్మహాత్ముఁడు సుకర్మము చేత సమస్త లోకపా
లావళి కందరానిసము ♦ దంచితనిత్యపదంబునం బ్రభు
శ్రీ విలసిల్లఁ జెందుఁ దుల ♦ సీదళదామము భజించి యాజగ
త్పావనుఁ డైన నీసుతుప్ర ♦ భావ మెఱుంగవు నీవు భూవరా.

అర్థ. కావునన్ = అందుచేత; ఆ, మహాత్ముఁడు = ఆమహిమవంతుఁడగు ధ్రువుఁడు; సుకర్మము చేత = తనసత్కర్మ చేత; సమస్త, లోకపాల, ఆవళికి అందరాని = సకలదిక్పాలకులను పొందశక్యము కాని; సముదంచిత నిత్య పదంబునన్ = చక్కనైనట్టియు నిత్యమైనట్టియు స్థానమున; ప్రభు శ్రీ విలసిల్లన్ = ప్రభుత్వసంపదయొప్పుచుండఁగా; తులసీదళ దామున్ భజించి = తులసీదళహారమును ధరించిన విష్ణుమూర్తిని సేవచేసి చెందున్ = పొందును, ఆ జగత్ పావనుఁడు ఐన = ఆజగత్తుకంతటికిని పవిత్రుఁడైన; నీ సుత ప్రభావమున్ = నీకుమారుని ప్రభావమును; భూవరా = రాజా; నీవు ఎఱుఁగవు = నీవు తెలిసికొనఁజాలవు.

తా. ఆధ్రువుఁడు తన సత్కర్మముకుఫలముగా సమస్త దిక్పాలురును పొందలేని నిత్యమైనపదమును పొందును నీకుమారుని ప్రభావమును నీ వెఱుంగఁజాలకున్నావు.

క. అదియునుం గాక. 50

అర్థ. అదియున్ కాక = ఇంతేకాక.

క. నీకీర్తియు జగములయం
దాకల్పము నొందఁ జేయు ♦ సంచితగుణార

త్నాకరుఁ డిట కేతెంచును
శోకింపకు మతనిఁగూర్చి • సుభగచరిత్రా

అర్థ. నీకీర్తియున్ = నీకీర్తికూడ ; జగములయందు = లోకముల లోనెల్ల ; ఆకల్పమున్ , ఒందన్ , చేయు = కల్పాంతమువఱకును ఉండు నట్లుచేసి ; అంచిత , గుణరత్నాకరుఁడు = మంచిరత్నముల కాటపట్టయినధ్రువుడుఁ; ఇట, ఏతెంచును = ఇచ్చటికివచ్చును; సుభగచరిత్రా = శోభనమైన చరిత్రముగలవాఁడా; అతనిన్, కూర్చి, శోకింపకుము = అతని కోసము దుఃఖము పొందకుము

తా. రాజా! ధ్రువుఁడు నీకీర్తికూడ లోకములందెల్ల కల్పాంతమువఱకు నిలుపును. అతఁ డిచ్చటికివచ్చును. నీవాతనికోసము దుఃఖించకుము.

క. అని నారదుండు పలికిన
విని మనమున విశ్వసించి • విభుఁడును బ్రియసం
దనుఁ జింతించుచు నాదర
మున జూడం డయ్యె రాజ్య • మును బూజ్యముగన్. 52

అర్థ. అని, నారదుండు, పలికినన్ = ఇట్లు నారదుఁడు పలుకఁగా, విని = విని ; విభుఁడును = ఆరాజు; మనమునన్, విశ్వసించి = మనస్సులో నమ్మి ; ప్రియనందనున్, చింతించుచున్ = తనకు ప్రియుఁడైన కుమారుని తలంచుచు ; రాజ్యమును , పూజ్యముగన్ , ఆదరమునన్ , చూడఁడయ్యెన్ = రాజ్యమును గౌరవముగఁగాని , ఆదరముతోఁగాని చూడకుండెను.

తా. ఇట్లు పలికిన నారదుని మాటలు విని మనస్సులో నమ్మి ఆ రాజు రాజ్యమును ఆదరముతో చూడకుండెను

వ. అంత నక్కడ నాధ్రువుండు. 53

అర్థ. అంతను , అక్కడ, ఆ, ధ్రువుఁడు = ఇట్లుండఁగా అచ్చట ధ్రువుడుఁ.

క. చని ముందటఁ గనుఁగొనె మధు
వనమును మునియోగిదేవ • వర్ణితగుణపా
వనమును దుర్భవజలదప
వనమును నిఖిలైకపుణ్య • వరభవనంబుకా. 54

అర్థ. చని = పోయి ; ముందటన్ = తనయెుందర; ముని, యోగి, దేవ, వర్ణిత, పావనమును = మునులచేతను యోగులచేతను, దేవతలచేతను, వర్ణింపఁబడు పవిత్రతఁ గలిగినట్టియు ; దుర్భవ, జలద, పవనమును = సంసారమను మేఘమునకు వాయువువంటిదియు ; నిఖిల, ఏక, పుణ్య, వర, భవనంబున్ = సమస్త పుణ్యములకును తావయిన శ్రేష్ఠమగు స్థానము అయిన; మధువనమును, కనుఁగొనెన్ = మధువనమును చూచెను.

తా. అట్లుపోయి తనయెదుట మునులు, యోగులు, దేవతలు వర్ణింపఁదగిన పవిత్రతగలిగినట్టియు, సంసారమను మేఘమును పోఁగొట్టు వాయువువంటిదియు, పుణ్యమునకు కాటపట్టును అయిన మధువనమును చూచెను.

వ. అట్లు గని డాయంజని యమునానదిం గృతస్నానుండై నియతుండును సమాహితచిత్తుండునునై సర్వేశ్వరునిధ్యానంబు సేయుచుం ద్రిరాత్రంబుల కొక్కమాఱు కృతకపిత్థబదరీఫలపారణుం డగుచు దేహస్థితి ననుసరించి యొక్కమాసంబు హరిం బూజించి యంతనుండి యాఱేసిదినంబుల కొక్కపరి కృతజీర్ణతృణపర్ణాహారుండగుచు రెండవమాసంబున విష్ణుసమారాధనంబు సేసి యంతనుండి నవరాత్రంబుల కొకమాఱుదకభక్షణంబు సేయుచు మూఁడవమాసంబున మాధవు నర్చించి యంతనుండి

ద్వాదశదినంబుల కొకతోయంబు వాయుభక్షణుండగు
చు జితశ్వాసుండై నాలవమాసంబునం బుండరీకాక్షుని
భజియించి యంతనుండి మాసంబున నలయక నిరుచ్ఛ్వా
సుండై యేకపదంబున నిలిచి పరమాత్మునిం జింతించుచు
సచేతనం బైన స్థాణువుం బోలె నైదవమాసంబును జరపె
నంత.

అర్థ. త్రిస్సు = త్రిప్రకారముగా; కని = చూచి; డాయన్, = చని సమీపించి; యమునానదిన్ కృతస్నానుండై = యమునానదిలో స్నానము చేసి; నియతుండును = నియతాచారుండును; సమాహిత ; చిత్తుండును, ఐ = శాంతినొందినమనస్సుకలవాఁడును అయి; సర్వేశ్వరుని, ధ్యానంబు, చేయుచున్ = విష్ణుమూర్తిని ధ్యానించుచు, త్రిరాత్ర, త్రిరాత్రింబులకు, ఒక్కమాఱు = మూఁడేసిరాత్రులకొకసారి; కృత, కపిత్థ బదరీఫల, పారణుండు అగుచున్ = వెలగపండును, రేగుపండును తినుచు; దేహస్థితిన్, అనుసరించి = శరీరస్థితినిబట్టి; ఒక్కమాసంబు, హరిన్, పూజించి = ఒకనెల విష్ణుమూర్తిని పూజచేసి; అంతనుండి = అప్పటినుండియు; ఆఱేసిదినంబులకు, ఒక్కపరి = ఆఱేసిరోజులకొకసారి; కృతజీర్ణ తృణ, పర్ణ, ఆహారుండు, అగుచున్ = ఎండినగడ్డిని, ఆకులను తినుచు; రెండవమాసంబునన్ = రెండవనెలలో; విష్ణుసమారాధనంబు, చేసి = విష్ణుమూర్తిపూజ చేసి; అంతనుండి అప్పటినుండియు; నవరాత్రింబులకు, ఒకమాఱు = తొమ్మిదిరోజులకొకసారి; ఉదకభక్షణంబు, చేయుచు = నీళ్లు త్రాగుచు; మూఁడవమాసంబునన్ = మూఁడవనెలలో; మాధవున్, అర్చించి = విష్ణుమూర్తిపూజ చేసి; అంతనుండి = అప్పటినుండియు; ద్వాదశదినములకు, ఒకతోయంబు = పన్నెండుదినంబులకొకసారి; వాయుభక్షణుండు, అగుచున్ = వాయువుభక్షించుచు; జిత, శ్వాసుండు, ఐ = శ్వాసము జయించినవాఁడై, నాలవమాసంబునన్ = నాలుగవనెలలో పుండ

రీశాక్షునిన్ , భజియించి = విష్ణుమూర్తిని పూజించి; అంతనుండి = అప్ప టినుండియు ; మనంబునన్ = మనస్సులో ; అలయక = ఆయాసముపొం దక ; నిర్, ఉత్ , శ్వాసుండు, ఐ = ఎగఊపిరిని ఆపి; ఏక. పదంబు నన్ , నిలిచి = ఒక పాదముమీద నిలువబడి ; పరమాత్మన్ , చింతిం చుచున్ = పరమాత్మయైన విష్ణుమూర్తిని ధ్యానించుచు ; సచేతనంబు, ఐన, స్థాణువున్, పోలెన్ = ప్రాణముతోఁగూడిన స్తంభమువలె; ఐదవ మాసంబును, జరపెన్ = ఐదవనెలకూడ జరిపెను ; అంతన్ = పిమ్మట.

తా. స్పష్టము.

సీ. సకలభూతేంద్రియా • శయము సద్హృదయంబు
నందు విషయములఁ • జెందనీక
మహదాదితత్త్వస • మాజమ్ములకును నా
ధారభూతమును బ్ర • ధానపూరు
షేశ్వరుఁ డైనట్టి • శాశ్వతబ్రహ్మంబుఁ
దన దైనహృదయప • ద్మమున నిలిపి
హరిరూపమునకంటె • నన్యంబు నెఱుఁగక
చిత్తమవ్విభునందుఁ • జేర్చియున్న

తే. కతన ముల్లోకములు నాలఁ • గంప మొందె
నెండియును బేర్చి యయ్యర్భ • కుండు ధరణి
నొక్కపాదంబు చేర్చిని • ల్చున్నవేళఁ
బేర్చి యబ్బాలునంగుష్ఠ • పీడఁజేసి. 56

అర్థ. సకల భూత హిత ఇంద్రియ ఆశయము అగు = సమస్త జీవకోటికిని హితమైన స్థానమగు; హృదయంబునందు = హృదయము లో ; విషయములన్ చెందనీక = భోగేచ్ఛను చేరనీయక; మహత్ ఆది తత్త్వ సమాజమ్ములకును = బుద్ధి మొదలయిన ఇరవదిఆయిదు తత్త్వము

లకును ; ఆధారభూతమును = ఆధారము యిన్నట్టియు ; ప్రధాన, పూరుష, ఈశ్వరుఁడు; ఐనట్టి = ప్రధానమైన పురుష శ్రేష్ఠుఁడగు; శాశ్వత , బ్రహ్మంబున్ = నాశనములేని పరబ్రహ్మమును; తన్ ది, ఐన, హృదయపద్మమునన్ , నిలిపి = తన హృదయమను పద్మమునందు కుదురుకొలిపి ; హరి రూపమునకంటెన్ = విష్ణుమూర్తి రూపముతప్ప ; అన్యంబున్, ఎఱుఁగక = ఇతరమునందు గురిచేయుంచక ; చిత్తమున్ = మనస్సును; ఆ, విభునందున్ = ఆ దేవదేవుని యందు ; చేర్చియున్న కతనన్ = చేర్చి ఉండుటవలన; ముల్లోకములున్ = మూఁడులోకములును ; చాలన్, కంపము, ఒందెన్ = చాలవడంకుచుండెను ; వెండియును = మరల ; పేర్చి = ఉత్సాహముతో ; ఆ, అర్భకుండు = ఆబాలుఁడైన ధ్రువుఁడు; ధరణిన్ = భూమిపై; ఒక్క పాదమున్ , చేర్చి , నిల్చున్న వేళన్ = ఏకపాదముమీఁద నిలువఁబడినప్పుడు ; నేర్చి = ఎక్కువగా; ఆ, బాలు, అంగుష్ఠపీడన్, చేసి = ఆ బాలుని బొటనవ్రేలితాకుడువలన కలిగినబాధ చేత;

తే. వసుమతీతల మర్ధము • వంగఁజొచ్చె
    భూరిమదదుర్నివారణ • వారణేంద్ర
    మెడమఁ గుడి నొరగఁగ నడు • గడుగునకును
    జలన మగునుదధిస్థిత • కలముఁబోలె. 58

అర్థ, భూరి, మద, దుర్నివారణ వారణేంద్రము = మిక్కిలి మదించియున్న మదపుటేనుఁగు; ఎడమన్, కుడిన్, ఒరగఁగన్ = కుడిపై పునకును , ఎడమపై పునకును ఒరుగుచుండఁగా; అడుగడుగునకును = ప్రతి అడుగునకును ; చలనము , అగు = కదలుచుండు ; ఉదధి, స్థిత, కలము, బోలెన్ = సముద్రములోనున్న ఓడవలె ; వసుమతీతలము = భూప్రదేశము, అర్ధము = సగము, వంగన్ , చొచ్చెన్ = వంగసాగెను.

తా. ధ్రువుఁడట్లు హృదయమునందు విష్ణుమూర్తినివదలి, పరబ్రహ్మమును తనహృదయమునందు చేర్చి తదేకధ్యానముతో నున్న సమయమునందు మూఁడులోకములును కంపమునొందసాగెను. ఏకపాదముపై

నిలుచుండఁగా అతని కాలుటవ్రేలి భారము చేత సముద్రములోని పడవవలె దిగ్గజము ఇటునటు తిరుగుచున్నట్లు ప్రక్కలకు ఒరగునట్లు భూమియం దలి సగముభాగము వంగిపోఁజొచ్చెను.

చ. అతఁడు ననన్యదృష్టిని జ రాచరదేహశరీరధారణా
స్థితిగల యీశునందుఁ దన జీవితముం ఘటియింపఁ జేసి యే
కతఁగనఁ దన్నిరోధమునఁ గైకొని కంపమునొందె నీశ్వరుం
డతఁడు చలింపనిజ్జగములన్నియుఁ జంచలమయ్యె భూవరా.

అర్థ. అతఁడున్ = ఆధ్రువుఁడు; అనన్యదృష్టిని = నిశ్చలమైన దృష్టితో; చర, అచర, దేహ, శరీర ధారణ, స్థితి, కల = చరాచర శరీరము లేతనశరీరము గాఁగల; ఈశునందున్ = ఈశ్వరుని యందు; తన, జీవితమున్, ఘటియింపన్, చేసి = తనజీవితమును నిలిపి; ఏకతన్, కనన్ = ఈశ్వరునిలో ఐక్యము పొందఁగా; తత్, నిరోధమునన్ = ఆబ్రహ్మమువను కలిగిన నిరోధము చేత; కైకొని = ఆ అడ్డుబాటును పొంది; ఈశ్వరుండు, కంపమున్, ఒందెన్ = ఈశ్వరుఁడు వడఁకుఁబాటు పొందెను; అతఁడు, చలింపన్ = అతఁడు కంపముఁబొందఁగా; భూవరా = రాజా; ఈ, జగములు, అన్నియున్, కంపమున్, ఒందెన్ = ఈలోకములన్నియు వడఁకసాగెను.

తా. చరాచర ప్రపంచమంతయు దేహముగాఁగల ఈశ్వరుని యందు ధ్రువుఁడు మనస్సు చేర్చి నిరోధింపఁగా, ఆనిరోధమువల్ల నాయీశ్వరునియందు కంపముకలిగెను. అతఁడు కంపమునొందఁగా లోకము లన్నియు కంపింపసాగెను.

క. ఆలోకభయంకర మగు
నాలోకమహావిపద్ద శాలోకను లై
యాలోక పాలు రందఱు
నాలోకశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్. 60

అర్థ. ఆ, లోకభయంకరము, అగు = అట్టిలోకభీతికరమగు ; ఆ, లోక, మహా, విపత్, దశా, ఆలోకనులు, ఐ = లోకములకు కలిగిన మహాపదను చూచినవారై ; ఆ, లోకపాలురు, అందఱున్ = ఆదిక్పాలురందఱును; అలోకశరణ్యున్ = సమస్తలోకములను రక్షించునట్టి శ్రీమహావిష్ణువును; కానన్, అరిగిరి, భీతిన్ = భయముతో చూడబోయిరి.

తా. అట్లు లోకభయంకరమగు మహావిపత్తును చూచి లోకపాలురందఱును భయముతో శ్రీమహావిష్ణువును చూడఁబోయిరి

వ. అట్లరిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించికొని యిట్లనిరి 61

అర్థ. అట్లు, అరిగి = ఆరీతిగాపోయి ; నారాయణున్, ఉద్దేశించి = నారాయణమూర్తితో; కృతప్రణాములు, ఐ = ప్రణామములు చేసి; కరంబులు, ముకుళించుకొని = చేతులుజోడించి ; ఇట్లు, అనిరి = ఈవిధముగా పలికిరి.

తా. వారట్లు పోయి శ్రీమన్నారాయణునకు నమస్కరించి చేతులు జోడించి యిట్లు పలికిరి,

చ. హరి పరమాత్మ కేశవ చరాచరభూతశరీరధారి వై
పరఁగుదు వీవు నిట్టులుగఁ బ్రాణనిరోధము లెందు మున్న నే
మెఱుఁగ మనాథనాథ జగదీశ్వర సర్వశరణ్య నీపదాం
బురుహము లర్థిమై శరణు వొందెద మార్తి హరించి కావవే.

అర్థ. హరి, పరమాత్మ, కేశవ; చర, అచర, భూత, శరీర, ధారివి, ఐ = జంగమస్థావరరూపమైన జీవములే శరీరముగాఁగలవాఁడవై; ఈవు పరఁగుదువు = నీవు ఒప్పుదువు; అనాథనాథ = దిక్కులేనివారి రక్షించువాఁడా; ఇట్టులుగన్ = ఈరీతిగా; ప్రాణనిరోధములు = ప్రాణములకు నిరోధములగుటలు; ఎందున్, మున్నన్, ఏము, ఎఱుఁగము = పూర్వ

కాలము దెప్పుటను చూడలేదు; జగత్, ఈశ్వర ! సర్వశరణ్య = జగత్ప్రభువా, సర్వలోకశరణ్యా; నీపద, అంబురుహములు = నీపాదపద్మములను; అర్థిమైన్ = కోరికతో; శరణు, పొందెదము = శరణుచొచ్చెదము; ఆర్తి, హరించి, కావవే = బాధను, పోఁగొట్టి గావుమా.

తా. చరాచరజంతుజాలమంతయు శరీరముగాఁగల నీకిట్లుప్రాణనిరోధము కలుగుట మేమెన్నఁడును చూడలేదు జగత్ప్రభూ! నీపాదపద్మముల నాశ్రయించుచున్నాము. మా బాధను పోఁగొట్టి మమ్ము కావుము.

వ. అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కిట్లనియె నుత్తానపాదుం డనువానితనయుండు విశ్వరూపుఁడ నయిన నాయందుఁ దనచిత్తం బైక్యము సేసి తపంబు గావించుచుండ దానం జేసి భవదీయప్రాణనిరోధం బయ్యె నట్టిదురత్యయం బైన తపంబు నివర్తింపఁ జేసెద వెఱవక మీమీనివాసంబులకుం జనుండని యానతిచ్చిన నాదేవతులు నిర్భయాత్ములై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబునకుం జనిరి తదనంతరంబు 63

అర్థ. అని పలికి; విన్నవించినన్ = ప్రార్థనము చేయఁగా; ఈశ్వరుండు వారలకున్, ఇట్లు, అనియెన్ = నారాయణమూర్తి వారితో ఇట్లుపలికెను; ఉత్తానపాదుండు, అనువాని, తనయుండు = ఉత్తానపాదుఁడను రాజుయొక్క కుమారుఁడు; విశ్వరూపుఁడను, అయిన, నాయందు = విశ్వమే రూపముగాఁగల నాయందు; తన, చిత్తంబు, ఐక్యము, చేసి = తనమనస్సును ఏకముచేసి; తపంబు, కావించుచుండన్ = తపస్సు చేయుచుండఁగా; దానం జేసి = అందువలన; భవదీయ, ప్రాణనిరోధంబు, అయ్యెన్ = మీప్రాణములకు నిరోధము కలిగినది; అట్టి, దురత్యయంబు, అయిన, తపంబున్, నివర్తింపన్, చేసెద = సాటిలేని ఆతపస్సు మర

లించెదను ; వెఱవక = భయపడక ; మీ, మీ , నివాసంబులకున్, చనుం
డు = మీగృహములకు వెళ్లుఁడు ; అని ఆనతిచ్చినన్ = అని అజ్ఞాపింపఁ
గా; ఆ, దేవతలు = ఆదేవతలు; నిర్భయ, ఆత్ములు, ఐ = భయమును వద
లినవారై ఈశ్వరునకున్, ప్రణామంబులు , ఆచరించి = నారాయణమూ
ర్తికి నమస్కారములు చేసి . త్రివిష్టపంబునకున్ , చనిరి = స్వర్గలోకమునకు
పోయిరి ; తత్ , అనంతరంబ = తరువాతను. [ముందుపద్యముతో
అన్వయము.]

తా. స్పష్టము.

సీ. హరి యీశ్వరుండు వి ॥ హంగకులేశ్వర
యానుఁడై నిజభృత్యుఁ ॥ డైనధ్రువుని
గనుఁగొను వేడుక ॥ జనియింప నామధు
వనమున కప్పుడు ॥ సని ధ్రువుండు
పరువడి యోగవి ॥ పాకతీవ్రం బైన
బుద్ధిచే నిజమనో ॥ బురుహముకుళ
మందుఁ దటిత్ప్రభా ॥ యతమూర్తి యటఁ దిరో
ధానంబునను బొంది ॥ తత్క్షణంబ
తే. తనపురోభాగమందు ని ॥ ల్చినను బూర్వ
సమధికజ్ఞాననయనగో ॥ చరసమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమ ॥ మునను సమ్మ
దాశ్రువులు రాలఁ బులకీకృ ॥ తాంగుఁ డగుచు. 64

అర్థ. హరి , ఈశ్వరుండు = ప్రభువగు శ్రీకృష్ణుఁడు ; విహంగకుల,
ఈశ్వర, యానుఁడు, ఐ = పక్షిశ్రేష్ఠుఁడగు గరుడునిపై నెక్కి ; నిజభృ
త్యుఁడు, ఐన, ధ్రువునిన్ = తనసేవకుఁడైన ధ్రువుని; కనుఁగొను, వేడుక,

జనియింపన్ = చూచుటకు పుట్టఁగా ; ఆ , మధువనమునకు, అప్పుడు, చని = అప్పుడామధువనమునకుపోయి , ధ్రువుండు = ధ్రువుఁడు ; పరువడిన్ = ఎక్కువగా ; యోగ విపాక, తీవ్రింబు, ఐన = యోగపరిపాకముచేత = ఉగ్రమైన ; బుద్ధిచేన్ = బుద్ధిచేత; నిజ, మనః , అంబురుహ, ముకుళమందు = తనమనస్సను తామరమొగ్గయందు ; తటిత్ , ప్రభా , ఆయత, మూర్తి = మెఱుపుతీఁగవంటి రూపముగల మహావిష్ణువు; అటన్ = ఆహృదయములో ; తిరోధానంబునను , పొందె = దాగియుండఁ ; తత్క్షణంబ = వెంటనే; తనపురోభాగమందు = తనయెదుట ; నిలిచినను = నిలువఁగా; పూర్వ , సమధిక, జ్ఞానసంయుత, గోచర, సమగ్రమూర్తిన్ = పూర్వజన్మవాసనచే కలిగిన జ్ఞాననేత్రమునకు గోచరించిన సంపూర్ణ ఈశ్వరస్వరూపమును ; కనుఁగొని = చూచి ; సంభ్రమమునను = తడఁబాటుతో; సమ్మద, అశ్రువులు, రాలన్ = ఆనందబాష్పములు రాలుచుండఁగా ; పులకీకృత , అంగుఁడు, అగుచున్ = గగుర్పాటు పొందినదేహముగలవాఁడై- [ముందు పద్యముతో నన్వయము]

తా. అట్లు శ్రీమన్నారాయణుఁడు గరుడవాహనుఁడై తనదాసుఁడగు ధ్రువుని చూచుకోరికతో వచ్చి యోగపరిపాకముచే తీవ్రమైన ఆతని హృదయపద్మమందు నిలిచి , మెఱుపుతీఁగవలె నంతలో అంతర్ధానము పొంది , మఱల ఆతనియెదుట నిలువఁబడగా ఆధ్రువుఁడు పూర్వభవార్జితమైన జ్ఞాననేత్రముతో శ్రీమహావిష్ణువుయొక్క సంపూర్ణస్వభావమును చూచి , తొట్రుపాటుపడి, ఆనందబాష్పములఁగార్చుచు, ఒడలు పులకరింప- [ముందుపద్యముతో అన్వయము.]

సాక్షాత్కరించిన భగవంతుని ధ్రువుండు స్తుతించుట.

తే. నయనముల విభుమూర్తిఁ బా ॰ నంబు సేయు
పగిదిఁ దనముఖమున జుం ॰ బనము సేయు
లీలఁ దగిలి భుజములను నా ॰ లింగనంబు
సేయుగతి దండవన్నతు ॰ ల్స్పృహను లొనర్చె 65

అర్థ. నయనములన్ = కన్నులతో విభు ; మూర్తిన్ = శ్రీవిష్ణువు యొక్క స్వరూపమును; పానంబు, చేయు, పగిదిన్ = త్రాగివేయునట్లును, తన , ముఖమును , చుంబనము చేయు , లీలన్ = అతని మొగమును ముద్దిడునట్లు గాను; తగిలి = ప్రీతితో; భుజములను, ఆలింగనము చేయు, గతిన్ = భుజములతో కౌఁగిలించుకొనునట్లును; దండవత్ , నమస్కృతులు, ఒనర్చెన్ = దండనమస్కారములు చేసెను;

తా. ఆవిష్ణుమూర్తి స్వరూపమును కన్నులతో త్రాగివేయునట్లును, ముఖమును ముద్దిడునట్లును, బాహువులతో కౌఁగిలించుకొనుచున్నట్లును దండనమస్కారములు చేసెను.

వ. ఇట్లు దండప్రణామంబులాచరించి కృతాంజలియై స్తోత్రంబు సేయ నిశ్చయించి స్తుతికి నుపకరణపటుత్వంబు గాక యున్న ధ్రువునకు సమస్తభూతంబులకు నంతర్యామియైనయీశ్వరుండాతనితలం బెఱింగి వేదమయం బయినతనశంఖంబు జేత నబ్బాలునికపోలతలం బాటిన జీవేశ్వరనిర్ణయజ్ఞుండును భక్తిభావనిష్ఠుండును నగుధ్రువుండు నిఖిలలోకవిఖ్యాతకీర్తిగల యీశ్వరుని భగవత్ప్రతిపాదితంబులగు మవేదాత్మకంబులైనతనవాక్కుల నిట్లనిస్తుతియించె దేవా నిఖిలశక్తిధరుండవు నంతఃప్రవిష్టుండవునైన నీవు లీనంబులైన మదీయవాక్కులుఁ బ్రాణేంద్రియంబుల గరచరణశ్రవణత్వగాదులను జిచ్ఛక్తిచేఁగృపంజేసిజీవింపంజేసిన భగవంతుండవును బరమపురుషుండవును నైననీకు నమస్కరింతు నీవొక్కరుండవయ్యు మహదాద్యంబైన యీయశేషవిశ్వంబు మాయాఖ్యం బయిన యాత్మీయశక్తిచేతం గల్పించి యం

దుం బ్రవేశించి యింద్రియంబులందు వసించుచుఁ దత్తద్దే
వతారూపంబులచే నానాప్రకారంబుల దారువులందున్న
వహ్నిచందంబునం బ్రకాశింతు వదియునుం గాక 66

అర్థ. ఇట్లు = ఈవిధముగా; దండప్రణామంబులు, ఆచరించి = దండనమస్కారములు చేసి; కృత, అంజలి ఐ = దోసిలొగ్గి; స్తోత్రంబు, చేయన్ = నిశ్చయించి = స్తుతింపనెంచి; స్తుతిక్రియా, కరణ సమర్థుండు కాక, ఉన్న = స్తుతి చేయుటకు సమర్థుఁడు కాక ఉండిన; ధ్రువునకును = ధ్రువునికిని సమస్త, భూతంబులకును = సకలజీవములకును; అంతర్యామి, ఐన, ఈశ్వరుండు = హృదయవర్తియైన పరమేశ్వరుఁడు; ఆతని, తలంపు, ఎఱింగి = ఆతని తలఁపును తెలిసికొని, వేదమయంబు, ఆయిన తన శంఖంబు చేత = వేదాత్మకమగు తనశంఖముతో; అ, బాలుని, కపోలతలంబు, అంటినన్ = ఆధ్రువుని నుదుటిపై తాఁకగా; జీవ, ఈశ్వర, నిర్ణయజ్ఞుండు = జీవాత్మ పరమాత్మల తారతమ్యము నెఱింగినవాఁడును; భక్తి భావ నిష్ఠుండును ఆగు = స్థిరమయిన భక్తిగలవాఁడును అయిన; ధ్రువుండు = ధ్రువుఁడు; నిఖిల లోక విఖ్యాత కీర్తి కల = సమస్తలోకములందును ప్రసిద్ధిపొందిన కీర్తిగల ఈశ్వరునిన్ = శ్రీనివాసమూర్తిని; భగవత్ ప్రతిపాదితంబు అగుచు = భగవత్ప్రోక్తములై. వేద ఆత్మకంబులు ఐన = వేదమయములైన; తన వాక్కులన్ = తనమాటలతో ఇట్లని స్తుతియించెన్ = ఈరీతిగా స్తోత్రము చేసెను; దేవా = ప్రభువా, నిఖిల, శక్తి, ధరుండవు = సమస్తశక్తులను ధరించినవాఁడవును; అంతః, ప్రవిష్టుండవును, ఆయిన = భూయంతర్వ్యాప్తివియునైన; నీవు = నీవు; లీనంబులు అయిన మదీయ వాక్కులన్ లయము పొందిన నామాటలను; ప్రాణేంద్రియంబులన్ = ప్రాణము ఇంద్రియములను; కర చరణ; త్వక్ ఆదులను = చేతులు పాదములు చర్మము మొదలగువానిని; చిత్ శక్తిన్ = జ్ఞానశక్తి చేత; జీవింపన్ సిన = జీవించియున్నట్లు చే

చేసిన ◦ భగవంతుండవును = సర్వైశ్వర్యములను గలిగినవాఁడవును పరమపురుషుండవును = పురుషోత్తముఁడవును. అయిన = అయినట్టి నీకున్ నమస్కరింతున్ = నీకు నమస్కారము చేసెదను. నీవు, ఒక్కరుండవు. అద్వయున్ = నిత్యపదార్థమవు నీవొక్కఁడే అయినను మహత్, ఆద్యంబు, అయిన = మహాత్తు మొదలయిన యిరువైయయిదు తత్త్వములచే నిర్మింపఁబడిన. ఈ, అశేష, విశ్వంబు = ఈసకలప్రపంచమును. మాయా ఆఖ్యంబు అయిన = మాయయను పేరుగల. ఆత్మీయ శక్తిచేతన్ = నీశక్తిచేత ; కల్పించి = సృష్టిచేసి ; అందున్, ప్రవేశించి = అందులో ప్రవేశించి ; ఇంద్రియంబులందు, వసించును = కర్మ ; జ్ఞానేంద్రియములందునిలిచి ; తత్, తత్ దేవతా, రూపంబులచేన్ = ఆయా దేవతల రూపములతో ; నానా ప్రకారములన్ = అనేకవిధములుగా ; దారువులందు, ఉన్న, వహ్ని, చందంబునన్ = కట్టెలయందుదాగియున్న అగ్నివలె ; ప్రకాశింతువు = ప్రకాశించుచుందువు ; అదియున్, కాక = ఇంతేకాక.

తా. స్పష్టము.

చ. వరమతి నార్తబాంధవ భవద్ఘనబోధసమేతుఁడై భవచ్చరణముఁ బొందినట్టివిధి◆సర్గము సుప్తజనుండుబోధమందరయఁగ జూచురీతిఁ గను ◆ నట్టిమముక్షుశరణ్యమైన నీచరణములం గృతజ్ఞుఁ డగు◆సజ్జనుఁ డెట్లుదలంపకుండెడుక్.

అర్థ. ఆర్తబాంధవ = దీనశరణ్యా ! వరమతిన్ = మంచిబుద్ధితో ; భవత్, ఘన, బోధ, సమేతుఁడు, ఐ = నీదయిన గొప్పజ్ఞానమును గలిగి ; భవత్, చరణము, పొందినట్టి, విధి = నీపాదముల నాశ్రయించిన బ్రహ్మదేవుఁడు ; సర్గమునన్ = సృష్టిని ; సుప్తజనుండు = నిదురించుచున్నవాఁడు ; బోధమందు, అరయఁగన్, చూచి, రీతిన్ = మేల్కొనియున్న

ష్టంబు చూచునట్లే ; కనున్ = చూచును ; ఆర్తి, ముముక్షు, శరణ్యాము ఐన = ఆర్తిమోక్షేచ్ఛగలవారు శరణుచొరఁదగిన ; నీ, చరణములన్ = నీపాదములను , కృతజ్ఞుఁడు , అగు, సజ్జనుఁడు = చేసినమేలును తెలిసికొను సత్పురుషుఁడు ; ఎట్లు, తలంపకుండెడున్ = తలంపకుండ నెట్లుండఁగలఁడు ?

తా. ఆర్తబాంధవా! బ్రహ్మ నిన్ను తెలిసికొని, నీచరణములనాశ్రయించి, నిద్రపోవుచున్నవాఁడీ జగత్తుడును మేల్కొని చూచుచున్నట్లే చూచుచుండును. నీవు మోక్షేచ్ఛగలవారికి శరణమవు. అట్టినిన్ను కృతజ్ఞుఁడగువాఁడు తలంపకుండునా?

సీ. మహితాత్మ మఱి జన్మ • మరణప్రణాశన
హేతుభూతుండవు • సిద్ధకల్ప
తరువవు నగునిన్నుఁ • దగనెవ్వరేనేమి
పూని నీమాయావి • మోహితాత్ము
లగుచు ధర్మార్థకా • మాదులకొఱకుఁ దా
మర్చించుచును దిరుగు • నాథ
దేహోపభోగ్యమై • దీపించు సుఖముల
నెనయఁగ మదిలోన • నెంతు రట్టి

తే. విషయసంబంధజన్యమై • వెలయుసుఖము
వారికి నిరయమందును • వఱలు దేవ
భూరిసంసారతాపని • వారగుణక
థామృతాపూర్ణ యీశ మా • ధవ ముకుంద. 68

అర్థ. మహితాత్మ = మహానుభావా! మఱి = ఇంకను ; జన్మమరణప్రణాశన, హేతుభూతుండవు = పుట్టుక, చావు ; నాశనము అను దానిని కలిగించువాఁడవును ; సిద్ధ, కల్పతరువవున్ , అగు = పరిశస్తమైన

కల్పవృక్షమువంటివాఁడవైన ; నిన్నున్ = నిన్ను ; తగన్ = ఒప్పునట్లు ; ఎవ్వరేనిన్ = ఎవరయితే; ఏమి, పూని = ఏమిఆరంభించి ; నీ, మాయా విమోహిత , ఆత్ములు, అగుచున్ = నీమాయచేత మోహము పొందినబుద్ధికలవారై ; ధర్మ, అర్థ, కామ, ఆదులకొఱకు = ధర్మము , అర్థము కామము మొదలైనవానికోసము ; తాము = తాము; అర్చించుచును = భజించుచు ; త్రిగుణ, ఆభము, అయిన = సత్త్వరజస్తమోగుణములతో గూడిన ; దేహ = దేహము చేత ; ఉపభోగ్యమై = అనుభవింపఁదగినదై ; దీపించు = ఒప్పునట్టి ; సుఖములన్ = సౌఖ్యములను ; ఎనయంగన్ = పొందుటకు ; మదిలోనన్ = మనస్సులో; ఎంతురు = తలంతురో ; అట్టి, విషయ, సంబంధ, జన్యము అయి = ఆటువంటి విషయసంబంధమైపుట్టి; వెలయు = ఒప్పునట్టి ; సుఖము = సౌఖ్యము; వారికిన్ = వారికి ; నిరయమందును = నరకలోకములో కూడ; దేవ = ప్రభుఁడా; భూరి, సంసార, తాప, నివారణ, కథా, అమృత పూర్ణ = గొప్పసంసారతాపమును పోఁగొట్టు గుణకథనమను అమృతముచే పరిపూర్ణుఁడవైనవాఁడా ఈశ = ఈశ్వరా, మాధవా = శ్రీపతీ; ముకుంద = ముకుందా, వఱలున్ = కలుగును.

తా. శ్రీనివాసా నీవు సృష్టిలయకారకుఁడవు కల్పతరువువంటివాఁడవు నీమాయచే మోహము పొంది చతుర్విధపురుషార్థములకొఱకు త్రిగుణాత్మకమైన శరీరముచేత అనుభవింపఁదగిన సౌఖ్యములను పొందుటకై జనులు నిన్ను భజించుచుందురు అట్టివిషయ సంబంధములగు సౌఖ్యములను వారు నరకలోకమందును అనుభవించుచుందురు

మ. అరవిందోదర తావకీనచరణ ధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ స్వానందకబ్రహ్మమం
దరయన్ లేవఁట దండభృద్భటనికాయాకీర్ణులై కూలు నా
సురలోకస్థులఁ జెప్ప నేల సుజనశ్రేష్ఠైకచింతామణీ. 69

అర్థ. అరవింద, ఉదర = పద్మనాభా ; తావకీన = నీయొక్క—చరణ, ధ్యాన, అనురాగ , ఉల్లసత్, చరిత, ఆకర్ణన, జాత, భూరి, సుఖముల్ = నీపదధ్యానమునందు అనురక్తిపొందిన సచ్చరిత్రములను వినుట వలన గలిగిన సౌఖ్యములు ; స్వ, ఆనందక, బ్రహ్మమందున్ = తనంతట తాను ఆనందమును పొందునిర్గుణబ్రహ్మమునందు , అరయన్ = విచారింపగా? లేవుతంటు = ఉండవంటు; సుజన, స్తోమ ఏక , చింతా మణి = సజ్జనులకు చింతామణిరత్నము పోలినవాఁడా; దండధృత్, భట, విమాన , ఆకీర్ణులు, అయి = యమభటుల విమానములచేత కప్పఁబడినవారై, కూలు = అధోగతిపాలగు ; ఆసురలోకస్థులన్ = నరలోకవాసులను గూర్చి, చెప్పన్ ఏల = చెప్ప నవసర మేమున్నది,

తా. సాకారుడవైన నిన్ను భజించుటవలన గలుగు నానందము నీ నిర్గుణస్వరూపమును ఉపాసన చేయుటవలన కలుగదు. అట్టియెడ పాపులై నరక లోకమున పడియున్నవారిని గురించి చెప్ప నేల?

చ. హరి భజనీయమార్గనియతాత్మకులై భవదీయరూపమై
వఱలినభక్తియుక్తులగు వారలసంగతిఁ గల్గఁజేయు స
త్పురుషసుసంగతిన్ వ్యసనదుర్భరసాగరము న్నప్రయత్నతన్
సరసభవత్కథామృతరసంబున మత్తుఁడనై తరించెదన్.

అర్థ. హరి = శ్రీహరి; భజనీయ, మార్గ, నియత, ఆత్మకులు, అయి = స్తుతింపదగిన మార్గమునందు సంచరించుచు ; భవదీయ , రూపము, అయి = నీరూపముగా ; వఱలిన = ఒప్పిన ; భక్తియుక్తులు, అగు, వారల సంగతిన్ = భక్తితోకూడినవారి స్నేహమును; కల్గన్ ; చేయు = కలుగజేయునట్టి ; సత్పురుష, సుసంగతిన్ = సత్పురుషులస్నేహము చేత, వ్యసన, దుర్భర , సాగరము = దుఃఖముతోకూడిన సంసారసముద్రమును; అప్రయత్నతన్ = సులభముగా; సరస, భవత్, కథా అమృతరసంబునన్ = రసవంతమైన నీకథామృతముచేత; మత్తుఁడను, అయి = మదించినవాఁడనయి ; తరించెదన్ = దాఁటగలను.

తా. శ్రీహరీ సన్మార్గవర్తనులై నిన్ను ఆశ్రయించిన సత్పురుషుల స్నేహముచేతను, నీకథామృతరసమును, సేవించుటచేతను దుఃఖభూయిష్ఠమైన సంసారసముద్రమును దాఁటెదను.

చ. నిరతముఁ దావకీనభజ ♦ నీయపదాబ్జసుగంధలుబ్ధులె
వ్వరిమదిఁబొందఁగాఁగలుగు ♦ వారలు తత్ప్రియమర్త్య
దేహము, న్నరయఁ దదీయదారతన ♦ యాదిసుహృద్గృ
హబంధువర్గముల్ మఱతురు విశ్వతోముఖర ♦ మాహృ
దయేశ ముకుంద మాధవా.

అర్థ. నిరతము = ఎల్లప్పుడును ; తావకీన, భజనీయ, పద, అబ్జ, సుగంధ లుబ్ధులు = భజింపఁదగిన నీపాదపద్మములయందలి సుగంధమునందు లోలురగువారు, ఎవ్వరి ; మదిన్ = ఎవరిమనసునందు ; పొంద కలుగును పొందవలెనను ; వారలు = వారు ; తత్, ప్రియ, మర్త్యదేహమున్ = తమకు ప్రియకరమైన మనుష్యశరీరమును , తదీయ, దార, తనయ, ఆది సుహృత్ , గృహ , బంధువర్గమున్ = తమభార్యలు, = కొడుకులు , స్నేహితులు ; ఇండ్లు బంధువులు మొదలగువారిని ; విశ్వతోముఖ = సమస్తదిక్కులందును వ్యాపించియున్నవాఁడా ; రమాహృదయేశ = లక్ష్మీపతియగుఁడా; ముకుంద; మాధవా; అరయున్ = విచారింపఁగా; మఱతురు = మఱచిపోవుదురు.

తా. శ్రీనివాసా ! నీపాదపద్మపరిమళమునందు కోరికకలిగి నిన్ను తమహృదయములందు నిలుపుకొన్నవారు తమ శరీరమును భార్యాపుత్రాదులను మఱచియుందురు.

సీ. పరమాత్మ మర్త్యాసు ♦ పర్వతిర్యక్సృగ
దితిజసరీసృప ♦ ద్విజగణాది
సంవ్యాప్తమును సద ♦ సద్విశేషంబును
గైకొని మహదాది ♦ కారణంబు

నైనవిరాడ్విగ్ర • హంబు నేనెఱుఁగుదుఁ
గాని తక్కిన సుమంగ • ళము నైన
సంతతసుమహితై • శ్వర్యరూపంబును
భూరిశబ్దాదివ్యా • పారశూన్య
తే. మైన బ్రహ్మస్వరూప మే • నాత్మ నెఱుఁగఁ
బ్రవిమలాకార సంసార • భయవిదూర
పరమమునిగేయ సంతత • భాగధేయ
నలిననేత్ర రమాలల • నాకళత్ర.

అర్థ. పరమాత్మ = పరమాత్మా ; మర్త్య, సుపర్వ, తిర్యక్, మృగ దితిజ, సరీసృప, ద్విజ గణ ఆది సంవ్యాప్తమును = మనుష్యులు, దేవతలు పశువులు రాక్షసులు పాములు పక్షులు మొదలగువానిచే వ్యాపించియున్నదియై ; సత్, అసత్, విశేషంబును = సత్యము అసత్యము అనువానితోఁ గూడియున్న అనురూపమును ; దైకొని = తాల్చి ; మహత్ ఆది, కారణంబును, అయిన = మహత్ మొదలుగాఁగల ఇరువదియైదు తత్త్వములకు మూలమైన ; విరాడ్విగ్రహంబున్ = విరాట్స్వరూపమైన రూపమును ; ఏన్, ఎఱుఁగుదున్ = నాకు తెలియును ; కాని = కాని ; తక్కిన = మిగిలిన ; సుమంగళమును, అయిన = శోభనాకారముగలట్టియు ; సంతత సుమహిత, ఐశ్వర్య, రూపంబును = ఎల్లప్పుడును మిక్కిలి గొప్పదియై లోకపరిపూర్ణమును దాల్చియుండు రూపమును ; భూరి, శబ్ద, ఆది, వ్యాపార శూన్యము, అయిన = గొప్పశబ్దము మొదలగు ఇంద్రియవ్యాపారములులేని ; బ్రహ్మస్వరూపమునన్ = నిర్గుణబ్రహ్మస్వరూపమును ; ప్రవిమల, ఆకార = నిర్మలస్వరూపముకలవాఁడా, సంసార భయ విదూర = సంసారభయమును దూరముగా నుంచువాఁడా, పరమమునిగేయ = మహాత్ములచే కీర్తింపఁబడువాఁడా సంతతభాగధేయ = ఎడతెగని శుభములు గలవాఁడా నలిననేత్ర = పుండరీకాక్షా రమాలలనా కళత్ర = లక్ష్మీపతి

యుఁడా. ఏన్ = నేను ఆత్మన్ = మనసు లో. ఎఱుంగన్ = తెలిసికొనఁ జాలను.

తా. పుండరీకాక్షా! నీవిగ్రహము సమస్తచరాచరజగత్తులకు ఆలవాలము ఐయున్నది. సత్యాసత్యస్వరూపమును కలిగియున్నది, ఇరువదియైదు తత్త్వములకును మూలమయియున్నది. ఆస్వరూపము నాకు తెలియును, కాని నిర్గుణబ్రహ్మస్వరూపము నాకు తెలియదు.

సీ. సర్వేశ కల్పాంత ❀ సమయంబునందు నీ
యఖిలప్రపంచంబు ♦ నాహరించి
యనయంబు శేష ❀ సహాయుండ వై శేష
పర్యంకతలమునఁ ❀ బవ్వళించి
యోగనిద్రారతి ❀ నుండి నాభీసింధు
జన్మలోకకం ❀ జాతకర్ణి
కంగుఁ జతుర్ముఖు ❀ నమరఁ బుట్టించుచు
రుచి నొప్పు బ్రహ్మస్వ ❀ రూపు వైన
తే. నీకు మ్రొక్కెద సత్యంత ❀ నియమ మొప్ప
భక్తచారిత్ర పంకజ ❀ పత్ర నేత్ర
చిరశుభాకార నిర్మల ❀ శ్రీవిహార
యవ్యయానంద గోవింద ❀ హరి ముకుంద. 73

అర్థ. సర్వేశా = సర్వలోకములకును ప్రభువా. కల్పాంతసమయంబునందు = ప్రళయకాలమందు. ఈ అఖిలప్రపంచంబును = సమస్తవిశ్వమును. ఆహరించి = నీలోనికి తీసుకొని. అనయంబున్ ఎల్లప్పుడును. శేషసహాయుండవయి = ఆదిశేషునిసహాయముతో. శేష; పర్యంకతలమునన్ = శేషుడనుపఱుపుపై. పవళించి = పరుండి. యోగనిద్రారతిన్

ఉండి = యోగనిద్రఅను అనుభవించుచు నాభి, సింధుజ స్వర్ణలోక, కం
జాత, కర్ణిక అందున్ = నాభియనెడు సముద్రమునందు పుట్టిన సువర్ణ
లోకములోని పద్మముయొక్క కర్ణికయందు . చతుర్ముఖున్ = నాలు
గుముఖములుగల బ్రహ్మను అమరన్ = ఒప్పునట్లు పుట్టించుచున్ = జన్మిం
పజేసి, రుచిన్ = కాంతితో . ఒప్పు = ఒప్పుచున్న , బ్రహ్మస్వరూపివి,
అయిన = పరబ్రహ్మస్వరూపుడవైన . భవ్యచారిత్ర = పావనమైన చరిత్రము
గలవాడా . పంకజపత్రనేత్ర = పద్మపత్రాక్షా . చిర శుభ ఆకార =
సంతతమైన శుభాకారముగలవాడా . నిత్యలక్ష్మీవిహార = నిత్యమును లక్ష్మి
తో విహరించువాడా. అవ్యయ, ఆనంద = నాశనములేని ఆనందముగల
వాడా. గోవిందా. హరి ముకుంద. అత్యంతనియమము ఒప్పన్ = మిక్కిలి
శ్రద్ధతో. నీకున్ మ్రొక్కెదన్ = నీకు నమస్కరించెదను

తా. సర్వేశ్వరా, ప్రళయకాలమందు నీవు సకలలోకములను నీ
లోనికి లాగుకొని శేషునిపై పవళించి యోగనిద్రయందుండి నీనాభికమ
లమునుండి చతుర్ముఖబ్రహ్మను సృష్టించి పరబ్రహ్మస్వరూపుడవై ఒప్పు
చుందువు. అట్టి నీకు శ్రద్ధతో నమస్కరించుచున్నాను.

వ. అట్లు యోగనిద్రాపరవశుండ వయ్యును జీవులకంటె
నత్యంతవిలక్షణుండవై యుండుదు వది యెట్లనిన బుద్ధ్య
వస్థాభేదంబున నఖండితం బయిన స్వశక్తిం జేసి చూచు
లోకపాలన నిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్య
ముక్తుండవును బరిశుద్ధుండవును జిద్రూపకుండవును నా
త్మవును గూటస్థుండవును నాదిపురుషుండవును భగవం
తుండవును గుణత్రయాధీశ్వరుండవును నై వర్తింతువు
భాగ్యహీనుం డైన జీవునియందు నీగుణంబులు గలుగవు
సర్వేశ్వరునందే నేమి విరుద్ధగతులై వివిధశక్తియుక్తంబు

లైన విద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబులగు
చుండు నట్టి విశ్వకారణంబు నేకంబు ననంతంబు నా
ద్యంబు నానందమాత్రంబు నవికారంబు నగు బ్రహ్మం
బునకు నమస్కరించెద మఱియు దేవా నీవ సర్వవిధఫలం
బని చింతించుచు నిష్కాము లయిన వారికి రాజ్యాదికామితం
బులలోనఁ బరమార్థం బయిన ఫలంబు సర్వార్థరూపుండ
వైన భవదీయపాదపద్మసేవనంబ యిట్లునిశ్చితంబ యైనను
సకాములైన దీనులను గోవు వత్సంబును స్తన్యపానంబు
సేయించుచు వృకాదిభయంబువలన రక్షించుచందంబు
నం గామపూరకుండవై సంసారభయంబువలనం బాపుదు
వని యిట్లు సత్యసంకల్పుండును సుజ్ఞానియు నయిన ధ్రు
వునిచేత వినుతింపఁబడి భృత్యానురక్తుం డైన భగవం
తుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె 74

అర్థ. అట్లు = ఆవిధముగా; యోగనిద్రాపరవశుండవు, అయ్యు
ను = యోగనిద్రయందు శరీరమును మరచినవాఁడవయ్యును; జీవులకం
టెన్ = ప్రాణికోటికంటె; అత్యంతవిలక్షణుండవు అయి = మిక్కిలిభే
దము పొందినవాఁడవు అయి; ఉండుదువు = ఉందువు; అది, ఎట్లు, అని
నన్ = అదిఎట్లనగా; బుద్ధి, అవస్థా, భేదంబులన్ = బుద్ధియను అవస్థా
భేదముచేత. అఖండితంబు అయిన స్వశక్తిన్, చేసి = ముక్కవోవని
ఆత్మశక్తిచేత; చూడు = చూచునటువంటి; లోకపాలననిమిత్తంబు =
లోకములను పాలించుకొఱకు; యజ్ఞ, అధిష్ఠాతవు కావునన్ = లోక
పాలనమును యజ్ఞమును పూనియున్నవాఁడవు; కావునన్ = గనుక; నీవు =
నీవు; నిత్య, ముక్తుండవును = ఎల్లప్పుడునుబంధములేనివాఁడవును; పరిశు

ద్ధుండవును = పవిత్రుఁడవును ; చిత్, రూపకుండవు = జ్ఞానస్వరూపుఁడవు
వును; ఆత్మవును; = సమస్తలోకములకు నాత్మవును ; కూటస్థుండవును =
లోకములకు మూలమును; ఆదిపురుషుండవును = పురుషులలో మొదటి
వాఁడవును; భగవంతుండవును = ఐశ్వర్యయుక్తుండవును; గుణత్రయాధీ
శ్వరుండవును, అయి = సత్త్వరజస్తమోగుణములను నీయధీనమందుంచు
కొన్నవాఁడవును అయి; వర్తింతువు = సంచరింతువు ; భాగ్యహీనుండు;
అయిన, జీవునియందు = దరిద్రునియందు ; నీగుణములు = నీగుణములు ,
కలుగవు = కలుగవు; ఏ; సర్వేశ్వరుఁడవు, ఏన్ = ఏసర్వేశ్వరుఁడవు నంద
యితే; ఏమి, విరుద్ధగతులు, అయి = ఇట్టివిరుద్ధప్రవర్తనములు గలవయి; వివి
ధశక్తియుక్తంబులు అయిన = అనేకశక్తులు కలిగియున్న; విద్యాదులు =
విద్యా, అవిద్య మొదలగునవి ఆనుపూర్వ్యంబు సంజేసి = ఒకదానితర్వా
తనొకటి పరిలీనంబులు, ఆగుచుండున్ = లీనములగుచుండునో ; అట్టి =
అటువంటి; విశ్వకారణంబును = విశ్వమునకు కారణమును ; ఏకంబును =
ఒక్కటియు; అనంతంబును = అంతములేనిదియు; ఆద్యంబును = మొద
టిదియు; ఆనందమాత్రమును = కేవలఆనందస్వరూపమును ; అవికారం
బును = మార్పులేనిదియు; అగు = అయిన; బ్రహ్మంబునకు = నిర్గుణపరబ్ర
హ్మంబునకు ; నమస్కరించెదన్ = నమస్కారము చేసెదను ; మఱి
యున్ = ఇంకను; దేవా = ప్రభువా; నీవ = నీవే; సర్వ, విధ, ఫలంబు,
అని = అన్నివిధములయిన ఫలము అని; చింతించు = నిన్నుధ్యానించునట్టి ;
నిష్కాములు అయినవారికి = కోరికలేనివారికి; రాజ్య ఆది, కామితంబు
లోనన్ = రాజ్యము మొదలగు కోరికలలో ; పరమార్థంబు అయిన = మి
క్కిలియు కోరతగిన; ఫలంబు = ఫలము; సర్వార్థరూపుండవు అయిన =
సకలమైన కోరికల రూపమును దాల్చియున్న, భవదీయ, పాద, పద్మ, సేవ
నంబ = నీయొక్క పాదపద్మములను సేవించుటయే; ఇట్లు = ఈరీతిగా;
నిశ్చితంబ, అయినను = స్థిరపడియున్నను; గోవు = ఆవు; వత్సంబును =
దూడను; స్తన్యపానంబు, చేయించును = పాలుకుడిపించును; వృక,

అది, భయంబువలనన్ = తోడేళ్లు మొదలగు క్రూరజంతువుల భయము
నుండి ; రక్షించుచందమునన్ = కాపాడునట్లు ; సకాములు, అయిన,
దీనులను = కోరికలుగల దీనులను కామప్రదుండవై వారి కోరికలను
ఇచ్చుచు ; సంసారభయంబువలనన్ = సంసారభయమునుండి ; పాపు
దువు, అని = విడిపింతువని; ఇట్లు = ఈరీతిగా; సత్యసంకల్పుండును =
సత్యమే సంకల్పముగా కలవాడును; సుజ్ఞానియు = మంచిజ్ఞానముకలవా
డును, అయిన = అయిన, ధ్రువుని చేత = ధ్రువునిచేత; వినుతింపఁబడి =
స్తుతింపబడి ; భృత్యఅను రక్తుండుఆయిన = దాసులయందు ప్రేమగల;
భగవంతుడు = శ్రీహరి ; సంతుష్ట, అంతరంగుడు, అయి = సంతోషించి
నమనస్సుగలవాడయి; ఇట్లుఅనియెన్ = ఈరీతిగాపలికెను.

తా. స్పష్టము.

క. ధీరవ్రత రాజన్యకు
మారక నీహృదయమందు ♦ మసలినకార్యం
బారూఢిగా నెఱుంగుదు
నారయ నది పొందరాని ♦ దైనను నిత్తున్. 75

అర్థ. ధీరవ్రత = ధైర్యమేవ్రతముగా గలవాఁడా; రాజన్యకుమా
రక = క్షత్రియపుత్రుఁడా; నీ, హృదయమందు = నీమనస్సులో ; మస
లిన = ఉండిన; కార్యంబు = కోరిక, ఆరూఢిగాన్ = బాగుగా; ఎఱుం
గుదున్ = తెలిసికొనియున్నాను ; అరయన్ = పరీక్షింపగా ; అది = ఆ
కోరిక ; పొందరానిది అయినను = సాధ్యముకానిదైనను ; ఇత్తున్ =
ఇచ్చెదను.

తా. ఓయి ధ్రువుఁడా నీమనస్సులోనున్నకోరిక నాకు బాగుగా
తెలియును. అదిపొంద శక్యముకానిదైనను నీకు దాని నిచ్చెదను.

వ. అది యెట్టిదనిన నెందేని మేధియందుఁ బరిభ్రామ్యమాణ
గోచక్రంబునుం బోలె గ్రహనక్షత్రతారాగణజ్యోతి

శ్చక్రంబు నక్షత్రరూపంబులయినధర్మాగ్నికశ్యపశక్రులును
సప్తర్షులును దారకాసమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుం
డుదురట్టిదురాపంబును ననన్యాధిష్ఠితంబును లోకత్రయ
ప్రళయకాలంబునందు నశ్వరంబు గాక ప్రకాశమానం
బును నయినధ్రువక్షితి యనుపదంబు ముందట నిరువది
యాఱువేలేండ్లు సనం బ్రాపింతువు తప్పదప్రాప్తిపర్యం
తంబు భవదీయజనకుండు వనవాసగతుండైనం దద్రా
జ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండ
వై చేయుదువు భవదనుజుం డగునుత్తముండును మృగయా
ర్థంబు వనంబునకుం జని మృతుండగుం దదన్వేషణార్థం
బు తదాహితచిత్తయై తన్మాతయు వనంబునకుం జని
యందు దావదహననిమగ్నయగు వెండియు. 76

అర్థ. అది = ఆకోటిక; ఎట్టిదనినన్ = ఎటువంటిదనగా; ఎందే
నిన్ = ఎప్పుడైనను; మేధియందున్ = బుద్ధిమంతునియందు; పరిభ్రామ్య
మాణ = తిరుగుచుండు; గోచక్రంబునన్, పోలెన్ = భూచక్రమువలె;
గ్రహ, నక్షత్ర, తారాగణ, జ్యోతిష్చక్రంబు = నవగ్రహాదులు, నక్ష
త్రములు ఉపగ్రహములు జ్యోతిస్చక్రము; నక్షత్రరూపంబులు = నక్ష
త్రరూపములుకలిగిన; ధర్మ, అగ్ని, కశ్యప, శక్రులును = యముఁడు,
అగ్ని, కశ్యపబ్రహ్మ,యింద్రుఁడును సప్తఋషులును = ఏడుగురు మహాఋ
షులును; తారకాసమేతులై = నక్షత్రములతోఁ గూడి; ప్రదక్షిణంబు,
తిరుగుచుండుదురు = ప్రదక్షిణము చేయుచుందురో, అట్టి = అటువంటి;
దురాపంబును పొంద శక్యము గానిదియు అనన్య, అధిష్ఠితంబును = ఇ
తరులచే పొందబడనట్టియు; లోకత్రయ, ప్రళయకాలమునందు = మూఁ

డులోకములును నశించునప్పుడు ; నశ్వరంబు, కాక = నశింపక ; ప్రకాశమానంబును అయిన = ప్రకాశించుచుండునట్టి ; ధ్రువక్షితి, అను, పదంబున్ = ధ్రువమండలమగుస్థానమును, ముందటన్ = యికముందు; ఇరువదియాఱువేల ఏండ్లు = 2000 సంవత్సరములు ; చనన్ = కడచినపిదప; ప్రాపింతువు = పొందుచుందువు; తత్, పద, ప్రాప్తి, పర్యంతంబు = ఆస్థానము లభించువఱకును ; భవదీయ, జనకుండు = నీతండ్రి; వనవాసగతుండు అయినన్ = వానప్రస్థాశ్రమమునకు పోగా; తత్, రాజ్యంబు = అతనిరాజ్యమును పూజ్యంబుగాన్ = పొగడదగినట్లుగా; ధర్మమార్గంబునన్ = ధర్మముతో ; జితేంద్రియుండవు అయి = ఇంద్రియములను జయించినవాఁడవై; చేయుదువు = పాలింతువు; భవత్, అనుజుఁడు ఆగు ఉత్తముండు = నీతమ్ముఁడైన ఉత్తముఁడు; మృగయా, అర్థంబు = వేటకొఱకు; వనంబునకు, చని = అడవికిపోయి ; మృతుండు అగున్ = మృతినొందును ; తత్; అన్వేషణ, అర్థంబు = అతనిని వెదకుటకై . తత్, ఆహిత, చిత్త, అయి = అతనియందుంచబడిన మనస్సుకలదై; తత్, మాతయున్ = అతని తల్లియును. వనంబునకున్. చని = అడవికిపోయి. అందు = ఆఅడవిలో. దావ, దహన, నిమగ్న అగున్ = కారుచిచ్చులోపడును. పెండియున్ = మఱియును.

తా. స్పష్టము.

సీ. అనఘాత్మ మఱి నీవు ♦ యజ్ఞరూపుం డనఁ
దగు నన్ను సంపూర్ణ ♦ దక్షిణంబు
లగుమఖంబులచేత ♦ నర్చించి సత్యంబు
లగునిహసౌఖ్యంబు ♦ లనుభవించి
యంత్యకాలమున న ♦ న్నాత్మఁ దలంచుచు
మఱి సర్వలోకన ♦ మస్కృతమును

మహిఁ బునరావృత్తి రహితంబు సప్తర్షి
మండలోన్నత మగు ♦ మామకీన
తే. పదము దగఁ బొందఁ గలవని ♦ పరమపురుషుఁ
డతని కభిలషి తార్థంబు ♦ లర్థి నిచ్చి
యాతఁడు గనుఁగొను చుండంగ ♦ నాత్మపురికి
గరుడగమనుఁడు వేంచేసెఁ ♦ గౌతుకమున. 77

అర్థ. అనఘ, ఆత్మ = పాపములేనివాఁడా; ధ్రువుఁడా. మఱి = ఇంకను, నీవు = నీవు. యజ్ఞరూపుండు; అగు, నన్నున్ = యజ్ఞమే స్వరూపముగాఁగల నన్ను. సంపూర్ణ దక్షిణా[illegible], మఖంబుల చేతన్ = [illegible] దక్షిణలిచ్చి యజ్ఞములను చేసి, అర్చించి = నన్ను పూజించి. సత్యంబులు, అగు, ఇహసౌఖ్యంబులు, అనుభవించి = నిశ్చయమైన ఇహలోకసౌఖ్యముల ననుభవించి. అంత్యకాలమునన్ = మరణకాలమునందు. నన్నున్, ఆత్మన్ తలంచుచున్ = నన్ను మనస్సులోఁ దలఁచికొని, మఱి = ఇంకను. సర్వలోక, నమస్కృతమును = సమస్తలోకములచేతను నమస్కరింపఁబడినదియును. మహిన్ = భూమియందు పునరావృత్తి రహితంబు = పునర్జన్మములేనట్టియు సప్తర్షి మండల, ఉన్నతమును, ఐన = సప్తఋషులస్థానమంత ఎత్తునదియు అయిన, మామకీన, పదమును = నాస్థానమును (అనఁగా విష్ణుపదమును, ఆకాశమును) ; తగన్, పొందన్, కలవు, అని = తప్పక చేరఁగలవని. పరమపురుషుఁడు = పురుషోత్తముఁడైన శ్రీమహావిష్ణువు. అతని = ధ్రువుని. అభిలషిత, అర్థంబుల = కోరినకోరికలను అర్థిన్ = ప్రీతితో. ఇచ్చి = ఇచ్చి. ఆతఁడు, కనుఁగొనుచుండంగన్ = ఆధ్రువుఁడు చూచుచుండఁగనే. గరుడగమనుఁడు = గరుడవాహనుఁడైన శ్రీహరి. ఆత్మపురికిన్ = తన వైకుంఠపురమునకు. వేంచేసెన్ = వెడలిపోయె,

ను

తా. ఓ ధ్రువుఁడా! నేను యజ్ఞస్వరూపుఁడను, అట్టినన్ను నీవు బహువిధ యజ్ఞములచేత పూజించి, ఇహసౌఖ్యముల ననుభవించి, మరణకాలమున నన్ను స్మరించుచు, సప్తర్షిమండలోన్నతమైన స్థానమును పొందఁగలవు. అని పలికి పురుషోత్తముఁ డాతని కోరినవరము లిచ్చి గరుడారూఢుఁడై, అతఁడు చూచుచుండగనే వైకుంఠపురమునకు పోయెను.

తే. అంత ధ్రువుఁడును బంకేరు • హాక్షుపాద
కమలసేవాప్రపాదిత • ఘనమనోర
థములఁ దనరియుఁ దనదుచి • త్తంబులోనఁ
దుష్టిఁ బొందక చనియెను • శిష్టచరిత. 78

అర్థ. అంతన్ = అప్పుడు. ధ్రువుడును = ధ్రువుఁడుకూడ. పంకేరుహాక్ష, పాదకమల, సేవా, ఉపపాదిత, ఘన, మనోరథములన్ = పుండరీకాక్షుని పాదపద్మములను సేవించుటచేత పొందఁబడిన గొప్పవరములతో తనరియున్ = ఒప్పినప్పటికిని. తనదు, చిత్తంబులోనన్ = తనమనస్సులో తుష్టిన్, పొందక = సంతోషింపక. చనియెన్ = పోయెను.

తా. విదురుఁడా అప్పుడు ధ్రువుఁడు శ్రీహరి పాదపద్మసేవనముచేత గొప్పవరములను పొందియు తన మనస్సున సంతోషింపకుండెను.

క. అని మైత్రేయుఁడు ధ్రువుఁడ
ట్లనయము హరిచేఁ గృతార్థుఁ • డైనవిధంబె
ల్లను వినుపించిన విదురుఁడు
విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్ 79

అర్థ. అని = ఈప్రకారముగా. మైత్రేయుఁడు = మైత్రేయుఁడు. ధ్రువుఁడు = ధ్రువుఁడు అట్లు = ఆరీతిగా. అనయము = శాశ్వతముగా, హరిచేన్ = విష్ణుమూర్తిచేత. కృతార్థుఁడు అయిన, విధంబు, ఎల్లను = తన

కోరికలనుపొందినప్రకారమంతయును. వినుపించినన్ = తెలుపఁగా, విదురుఁడు = విదురుఁడు. విని = విని. మునివరున్, చూచి — మునిశ్రేష్ఠుఁడైన మైత్రేయునిజూచి. వినయంబు, ఎసఁగన్ = ఎక్కువవినయముతో. పలికెన్ = పలికెను.

తా. ధ్రువుఁడు విష్ణుమూర్తిచే వరమును పొందినప్రకారమును మైత్రేయుఁడు చెప్పఁగా విని విదురుఁడతనితో నిట్లనియె.

క. మునినాయక విను కాముక
జనదుష్ప్రాపంబు విష్ణు • చరణాంబురుహా
ర్చన మునిజనసంప్రాప్యము
ననఁ గలపంకేరుహాక్షు • నవ్యయపదమున్. 80

అర్థ. మునినాయక = మునిశ్రేష్ఠుఁడా! విను = వినుము. కాముకజన దుష్ప్రాపంబు = కోరికలుగలవారిచేపొందఁగా రానట్టియును. విష్ణు, చరణ, అంబురుహ, అర్చన, మునిజన, సంప్రాప్యమున్ = విష్ణుమూర్తి పాదపద్మములను సేవించు మునులచే పొందఁదగినట్టిదియును. అనఁగల = చెప్పఁదగు పంకేరుహాక్షు, అవ్యయపదమున్ = పుండరీకాక్షుని, నాశనములేని పదవిని [ముందుపద్యముతో నన్వయము.]

తా. ఓమైత్రేయా! ఫలాపేక్షగలవారికి పొందరానట్టియుఁ విష్ణుసేవానిరతులగు మునులచే పొందఁదగినట్టిదియు శ్రీవిష్ణుమూర్తియొక్క యవ్యయపదమును (ముందుపద్యముతో నన్వయము.)

వ. పెక్కుజన్మంబులఁగాని పొందరానిపదంబు దా నొక్కజన్మంబుననే పొందియుం దవమనంబునం దప్రాప్తమనోరథుండ నని పురుషార్థవేది యైనధ్రువుం డెట్లు దలంచె ననిన మైత్రేయుండిట్లనియె. 81

అర్థ. పెక్కు జన్మంబులన్, కాని, పొందరాని, పదంబు = అనేకజన్మము లెత్తినపిదపగాని లభింపనిస్థానమును ; తాను, ఒక్కజన్మమునవే, పొందినయున్ = తానొక్కజన్మములోనే పొందినప్పటికిని; తన మనంబునందు = తనమనసులో ; అప్రాప్తమనోరథుండను, అని = కోరికిబడసినవాఁడను కానని; పురుషార్థవేది అయిన, ధ్రువుండు = ధర్మార్థకామమోక్షముల ప్రయోజనమెఱింగినధ్రువుఁడు ; ఎట్లు తలంచెన్ = ఎట్లు అనుకొనెను ; అని పలుకంగాన్ = అని పలుకఁగా ; మైత్రేయుండు ఇట్లు అనియెన్ = మైత్రేయుఁ డిట్లు పలికెను.

తా. స్పష్టము.

తే. అనఘ పినతల్లి దన్నుఁ బ ♦ ల్కినదురుక్త
బాణవిద్ధాత్ముఁ డగుచుఁ ♦ దద్భాషణములు
చిత్తమందుఁ దలంచుటఁ ♦ జేసి ముక్తి
గోరమికి నాత్మలో వగఁ ♦ గూరుచుండె. 82

అర్థ. అనఘా = పాపములేనివాఁడా ; పినతల్లి = సవతితల్లియైన సురుచి; తన్నున్, పల్కిన = తన్నుఁగూర్చి పలికిన ; దురుక్త, బాణ, విద్ధ, ఆత్ముఁడు = అగుచున్ = దుర్భాషలనుబాణములచే కొట్టఁబడిన మనస్సు గలవాఁడై ; తత్ , భాషణములు = ఆమాటలను ; చిత్తమందున్, తలంచుటన్, చేసి = మనస్సులో తలఁచుటచేత; ముక్తిన్, కోరమికిన్ = ముక్తిని కోరకుండుటకు ; ఆత్మలోన్ = మనస్సులో ; వగన్, కూరుచుండెన్ = ఎక్కువవిచారింపసాగెను.

తా. విదురుఁడా! ధ్రువుఁడు పినతల్లి తన్ననిన వాఁడిమాటలను తలంచుచు శ్రీహరి ప్రత్యక్షమునప్పుడు ముక్తిని కోరనైతిఁగదా యని మిక్కిలి చింతించుచుండెను.

వ. అంత నాధ్రువుండు. 83

అర్థ. అంతన్ ,ఆ, ధ్రువుండు = పిమ్మట ఆధ్రువుఁడు.

చ. అనఘుజితేంద్రియుల్ సుమహితాత్ములునైన సనందనాదు లెం
దనయము నైకజన్మసముపార్జిత యోగసమాధిఁ జేసి యె
వ్వనిచరణారవిందములు వారనిభక్తి నెఱుంగుచుందు రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజయ్యు నాద్యునిన్.

అర్థ. అనఘా, జితేంద్రియుల్ = పాపములను వదలి యింద్రియములను జయించినవారును; సుమహిత; ఆత్ములును, అయిన = మహానుభావులును అయిన; సనందనాదులు = సనందనాదిమహర్షులు; ఎందున్, అనయమున్ = ఎల్లప్పుడును; న, ఏకజన్మ, సముపార్జిత, యోగసమాధిన్ చేసి = అనేకజన్మములలో యోగమునందు స్థిరులైయుండి; ఎవ్వని, చరణ, అరవిందములు = ఎవని పాదపద్మములను; వారనిభక్తిన్ = ఎడతెగనిభక్తితో; ఎఱుంగుచుందురు = తెలిసికొనుచుందురో; ఆ, ఘనున్ = ఆగొప్పవానిని; పరమేశున్ = పరమేశ్వరుని; ఈశున్ = లోకపాలకుఁడైనవానిని; అవికారున్ = మార్పులేనట్టివానిని; అమేయున్ = పరిమితిలేనివానిని; అజయ్యున్ = జయింపశక్యముకానివానిని; ఆద్యునిన్ = జగమునకు మూలమయినవానిని- (ముందుపద్యముతో నన్వయము)

తా. పాపరహితులయి, యింద్రియనిగ్రహము కలిగి, మహానుభావులైన సనందనాది మహర్షులు పెక్కుజన్మములందు యోగసమాధిలో నిలిచి శ్రీహరి పాదపద్మములను తెలిసికొనుచుందురు. అట్టిపరమేశ్వరుని, (ముందుపద్యముతో నన్వయము.)

వ. ఏను మహాత్మ సంబులు భజియించి తత్పాదపద్మచ్ఛాయం బ్రాపించియు భేదదర్శనుండ నైతి నకటా యిట్టిభాగ్యహీనుండ నైన యేను భవనాశకుం డైన యతనిం బొడగనియు నశ్వరంబు లైన కామ్యంబులడిగితి నిట్టిదారాత్మ్యం బెందేనిం గలదే తమ పదంబులకంటె నున్నతపదంబునం

బొందుదునో యని సహింపఁ జాలనియీ దేవతలచేత
మదీయమతి గలుషితం బయ్యెంగాక నాఁడు నారదుం
డాడినమాట తథ్యంబయ్యె నతనివాక్యంబు లంగీకరింపక
యే నసత్త్వుండనై స్వస్థానస్థలంబొందినవాఁడు దైవి
కంబైనమాయం జెంది భిన్నదర్శనుం డగు చందంబున
నద్వితీయుండ నైనను భ్రాంతయును శత్రువుచేఁ బ్రాప్తం
బైన దుఃఖంబు నొంది జగదాత్మకుండును సుప్రసాదుం
డును భవనాశకుండును నైన యీశ్వరు నారాధించి
తత్ప్రసాదంబు వడసియు నాయుర్విహీనుం డైన రోగికిం
బ్రయోగించు నౌషధంబులుంబోలె నిరర్థకంబులై నశ్వ
రంబు లైన యీ కామితంబులు గోరితి నని వెండియు. 85

అర్థ. ఏను = నేను ; షట్, మాసంబుల = ఆఱునెలలుమాత్రము ;
జియించి = సేవించి ; తత్ పాదపద్మచ్ఛాయన్ = అతని పాదపద్మముల
డను ; ప్రాపించియున్ = చేరియు ; భేదదర్శనుండను అయితిన్ = భేద
బుద్ధిగలవాఁడనైతిని (అనఁగా నేను తక్కువవాఁడను. నాసోదరుఁ
డెక్కువవాఁడు, సురుచి నన్ను ద్వేషించుచున్నది మొదలగు భావము
ను పొందితిని;) అకటా = అయ్యో ; ఇట్టి, భాగ్యహీనుండను,
అయిన, ఏను, ఇట్టిదురదృష్టవంతుండ నగు నేను ; భవనాశకుండయిన,
అతనిన్, పొడఁగనియున్ = జన్మములేకుండ చేయు నాయీశ్వరుని చూ
చియు ; నశ్వరంబులు. అయిన, కామ్యంబులు, అడిగితిన్ = నాశనము
గాందుకోరికలను అడిగితిని; ఇట్టిదౌర్భాగ్యంబు ఎందేనిన్, కలదే = ఇట్టి
హీనబుద్ధి ఎక్కడనైన నుండునా ; తనుపదంబులకంటెన్ = తనస్థాన
ములకంటె ; ఉన్నతపదంబునన్, పొందుదునో, అని = ఎక్కువస్థాన

మును పొందుదు నేమో యనిఁ; సహింపజాలని = ఓర్వలేని ; ఈదేవతల
చేత = ఈదేవతలమూలమున ; మదీయ, మతి = నాబుద్ధి ; కలుషితంబ
య్యెన్ , కాక = చెడిపోయినది కాని ; నాకు = పూర్వకాలమందు ;
నారదుండు, ఆడినమాట = నారదుఁడు చెప్పినమాట ; తథ్యంబు
అయ్యెన్ = నిజమయినది ; అతనివాక్యంబులు, అంగీకరింపక = అతనిమా
టలను, వినక ; ఏను = నేను; అసత్, తమునండను, అయి = మాయలోము
నిఁగి; స్వప్నావస్థలన్, పొందినవాఁడను = కలఁగనుచున్నవాఁడను; దైవకం
బు, అయిన మాయన్, చెంది = ఈశ్వరమాయచేత ; భిన్నదర్శనుండు అగు
చందంబునన్ = భేదబుద్ధితో చూచినవాఁడగుటచేత ; అద్వితీయుండను ,
అయినను = నాకంటె నితరుఁడులేఁడను జ్ఞానము కలిగినవాఁడనయినను ;
భ్రాతృ, అనుశత్రువుచేన్ = అన్న అనుశత్రువుచే; ప్రాప్తంబయిన = కలిగిన;
దుఃఖంబున్ = దుఃఖమును; పొంది = పొంది ; జగత్ ఆత్మకుండును = జగ
త్తునకు ఆత్మవంటివాఁడును; సు, ప్రసాదుండును = మంచివరముల నిచ్చు
వాఁడును; భవనాశకుండును = జన్మములేకుండ చేయువాఁడును; అయిన =
అయిన; ఈశ్వరున్ = శ్రీహరిని; ఆరాధించి = పూజచేసి ; తత్, ప్రసా
దంబున్, పడసియున్ = అతని యనుగ్రహమును సంపాదించియు ;
ఆయుర్విహీనుండు, అయినరోగికిన్ = ఆయువుతక్కువైన రోగికి ; ప్రయో
గించు = ఇచ్చు, ఔషధంబు పోలెన్ = మందువలె ; నిరర్థకంబు
లయి = నిష్ప్రయోజనంబులయి ; నశ్వరంబులు, అయిన = నాశనము పొం
దు; ఈకామితంబులు, కోరితిన్ = ఈకోరికలను కోరితిని. అని వెండి
యున్ = మఱియును.

తా స్పష్టము.

మ. ధనహీనుం డున్నృపాలుఁ జేరియు నుగణ్ణా ◆ దారోగ్యన్నచో లేశమి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం ◆ డైనట్టిపంకేజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్ ◆ సాంసారికం బర్థిఁగో
రిన నావంటివిమూఢమానసులు నా ◆ త్రిజగల్లి రే మెవ్వరున్

అర్థ. ధనహీనుండు = నిరుపేద. నృపాలున్, చేరి = రాజువద్దకు వెళ్లి ; అడుగన్, తారొల్కొన్న చోన్ = రాజెదురుపడియుండఁగానే ; లేశము, ఇమ్మని = కొంచెము ధనమిమ్మని ; అర్థించినరీతిన్ = కోరినట్లు ; ముక్తిఫలదుండు అయినట్టి = మోక్షమునే ఫలముగానిచ్చునట్టి . పంకేజలోచనుఁడే = పుండరీకాక్షుఁడగు విష్ణుమూర్తియే. చాలన్, ప్రసన్నుఁడు, అయినన్ = నాకు వరముల నిచ్చుటకు సుముఖుఁడయియుండఁగా. అతనిన్ = అతనిని . సాంసారికంబు = ఇహలోకసంబంధమైన కోరికను . అర్థిన్ = కోరికతో . కోరిన = కోరినట్టి . నావంటి, విమూఢ, మానసులు = నావంటి బుద్ధిహీనులు. ధాత్రిన్ = భూమియందు. ఎవ్వరున్ = ఎవరైనను. కలరే = కలరా.

తా. దరిద్రుఁడు రాజుమోల్లనిలువఁబడి ఆతఁడు నీకేమి కావలయునో కోరుకొనుమని యడుగగా నాకు కొంచెమిమ్మని యడిగినట్లు వరములలో నెల్ల నుత్తమమగు మోక్షము నిచ్చు శ్రీహరి నాకు ప్రసన్నుఁడయియుండఁగా నేను మోక్షమును కోరక తుచ్ఛమైన ఐహికవరమును కోరికొంటిని. నాకంటె బుద్ధిహీనుఁ డెవఁడైన నుండునా ?

ధ్రువుండు మరలఁ దన పురంబునకు వచ్చుట

సీ. అని యిట్లు చింతించె ♦ ననుచు నమ్మైత్రేయ
మునివిదురునకు ని ♦ ట్లనియెఁ దండ్రి
కమనీయహరిపాద ♦ కమలరజోభిసం
స్కృతశరీరులును యా ♦ దృచ్ఛికముగ
సంప్రాప్తమగుదాన ♦ సంతుష్టచిత్తులై
వఱలుచు నుండు మీ ♦ వంటివారు
దగ భగవత్పాద ♦ దాస్యంబు దక్కంగ
నితరపదార్థమే ♦ యెడలయందు

తే. మఱచియును గోర నొల్లరు ♦ మనుచరిత్ర
తవిలి యిట్లు హరిప్రసా ♦ దంబు నొంది
మరలి వచ్చుచు నున్నకు ♦ మారువార్తఁ
జారుచే విని యుత్తాన ♦ చరణుఁ డంత. 87

అర్థ. అని, యిట్లు = అని యీరీతిగా. చింతించెన్ అనుచున్ = ఆలోచించెనని. మైత్రేయుఁడు = ఆమైత్రేయమహర్షి. విదురునకున్, ఇట్లు అనియెన్ = విదురునితో నిట్లు పలికెను; తండ్రి = పూజ్యుఁడవైన విదురుఁడా. కమనీయ, హరి, పాదకమల, రజస్, అభిసంస్కృత, శరీరులును = సుందరమైన శ్రీహరి పాదపద్మములయందలి పుప్పొడిచే పవిత్రముగా చేయఁబడిన శరీరము గలవారును. యాదృచ్ఛికముగన్ = యథాలబ్ధముగా. సంప్రాప్తము, అగు, దానన్ = సంప్రాప్తమయిన దానితో. సంతుష్టచిత్తులు, అయి = సంతోషించినమనస్సుగలవారయి. వఱలుచున్. ఉందురు, మీవంటివారు = ఒప్పుచుందురు మీవంటివారు. మనుచరిత్ర = మనువంటి చరిత్రము గల విదురుఁడా. తగన్ = ఒప్పునట్లు. భగవత్ పాదదాస్యంబు, తక్కంగన్ = భగవత్ పాదసేవతప్ప. ఇతర పదార్థము = మఱియొకటి. ఏమొదలనుండున్ = ఎట్టిసమయములందును. మఱచియును = పరాకునకైనను. కోరన్, ఒల్లరు = కోరరు. తవిలి = పూనికతో. ఇట్లు = ఈరీతిగా. హరిప్రసాదంబున్, ఒంది = శ్రీహరిదయను సంపాదించి. మఱలి, వచ్చుచున్, ఉన్న, కుమారు, వార్తన్ = తిరిగివచ్చుచున్న కొడుకుసంగతిని. చారుచేన్, విని = దూతవలన విని. ఉత్తానచరణుఁడు = ఉత్తానపాదుఁడు. అంతన్ = అప్పుడు (ముందు పద్యముతో నన్వయము)

తా. అని యిట్లు ఆలోచించెనని మైత్రేయుఁడు విదురునితో, అయ్యా, తమబోంట్లు శ్రీహరిపాదపద్మరజస్సుచే పవిత్రములయిన శరీరములుగలవారలు. మీకు సమయమున లభించిన దానితో సంతోషించి ఎట్టి,

సమయములందును భగవత్పాదసేవతప్ప నితరమును గోరరు. ఈరీతిగా తపస్సుచేసి శ్రీహరిదయను సంపాదించి తిరిగివచ్చుచున్న తనకుమారుడగు ధ్రువునిసంగతి దూతవలనవిని, ఉత్తానపాదుఁడప్పుడు (ముందుపద్యముతో నన్వయము.)

వ. మనమ్మున నిట్లని తలంచె. 88

అర్థ. మనంబునన్, ఇట్లు, అని, తలంచెన్ = మనస్సులో ఈరీతిగా తలంచెను.

క. చచ్చినవారలు క్రమ్మఱ
వచ్చుటయే కాక యిట్టి వార్తలు గలవే
నిచ్చలు నమంగళుఁడ నగు
నిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్. 89

అర్థ. చచ్చినవారలు = మృతినొందినవారు. క్రమ్మఱన్ = మరల. వచ్చుటయేకాక = వచ్చుటయొక్కటయేకాక. ఇట్టివార్తలుకలవే = అతఁడువరమును పొందివచ్చుచున్నాఁడనుట వింతగాదా. నిచ్చలున్ = ఎల్లప్పుడును. అమంగళుఁడను, అగు = అశుభమునేపొందుచుండు. నాకు = నాకు. ఇచ్చట = ఇప్పుడు మఱి = ఇంకను. శుభములు, ఏల, ఘటించుచున్ = శుభములు కలుగునా ?

తా. చచ్చినవాఁడు తిరిగిబ్రతుకుటయేగాక గొప్పవరములను సంపాదించి వచ్చుచున్నవార్త యొంతైననుండునా ? దురదృష్టవంతుఁడనగు నాకుశుభములు కలుగునా ?

క. అని విశ్వసింపకుండియు
మనమున నానారదుఁడు గుమారుఁడు వేగం
బున రాఁగలఁ డనుచును బలి
కినపలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుండై. 90

అర్థ. అని = అని. విశ్వసింపకుండియు = నమ్మకయున్నను. మనమునన్ = మనస్సులో. ఆనారదుఁడు = ఆనారదమహర్షి. కుమారుఁడు = తనకొడుకైన ధ్రువుఁడు వేగంబునన్, రాగలఁడు అనుచును, పలికిన, పలుకులు = శీఘ్రముగా వచ్చునని చెప్పినమాటలు. తలంచి = స్మరించి. నమ్మి = విశ్వాసముగలవాఁడయి. కృతకృత్యుఁడు, అయి = ధన్యుఁడై. (ముందుపద్యముతో నన్వయము)

తా. అతఁడు తొలుతనమ్మకున్నను తనకుమారుఁడు శీఘ్రముగా మఱలివచ్చునని నారదుఁడు చెప్పినమాటను తలంచి విశ్వసించినవాఁడయి (ముందుపద్యముతో నన్వయము.)

క. తనసుతునిరాక సెప్పిన
ఘనునకు ధనములును మౌక్తికప్రహారములున్
మన మలర నిచ్చి తనయునిఁ
గనుఁగొనుసంతోషమాత్మఁ గడలుకొనంగన్. 91

అర్థ. తనసుతుని, రాక = తనకుమారుఁడు వచ్చుటను, చెప్పిన = చెప్పినట్టి. ఘనునకున్ = ఆ చారునకు. ధనములును = ధనమును. మౌక్తికప్రహారములున్ = ముత్యాలహారములును. మనము, అలరన్, ఇచ్చి = మనస్సుసంతోషించినట్లు ఇచ్చి. తనయునిన్ = కనుఁగొను, సంతోషము = కొడుకును చూచు సంతోషము. ఆత్మన్ = మనస్సులో. కడలు కొనంగన్ = వ్యాపించుచుండగా (ముందుపద్యముతో నన్వయము)

తా. తనకొడుకు వచ్చుచున్నాఁడని దూతకు బహుమానము లిచ్చి కొడుకును చూచెడు సంతోషము అతిశయించుచుండగా (ముందుపద్యముతో నన్వయము.)

సీ. వలను మీఱిన సైంధవంబులఁ బూన్చిన
కనకరథంబును గ్రక్కున నెక్కి

బ్రాహ్మణకులవృద్ధ • బంధుజనామాత్య
పరివృతుం డగుచు వి • స్ఫురణ మెఱసి
బ్రహ్మనిర్ఘోషతూ • ర్యస్వనశంఖకా
హళవేణురవములం • దంద చెలఁగ
శిబిక లెక్కియు విభూ • షితులై సునీతిసు
రుచు లుత్తముండు నా • రూఢి నడవ

తే. గరిమ దీపింప నతిశీఘ్ర • గమన మొప్ప
నాత్మనగరంబు వెడలనడి • యరుగుచుండి
బలసి నగరోపవనసమీ • పంబునందు
వచ్చు ధ్రువుఁ గని మేదినీ • శ్వరుఁడు నంత. 92

అర్థ. వలనుమీఱిన సైంధవంబులన్, పూన్చిన = సొగసైనగుఱ్ఱములను కట్టిన ; కనకరథంబున్ = బంగారురథమును ; ఉత్కంఠన్ = ఎక్కువప్రీతితో ; ఎక్కి = ఎక్కి ; బ్రాహ్మణ, కులవృద్ధ, బంధుజన, అమాత్య, పరివృతుండు ; అగుచున్ = బ్రాహ్మణులు, కులపెద్దలు, బంధువులు, మంత్రులు, మొదలగువారిచే అనుసరింపఁబడి ; విస్ఫురణ మెఱసి = మిక్కిలి వేడుకతో ; బ్రహ్మనిర్ఘోష, తూర్యస్వన, శంఖ, కాహళ, వేణురవములు = వేదఘోషము, తూర్యారావములును, శంఖములు, బాకాలు పిల్లనగ్రోవులు మొదలగు వానిధ్వనులును ; అందంద చెలఁగన్ = అచ్చటచ్చట మ్రోగుచుండఁగా ; శిబికలు ఎక్కియున్ = పల్లకులెక్కి ; విభూషితులు, అయి = అలంకరించుకొని ; సునీతి, సురుచులు, ఉత్తముండున్ = తన భార్యలగు సునీతి, సురుచులును కొడుకైన యుత్తముఁడును ; ఆరూఢిన్, నడవన్ = వచ్చుచుండఁగా ; గరిమదీ

పింపన్ = గొప్పతనము కనబడునట్లు ; అతిశీఘ్రముగమనము, ఒప్పన్ = మిక్కిలివేగముగా; ఆత్మనగరంబు, వెలువడి = తనపట్టణమును విడిచి ; అరుగుచుండి = పోవుచు; బలసి = గుంపుగాఁగూడి; నగర, ఉపవన, సమీపంబునందు = పట్టణమునకు అంటియున్న యుద్యానవనముదగ్గర ; వచ్చు ధ్రువున్, కని = ఎదురుగా వచ్చుచున్నధ్రువుని చూచి ; మేదినీశ్వరుడున్, అంతన్ = రాజవ్వుడు (ముందు పద్యముతో నన్వయము.)

తా మంచిగుఱ్ఱములు పూన్చిన బంగారురథము నెక్కి బ్రాహ్మణులు, కులవృద్ధులు, బంధుజనులు, మొదలగువారు తన్నుచుట్టుకొలువ, వేదఘోషణములును తూర్య, శంఖ, కాహళ వేణుధ్వనులును నొప్పుచుండ, సునీతిసురుచులును ఉత్తముఁడును పల్లకులలో వచ్చుచుండ, రాజు తనపురము వెడలి నగరము సమీపముననున్న ఉద్యానవనముదగ్గర, తనకెదురుగా వచ్చుచున్న ధ్రువునిజూచి. రాజు (ముందుపద్యముతో నన్వయము)

చ. అరదముడిగ్గి ప్రేమదొలఁ♦కాడనసంభ్రముఁడై రమామనో
హరుచరణారవిందయుగ♦ళార్చననిర్దళితాఖిలాఘు నీ
శ్వరకరుణావలోకన సు♦జాతసమగ్రమనోరథుఁ సుతుం
గరమనురక్తిడాసిపుల♦కల్ నవలోత్తఁబ్రమోదితాత్ముఁడై.

అర్థ. అరదము, డిగ్గి = రథముదిగి ; ప్రేమతొలకాడన్ = ప్రేమ హెచ్చుచుండఁగా, ససంభ్రముఁడై = తొట్రుపాటుతో ; రమామనోహరు = లక్ష్మీప్రియుఁడగు శ్రీహరియొక్క; చరణ, అరవింద, యుగళ, అర్చన, నిర్దళిత, అఖిల, అఘున్ = పాదపద్మముల జతను సేవించుటవలన సమస్త పాపములను పోగొట్టుకొనిన వానిని ; ఈశ్వర, కరుణా, అవలోకన, సుజాత, సమగ్ర, మనోరథున్ = భగవద్భక్తి చేత సంపాదింపఁబడిన సమస్తమనోరథములు కలవానిని ; సుతున్ = కొడుకును , కరము అనురక్తి, డాసి = మిక్కిలి ప్రేమతో దగ్గరకు వెళ్ళి పులకల్, నవలో

త్తన్ = ఒడలు గగుర్పాటొందగా; ప్రమోదితఆత్ముఁడై = సంతోషించిన మనస్సుకలవాఁడును (ముందుపద్యముతో నన్వయము.)

తా. రథముదిగి మిక్కిలి ప్రేమతో శ్రీహరిపాదపద్మసేవవలన సమస్తపాపములను పోఁగొట్టుకొని అతనికరుణవలన సమస్తవరములను సంపాదించినకొడుకగు ధ్రువునియొద్దకు మిక్కిలి యనురాగముతో పోయి, ఒడలుగగుర్పొడవఁగా సంతోషించినమనస్సుతో [ముందు పద్యముతో నన్వయము]

తే. బిగియఁ గౌఁగిటఁ జేర్చి నె ♦ మ్మొగము నివిరి
శిరము మూర్కొని చుబుకంబు ♦ చేతఁ బుణికి
యవ్యయానందబాష్పధా ♦ రాభిషిక్తుఁ
జేసి యాశీర్వదింప నా ♦ చిరయశుండు. 94

అర్థ. బిగియన్, కౌఁగిటన్, చేర్చి = గాఢముగా ఆలింగనము చేసికొని; నెమ్మొగము, నివిరి = మొగము తడవి ; శిరము మూర్కొని = తలనువాసనచూచి ; చుబుకంబున్, చేతన్, పుణికి = గడ్డము చేతితో తడవి; అవ్యయ, ఆనందబాష్ప, ధార, అభిషిక్తున్, చేసి = ఎడతెగని ఆనందబాష్పధారలచేత తడపి ; ఆశీర్వదింపన్ = ఆశీర్వచనము చేయగా ; ఆ, చిరయశుండు = శాశ్వతకీర్తిగల ధ్రువుఁడు ,

తా. ధ్రువునికౌఁగిటఁజేర్చి, మొగముతడవి, శిరమునాఘ్రాణించి, గడ్డమునుపుణికి, యెడతెగని యానందబాష్పములచేనాతనితడిపి, ఆశీర్వదింపగా ఆధ్రువుఁడును (ముందుపద్యముతో నన్వయము.)

క. జనకుని యాశీర్వచనము
లనయముఁ గైకొని ప్రమోది ♦ యై తత్పదముల్
తనఫాలతలముఁ సోఁకఁగ
వినతులు గావించిభక్తి ♦ విహ్వలుఁ డగుచున్. 95

అర్థ. జనకుని, ఆశీర్వచనములు = [illegible]సినవలకు ; అనయమునకైకొని = ఎక్కువగా పొంది ; పరిమోది ; అయి = [illegible]షించినవాడయి ; తత్పదముల = అతనిపాదములను ; తన, ఫాలతలము, [illegible]గన్ = తన నుదుటిని తాఁకునట్లు; వినతులు, కావించి = నమస్కారములు చేసి ; భక్తివిహ్వలుఁడు అగుచున్ = భక్తిపరవశుఁడయి

తా. ధ్రువుఁడట్లు తండ్రి ఆశీర్వచనములనుగొని సంతోషించి యతని పాదములపై తన నుదురు తాకునట్లు నమస్కరించి ఎక్కువభక్తితో (ముందుపద్యముతో నన్వయము.)

తే. అంత నానజ్జనాగ్రణి ♦ యైన ధ్రువుఁడు
తల్లులకు భక్తి వినతులు ♦ దగ నొనర్చె
సురుచి మ్రొక్కిన యర్భకుఁ ♦ జూచి యెత్తి
నగుమొగంబున నాలింగ ♦ నంబు సేసి. 96

అర్థ. అంతన్, ఆ; సజ్జనాగ్రణి, అయిన, ధ్రువుఁడు = అప్పుడు సజ్జనులలో సత్తముఁడగు ధ్రువుఁడు ; తల్లులకున్ = సవతితల్లులకు; భక్తిన్ = భక్తితో ; వినతులు = నమస్కారములు; తగన్, ఒనర్చెన్ = ఒప్పునట్లుగా చేసెను ; సురుచి = సురుచి ; మ్రొక్కిన, అర్భకున్ = నమస్కరించిన బాలునిచూచి ; ఎత్తి = లేవదీసి ; నగుమొగంబునన్ = నవ్వుమొగంబుతో ; ఆలింగనబు సేసి = కౌఁగిలించుకొని

తా. ధ్రువుఁడు తల్లులకు భక్తితో నమస్కరింపఁగా సురుచి యతనినెత్తి కౌఁగిటజేర్చుకొని నగుమోముతో (ముందుపద్యముతో నన్వయము)

సీ. కర మొప్ప నానంద ♦ గద్గదస్వరమున
జీవింపు మనుచు నా ♦ శీర్వదించె
భగవంతుఁ డెవ్వని ♦ [illegible] మైత్రి వాటించు

సత్కృపానిరతిఁ బ్ర • సన్నుఁడగుచు
నతనికిఁ దనయంత • ననుకూలమై యుండు
సర్వభూతంబులు • సమతఁ జేర్చి
మహిఁ దలపోయ ని • మ్న ప్రదేశములకు
ననయంబుఁ జేరు తో • యములపగిదిఁ

తే. గాన ఘను నమ్మహాత్ముని • గారవించె
సురుచి పూర్వంబు దలఁపక • సుజనచరిత
విష్ణుభక్తులు ధరను బ • వి(త్రు లగుట
వారి కలుగగు ధరణి నె • వ్వారు మఱియు.

అర్థ. కరము, ఒప్పన్ = ఎక్కువగా ; ఆనంద, గద్గదస్వరమునన్ = సంతోషముచే తడఁబడుచున్నధ్వనితో; జీవింపుము అనుచున్ = చిరంజీవి కమ్మని ; ఆశీర్వదించెన్ = ఆశీర్వచనము చేసెను ; భగవంతుఁడు = శ్రీహరి; ఎవ్వని పైన్ = ఎవనిమీద; సత్కృపానిరతిన్ = మంచిదయతో ; ప్రసన్నుఁడగుచున్ = సముఖుఁడయి ప్రీతిన్ పాటించున్ = స్నేహముచూపునో; అతనికి = అతనికి ; సర్వభూతంబులు = సమస్తభూతంబులును; సమతన్, పేర్చి = సమత్వముతోకూరి; మహిన్ = భూమియందు; తలపోయన్ = ఆలోచింపఁగా; నిమ్న ప్రదేశములకున్ = పల్లపుసేలకు ; అనయంబున్ = ఎల్లపుడును ; చేరు = పాఱునట్టి; తోయములపగిదిన్ = నీళ్ళవలె ; తనయంతన్ = తమకుతామే ; అనుకూలమయి యుండున్ = అనుకూలించును; కావన్ = అందుచేత; ఘనున్ = గొప్పవాఁడగు; అమ్మహాత్మునిన్ = ఆమహానుభావుఁడగు ధ్రువుని; సురుచి = సవతితల్లియైనసురుచి ; పూర్వంబున్ తలపక = పూర్వముజరిగినసమాచారము నెంచక ; గారవించెన్ = ఆదరించెను ; సుజనచరిత = సచ్చరిత్రముగల విష్ణు

రుండా; విష్ణుభక్తులు = శ్రీహరిని సేవించువారు; ధరను = భూమియందు పవిత్రులు, అగుటన్ = పరిశుద్ధులగుటచేత ; ధరణిన్ = భూమియందు ; ఏవారున్ = ఎవరును ; వారికి, అలుగరు = వారిపై కోపింపరు ; మఱియు = మఱియు.

తా. సురుచి ధ్రువుని చిరంజీవి కమ్మని ఆశీర్వదించెను, జలము ఎత్తుప్రదేశమునుండి పల్లమునకు పాఱుచు సమత్వము గోరునట్లు శ్రీహరి కరుణగలవారికి సమస్తభూతములు ననుకూలములై యుండును. కావుననే పూర్వచరిత్రమును తలంపక సురుచి యూతని నాదరించెను. విష్ణుభక్తులు పవిత్రులగుటచేత భూమియందు వారిపై నెవరికిని గోపముండదు.

వ. కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమవిహ్వాలు లగుచు నన్యోన్యాలింగితులై పులకాంకురాలంకృతశరీరులై యానందబాష్పముల నొప్పిరంత సునీతియుఁ దన ప్రాణంబులకంటె బ్రియుఁడగు సుతు నుపగూహనంబు సేసి తదవయవస్పర్శనంబుచేత నానందంబునొంది విగతశోకయయ్యె నప్పుడు సంతోషధారాసిక్తంబులై చనుఁబాలునుం గురిసె నంత.

అర్థ. కావునన్ = అందుచేత; ఉత్తముండును, ధ్రువుండును = అన్నదమ్ములగు నుత్తమధ్రువులు; ప్రేమవిహ్వాలులు, అగుచున్ = ప్రేమచేత మైమఱచినవారయి ; అన్యోన్యఆలింగితులు, అయి = ఒకరినొకరు కౌఁగిలించుకొని ; పులకాంకుర, అలంకృత, శరీరులు, అయి = గగుర్పాటుగలదేహములు గలవారయి ; ఆనందబాష్పములన్, ఒప్పిరి = సంతోషముచే కలిగిన కన్నీటితో నొప్పిరి; అంతన్ = అప్పుడు, సునీతియున్ = సునీతి ; తనప్రాణంబులకంటెన్ = తనప్రాణంబులకంటె ; ప్రియుండు,

అగు = ప్రియుఁడైన ; సుతున్ = కొడుకును ; ఉపగూహనంబు, చేసి = కౌఁగిలించుకొని ; తత్, అవయవ, స్పర్శనంబు చేత = అతనిశరీరమును తాకుటచేత ; ఆనందంబున్, పొందె; = సంతోషమును పొందెను ; విగతశోక, అయ్యెన్ = దుఃఖము పోఁగొట్టుకొనినదయ్యెను ; అప్పుడు = అప్పుడు ; సంతోష, బాష్ప, ధారా, సిక్తంబులు, అయి = సంతోషాశ్రువులతో కూడిన, చనుబాలున్ = చనుబాలుకూడ ; కురిసెన్ = కురిసెను . అంతన్ = అప్పుడు.

తా. స్పష్టము.

సీ. అప్పుడు సంతోష ♦ ముప్పతిల్లఁగఁ బౌర
జనము లాధ్రువ్రుతల్లి ♦ నెనయఁ జూచి
తొడరినభవపీయు ♦ దుఃఖనాశకుఁ డైన
యిట్టితనూజుఁ డెం ♦ దేనిఁ బెద్ద
కాలంబు క్రిందటఁ ♦ గడఁగి నష్టుం డైన
వాఁ డిప్డు నీభాగ్య ♦ వశము చేతఁ
బ్రతిలబ్ధుఁ డయ్యెను ♦ నితఁడు భూమండల
మెల్లను రక్షించు ♦ నిద్ధమహిమఁ

తే. గమలలోచనుఁ జింతించు ♦ ఘనులు లోక
దుర్జయం బైన యట్టి మృ ♦ త్యువును గెల్తు
రట్టిప్రణతార్తిహరుఁ డైన ♦ యబ్జనాభుఁ
డర్థి నీచేతఁ బూజితుం ♦ డగుట నిజము. 99

అర్థ. అప్పుడు = అప్పుడు . సంతోషము, ఉప్పతిల్లగన్ = సంతోషము ఉప్పొంగగా ; పౌరజనములు = పురజనులు, ఆ, ధ్రువు, తల్లిన్ =

ఆ సునీతిని ; ఎనయన్ చూచి = ఎక్కువగాచూచి ; తోడరిన, భవదీయ దుఃఖ, నాశకుఁడు, అయిన, నీదుఃఖమును పోగొట్టిన; ఇట్టితనూజుఁడు = ఇట్టికొడుకు ; ఎందేనిన్ = ఎప్పుడో, పెద్దకాలంబుకి)ందటన్ = చాల కాలము క్రిందట; కడగి, నష్టుండు, అయినన్ = పోయినను, వాఁడు = ఆతఁడు. ఇపుడు = ఇప్పుడు ; నీభాగ్యవశము చేతన్ = నీయదృష్టము చేత . ప్రతిలబ్ధుఁడు, అయ్యెను = తిరిగిదొరకెను . ఇతఁడు = యీధ్రువుఁడు; ఇద్ధమహిమన్ = గొప్పమహిమతో . భూమండలము, ఎల్లను, రక్షించుఁ = భూమినిరక్షించును ; కమలలోచనున్ = పుండరీకాక్షుఁడైన హరిని . చింతించు = ధ్యానించునట్టి. ఘనులు = మహానుభావులు . లోకదుర్జయంబు, అయినయట్టి = లోకముచేత గెలువరానట్టి . మృత్యువును = చావును . గెల్తురు = గెలిచెదరు. అట్టి = అటువంటి . పరిణతా, ఆర్తి, హరుఁడు, అయిన = తన్నునమస్కరించువారి దుఃఖమునుపోగొట్టు . అబ్జనాభుఁడు = శ్రీమహావిష్ణువు . అర్థిన్ = కోరికతో . నీచేతఁ = నీచేత . పూజితుండు అగుట = పూజింపఁబడినవాఁడగుట . నిజము = సత్యము.

తా. అప్పుడు పురజనులు సునీతితో అమ్మా! నీదుఃఖమును పోఁగొట్టిన యీ ధ్రువుఁడు ఎన్నడో పోయి యిపుడు నీయదృష్టవశమున నీకు దొరకినాఁడు . ఇతఁడు గొప్పమహిమతో భూమి నేలును . శ్రీహరిని ధ్యానించు వారనన్యసాధ్యమైన మృత్యువును గెల్తురు. నీవు శ్రీహరిని పూజించి యుండుటచేత నే నీకిట్టి యదృష్టము కలిగినది.

వ. అని ప్రశంసించి రట్లు పౌరజనంబులచేత నుపలాల్యమానుండును సంస్తూయమానుండును నగుచు నుత్తానపాదుండు నుత్తమసమేతంబుగా ధ్రువుని *జారూఢునిం జేసి ప్రహృష్టాంతరంగుండగుచుఁ బురాభిముఖుండై చనుదెంచి. 100

అర్థ. అని = ఈరీతిగా , ప్రశంసించిరి = పొగడిరి . అట్లు = అట్లు . పౌరజనంబు చేతన్ = పురజనులచేత . ఉపలాల్యమానుండును =

లాలింపఁబడినవాఁడును ; సంస్తూయమానుండును = పొగడఁబడువాఁడును అగుచున్ = అగుచు ; ఉత్తానపాదుండు = ఉత్తానపాదమహారాజు ; ఉత్తమసమేతంబు గాన్ = సురుచికొడుకైన ఉత్తమునితోఁగూడ; ధ్రువునిన్ = ధ్రువుని; గజారూఢునిన్, చేసి = ఏనుగుపై నెక్కించి, పరిహృష్ట, అంతరంగుండై, అగుచున్ = సంతోషముపొందినమనస్సుగలవాఁడై ; పుర, అభిముఖుండు, అయి = పురమువంక ; చనుదెంచి = వచ్చి.

తా. స్పష్టము.

సీ. స్వర్ణపరిచ్ఛద • స్వచ్ఛకుడ్యద్వార
లాలితగోపురా • ట్టాలకంబు
ఫలపుష్పమంజరీ • కలితరంభాస్తంభ
పూగపోతాదివి • భూషితంబు
ఘనసారకస్తూరి • కాగంధజలబంధు
రాసిక్తవిపణిమా • ర్గాంచితంబు
మానితనవరత్న • మయరంగవల్లివి
రాజితప్రతిగృహ • ప్రాంగణంబు
తే. శుభనదీజలకుంభసం • శోభితంబు
తండులస్వర్ణలాజాక్ష • తప్రసూన
ఫలపరివ్రాతకలితవి • భ్రాజితంబు
నగుచు సర్వతోలంకృత • మైనపురము 101

అర్థ. స్వర్ణ = బంగారముచేత; పరిచ్ఛద = కప్పఁబడిన; స్వచ్ఛ = ప్రకాశించుచున్న; కుడ్య = గోడలచేతను ; ద్వార = ద్వారములచేతను ; లాలిత = ప్రకాశించుచున్న ; గోపుర = గోపురములను ; అట్టాలకంబు =

పూలగుత్తులు ; వీనిచేత, కలిత = అలంకరింపఁబడిన ; రంభాస్తంభ = అరటిస్తంభములు కోటబురుజులును గలదియు ; ఫల = పండ్లు ; పుష్ప, మంజరీ = ; పూగపోత = చిన్నపోఁకచెట్లు ; ఆది = మొదలగువానిచేత; విభూషితంబు = అలంకరింపఁబడినదియు ; ఘనసార = పచ్చకర్పూరము ; కస్తూరికా = కస్తూరి; గంధజల = సుగంధజలములచే; బంధుర = దట్టముగా ఆసిక్త = తడపఁబడిన ; విపణిమార్గ = అంగడివీథులతో ; అంచితంబు = ఒప్పునదియు ; మానిత = సొగసైన ; నవరత్నమయ = నవరత్నములవికారమైన ; రంగవల్లీ = ముగ్గులచే ; విరాజిత = ప్రకాశించుచున్న ; ప్రతిగృహ = ఇంటింటనుగల; ప్రాంగణంబు = వాకిళ్లుగలదియు ; శుభ = శోభనయుక్తమైన; నదీజల = నదీజలములు కలిగిన ; కుంభ = కుండలచే, సంశోభితంబు = శోభించుచున్నదియు ; తండుల = బియ్యము ; స్వర్ణ = బంగారము, వీంతోచేయఁబడిన; లాజా = పేలాలు ; అక్షత = అక్షతలు ; ప్రసూన = పువ్వులు ; ఫల = పండ్లు, వీనియొక్క ; పరిభ్రాత = సమూహముచే; కలిత = అలంకరింపఁబడి ; విభ్రాజితంబును = ప్రకాశించుచున్నదియు; అగు మన్ = అగు; సర్వతః ; అలంకృతము, అయిన = అన్నియెడలను అలంకరింపబడిన; పురము = పట్టణమును,

తా. బంగారుఱేకులచే కప్పఁబడిన గోడలు ద్వారములతో నొప్పు గోపురములను కోటబురుజులును గలదియు, పండ్లు పూవులచే అలంకరింపఁబడిన అరటిచెట్లు, పోకచెట్లును గలదియు, పచ్చకర్పూరము, కస్తూరి, గంధము కలిపిన జలముచేత తడపఁబడిన అంగడివీథులు గలదియు నవరత్నములచే నేర్పరుపఁబడిన ముగ్గులుగలదియు, నదీజలములతో నింపఁబడిన కుండలుగలదియు, బియ్యము బంగారము, పేలాలు, అక్షతలు, పూవులు, పండ్లు మొదలగువానితో నొప్పునదియునై, యెల్లయెడలను నలంకరింపఁబడిన పురమును

వ ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచునపుడు. 102

అర్థ. పరిశేశించి = పరివేశించి; రాజమార్గంబునన్ = రాజవీథిని; చనుదెంచునపుడు = వచ్చునపుడు;

మ. హరిమధ్యల్ పురకామినీజనులు సౌధాగ్రంబులందుండి భాస్వరసిద్ధార్థఫలాక్షతప్రసవదూర్వావ్రాతదధ్యంబువుల్ గరవల్లీమణిహేమకంకణఝణత్కారంబుశోభిల్లఁజల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్

అర్థ. హరిమధ్యల్ = సింహమువంటి నడుములుగల; పురకామినీజనులు = పురములోని స్త్రీలు. సౌధాగ్రంబులందుండి = మేడలపైనుండి భాస్వర = ప్రకాశించుచున్న. సిద్ధార్థ = తెల్లయావాలు; ఫల = పండ్లు. అక్షత = అక్షతలు. ప్రసవ = పూవులు. దూర్వావ్రాత = లేతపచ్చికలు. దధి = పెరుగు. అంబువుల్ = నీళ్లు. మొదలగువానిని. కరవల్లీ = తీఁగలవంటి చేతులయందలి. మణి, హేమ, కంకణ = మణులచేతను, బంగారుచేతను చేయఁబడిన కంకణములయొక్క. ఝణత్కారంబు = ధ్వని శోభిల్లన్ = ఒప్పుచుండఁగా; ఆ, భాగవత, ఉత్తమోత్తమునిపైన్ = ఆ భాగవతశ్రేష్ఠులలో శ్రేష్ఠునిమీఁద; లీలాప్రమేయంబుగన్ = మిక్కిలి విలాసముతో. చల్లిరి

తా. పురస్త్రీలు మేడలపైనుండి తమకంకణములు మ్రోగుచుండ నాభాగవతశ్రేష్ఠుఁడగు ధ్రువునిమీఁద సువర్ణాక్షతాదులను జల్లిరి.

వ. ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణపాత్రరచితమణిదీపనీరాజనంబులు నివాళింప బౌరజానపదమిత్రామాత్య బంధుజనపరివృతుండై చనుదెంచి. 104

అర్థ. ఇట్లు = ఈరీతిగా వాత్సల్యంబునన్ = ప్రేమతో. చల్లుచున్ = చల్లుచు. సత్యవాక్యంబులన్ = అప్రతిహతములైన మాటలచే

దీవించుచున్ = ఆశీర్వదించుచు. సువర్ణపాత్ర, రచిత, మణిదీప, నీరా జనంబులన్, నివాళింపన్ = బంగారుపాత్రలో యుంచిన మణిదీపము లతో హారతియెత్తఁగా. పౌర, జానపద, మిత్ర, అమాత్య, బంధు జన, పరివృతుండు. ఐ = పురజనులు, పల్లెలవారు, స్నేహితులు, మంత్రులు, బంధువులు, మొదలగువారిచే పరివేష్టింపఁబడి. చనుదెం చి = వచ్చి.

తా. ఈరీతిగా వారు ధ్రువుని దీవించుచు. బంగారు పాత్రలం దుంచిన మణిదీపములచే హారతి యిచ్చుచుండఁగా సమస్త పరివారము తోడను వచ్చి-

సీ. కాంచనమయమరక ♦ తకుడ్యమణిపరి
చ్ఛదవిరాజిస్వచ్ఛ ♦ సౌధములను
వరసుధాఫేనపాం ♦ డుర వరికరో
దాత్తసమంచిత ♦ తల్పములను
సురతరుశోభిత ♦ శుకపికమిథునాళి
గానవిభాసితో ♦ ద్యానములను
సుమహితవైడూర్య ♦ సోపానవిమలశో
భితజరపూర్ణవా ♦ పీచయముల
తే. వికచకల్హారదరదర ♦ విందకైర
వప్రదీపితబకచక్ర ♦ వాకరాజ
హంససారసకారండ ♦ వాదిజలవి
హంగనినదాభిరామప ♦ ద్మాకరముల. 105

అర్థ. కాంచనము = బంగారముతోఁగూడిన. మరకతకుడ్య = మరకతరత్నములచే చేయఁబడినగోడలును మణి, పరిచ్ఛద = మణులచే

కప్పఁబడి. విరాజిత = ప్రకాశించుచున్న. స్వచ్ఛ సౌధములను = నిర్మలములయిన మేడలును. వర = శ్రేష్ఠమైన సుధాఫేన = సున్నపునురుగువలె. పాండుర = తెల్లనై. రుక్మపరికర = బంగారుమంచముమీఁది. ఉదాత్త, సముంచిత = ఎక్కువబాగుగా అమర్చఁబడిన; తల్పములను = పఱుపులను; సురతరు = కల్పవృక్షముల చేత; శోభిత = ప్రకాశింపచేయఁబడిన శుక, పిక, మిథున, ఆళి = చిలుకలు, కోకిలలు, వీనిదంపతులవరుసల; గాన = సంగీతములచే; విభాసిత = ఒప్పుచున్న; ఉద్యాన = ఉద్యానవనములు; సుమహిత = గొప్పవైన; వైడూర్యసోపాన = వైడూర్యమణులచేచేయఁబడిన మెట్లుకలిగి; విమల = స్వచ్ఛమై; శోభిత = ప్రకాశించుచున్న; జల = జలముచేత; పూర్ణ = నిండియున్న; వాపీ చయములన్ = సరస్సులచేతను; వికచ = వికసించిన; కల్హార = సౌగంధికపుష్పమును; కైరవ = కలువలు; వీనిచే; ప్రదీపిత = ప్రకాశింప చేయఁబడిన; బక = కొంగలు; చక్రవాక = చక్రవాకపక్షులు; రాజహంస = రాజహంసలు; సారస = బెగ్గురుపక్షులు; కారండవ = నీటికాకులు; ఆది = మొదలైన; జలవిహంగ = నీటిపక్షుల; నినద = ధ్వనులచే; అభిరామ = మనోహరములైన; పద్మాకరములన్ = తామరచెఱువుల చేతను.

తా. బంగారము, మరకతములు, సీసముచే నిర్మింపఁబడినగోడలును మణులచేకప్పఁబడిన మేడలును, బంగారుమంచముపై అమర్చఁబడిన తెల్లనిపఱుపులును, కల్పవృక్షములపైపాడుచున్న చిలుకలను కోవిలలును ఉద్యానవనములును, వైడూర్యములచేనిర్మింపఁబడిన మెట్లుకలిగి, గలస్వచ్ఛమైననీటితోనిండియున్న చెఱువులును పద్మములు, కలువలు మొదలగు పుష్పములచేతను, చక్రవాకములు, రాజహంసలు మొదలగు నీటిపక్షులధ్వనులచే మనోహరములైన తామరచెఱువులును.

వ. మఱియును. 106

అర్థ మఱియును = ఇంకను;

తే. చారుబహువిధవస్తువిస్తార మొప్ప
నంగనాయుక్త మగుచుఁ బెంపగ్గలించి
యర్థిఁ దనరారు జనకు గృహంబు సొచ్చె
నెలమిఁ ద్రిదివంబు సొచ్చు దేవేంద్రుపగిది 107

అర్థ. చారు=సుందరమైన; బహువిధ=అనేకవిధములైన వస్తువిస్తారము=వస్తుసమృద్ధి; ఒప్పన్=ఒప్పగా; అంగనాయుక్తము అగుచున్=స్త్రీలతోఁ గూడియుండి; పెంపు; అగ్గలించి=మిక్కిలి గొప్పగా; అర్థిన్, తనరారు=ఎక్కువగా ప్రకాశించుచున్న; జనకుగృహంబున్=తండ్రిగృహమును; త్రిదివంబున్, చొచ్చు=స్వర్గమును ప్రవేశించు; దేవేంద్రుపగదిన్=దేవేంద్రునివలె; ఎలమిన్=సంతోషముతో; చొచ్చెన్=ప్రవేశించెను.

తా. ఈరీతిగా వివిధవస్తుసమృద్ధికలిగి స్త్రీజనములతోఁ గూడియున్న తండ్రిగృహమును ధ్రువుఁడు స్వర్గమును దేవేంద్రుఁడు ప్రవేశించువిధమున సంతోషముతోఁ బ్రవేశించెను

వ. ఇట్లు ప్రవేశించిన రాజర్షియైన యుత్తానపాదుండు సుతుని
యాశ్చర్యకరం బైన ప్రభావంబు వినియుం జూచియు
మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును బ్రజా
సమ్మతుండును నవయౌవనపరిపూర్ణుండును నైన ధ్రువుని
రాజ్యాభిషిక్తుం జేసి వృద్ధవయస్కుండైన తన్నుఁ దాన
యెఱింగి యాత్మగతిఁ బొంద నిశ్చయించి విరక్తుండై వనం
బునకుం జనియె నంత నాధ్రువుండు శింశుమారప్రజా
పతి కూఁతు రైన భ్రమియనుదాని వివాహంబై దాని
వలనఁ గల్పవత్సరు లను బిడ్డలు గొడుకులం బడసి వెండి

యు వాయుపుత్త్రి యైన యిల యను భార్యయందు నుత్కల
నామకుం డైన కొడుకు నతిమనోహర యైన కన్యారత్నం
బును గనియె నంతఁ దద్భ్రాత యైనయుత్తముండు
వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబున కరిగి
హిమవంతంబున యక్షునిచేత హతుం డయ్యె నతనితల్లి
యుఁ దద్దుఃఖంబున వనంబున కేఁగునెడ గహనదహను
చేత మృతిం బొందె ధ్రువుండు భ్రాతృమరణంబు విని
శోకవ్యాకులితచిత్తుండై జైత్త్రంబగు రథం బెక్కి యుత్త
రాభిముఖుండై చని హిమవద్ద్రోణియందు భూతగణసేవి
తంబును గుహ్యకసంకులంబును నైన యలకాపురంబు
వొడగని యమ్మహాబాహుండు, 108

అర్థ. ఇట్లు = ఈరీతిగా; పరివేశించిన = వచ్చిన; రాజర్షి అయిన = రాజర్షి అయిన. ఉత్తానపాదుఁడు = ఉత్తానపాదుఁడు; సుతుని = కొడుకుయొక్క; ఆశ్చర్య, కరంబు, అయిన, పరిభావంబు = అద్భుతమైన మహాత్మ్యమును. వినియున్ = వినియు. చూచియున్ = చూచియు. మనంబునన్ = మనస్సులో. విస్మయంబున్, ఒంది = ఆశ్చర్యపడి. ప్రజా, అనురక్తుండును = ప్రజలపై అనురాగముగలవాఁడును; ప్రజాసమ్మతుండును = ప్రజలచే అంగీకరింపఁబడినవాఁడును; నవ. యౌవన, పరిపూర్ణుండును = నిండుక్రొత్తయౌవనముగలవాఁడును. అయిన, ధ్రువుని రాజ్యాభిషిక్తున్, చేసి = రాజ్యమునకభిషేకముజేసి. వృద్ధవయస్కుండు అయిన, తన్నున్ ముసలివాఁడైన తన్ను; తానయెఱింగి = తానే తెలిసికొని; ఆత్మగతిన్, పొందన్, నిశ్చయించి = పరమాత్మనుజేరగోరి; విరక్తుండు అయి = సంసారముపయి విరక్తికలవాఁడయి; వనంబునకున్, చని

యెన్ = వనమునకుపోయెను . అంతన్ = అప్పుడు . ఆధ్రువుండు. శింశుమారప్రజాపతికూఁతురు = శింశుమారుఁడను రాజుయొక్క కూఁతురైన. భ్రమి. అను దానన్ = భ్రమివలన . కల్ప, వత్సరులు = కల్పుఁడు వత్సరుఁడు అను . కొడుకులంబడసి = ఇద్దరుకుమారులనుకని . వెండియున్ = మరల . వాయు ; పుత్రి, అయిన = వాయువుకూఁతురగు, ఇల, అనుభార్యయందు, ఉత్కలనామకుండైన = ఉత్కలుఁడను పేరుగల కొడుకును . అతిమనోహర, అయిన, కన్యారత్నంబునున్ = మిక్కిలిచక్కనికూఁతురును, కనియెన్ = కాంచెను. అంతన్ = పిమ్మట, తత్, భ్రాత, అయిన = అతనిసోదరుఁడైన . ఉత్తముండు = ఉత్తముఁడు వివాహంబు చేయకుండి = వివాహము చేసికొనకుండ ; మృగయార్థంబు = వేటకొఱకు ; వనంబునకు, దిరిగి = అడవికిపోయి . హిమవంతంబునన్ = హిమవత్పర్వతముపయి . యక్షుని చేతన్ = ఒకయక్షునిచేత . హతుండు, అయ్యెన్ = మృతినొందెను . అతనితల్లియున్ = అతనితల్లియైనసురుచి. తత్, దుఃఖంబునన్ = ఆదుఃఖముచేత . వనంబునకున్, ఏగునెడన్ = వనమునకు పోవునపుడు . గహనదహనునేతన్ = కారుచిచ్చుచే . మృతిన్ పొందెన్ = మృతిపొందెను ధ్రువుండు , భ్రాతృమరణంబు, విని = సోదరుని చావు విని. శోక వ్యాకులిత, చిత్తుండు అయి = దుఃఖించిన మనస్సుగలవాఁడయి, జైత్రంబు అగు = జయశీలమైన. రథంబు, ఎక్కి = రథము నెక్కి . ఉత్తర అభిముఖుండయి = ఉత్తరదిక్కుగా . చని = పోయి , హిమవత్ద్రోణియందున్ = హిమాలయపర్వతమున . భూతగణసేవితంబును = భూతములచే సేవింపఁబడునదియు . గుహ్యకసంకులంబును = గుహ్యకులను వారితో నిండినదియు అగు = అయిన. అలంకారపురంబునన్ = అలకాపట్టణమును, పొడగని = చూచి . ఆ మహాబాహుండు = శూరుఁడగు నా ధ్రువుఁడు ;

తా. స్పష్టము.

—:ధ్రువుండు కుబేరానుచరులైన గుహ్యకులతో యుద్ధము సేయుట:—

మ. ఘనశౌర్యోన్నతితోడ సర్వకకుబా♦కాశంబులందుం బ్రతి
ధ్వను లోలిం నిగుడంగ శంఖము మహా♦వ్యల్లిలం బూరిం
పఁద, న్నినదంబుఁ విని యక్షకాంతలు భయా♦న్వితాత్మ
లై రుగ్రసా, ధనులై యక్షభటుల్ పురిం వెడలిరు♦త్సా
హంబు సంధిల్లఁగం. 109

అర్థ. ఘన, శౌర్య, ఉన్నతితోడన్ = గొప్పశౌర్యముతో; సర్వకకుప్; ఆకాశంబులందున్ = సర్వదిగంతములందును; ప్రతిధ్వనులు = మాఱుమ్రోఁత; ఓలిన్ = వరుసగా; నిగుడంగన్ = వ్యాపింపగా; శంఖము = శంఖమును; మహోద్వల్లిలన్ = మిక్కిలివిలాసముతో; పూరింపన్ = ధ్వనింపఁజేయఁగా; తత్, నినదంబున్ = ఆధ్వనిని విని; యక్షకాంతలు = యక్షస్త్రీలు; భయాన్విత, ఆత్మలు, అయిరి = భయముతోఁగూడినమనస్సుగలవారైరి. ఉగ్రసాధనులు అయి = భయంకర, ఆయుధములను పట్టుకొని; యక్షభటుల్ = యక్షయోధులు; ఉత్సాహంబు సంధిల్లగన్ = యుద్ధమునందలి యుత్సాహముతో, పురిన్, వెడలిరి = పట్టణమునుండి బయలుదేరిరి.

తా. ధ్రువుఁడు అట్లుబయలుదేరి శంఖనినదంబు చేయఁగా నచ్చటియక్షస్త్రీలు భయమునొందిరి. యక్షయోధులు ఆయుధములను పట్టుకొని యుద్ధమునకై పట్టణమునుండి బయలుదేరిరి.

వ. ఇట్లు వెడలి యాధ్రువునిం దాఁకిన. 100

అర్థ. ఇట్లు = ఈరీతిగా; వెడలి = బయలుదేరి; ఆ, ధ్రువుని తాఁకినన్ = అధ్రువుని ఎదిరింపగా;

చ. కరము మహారథుండు భుజ♦గర్వపరాక్రమశాలియున్ ధను
ర్ధరుఁడునునైన యాధ్రువుఁడు♦తన్ను నెదిర్చిన యక్షకోటిఁ జె

చ్చెరఁ బదుమూఁడువేల నొక • చీరికిఁ గైకొన కొక్క పెట్టభీ
కరముగమూఁడుమూఁడుశిత • కాండములందగఁ గ్రువ్వ నేసినన్

అర్థ. కరము = ఎక్కువగా ; మహారథుఁడు = మహారథుఁడును ; భుజగర్వ, పరాక్రమశాలియున్ = గర్వముతోఁ గూడిన పరాక్రమముగల వాఁడును, ధనుర్ధరుడును = ధనస్సును పట్టుకొనినవాఁడును ; అయిన = ఆ ధ్రువుఁడు ; తన్నున్, ఎదిర్చిన = తన్నెదిరించిన ; యక్షకోటికిన్ = యక్షులను ; చెచ్చెరన్ = శీఘ్రముగా ; పదమూఁడు వేలన్ = 13000 మందిని ; ఒకచీరికిన్, గైకొన = ఎంతమాత్రమును లక్ష్యపెట్టక ; ఒక్క పెట్టన్ = ఒక్కమాఱుగా, భీకరముగన్ = భయంకరముగా ; మూఁడుమూఁడు = మూఁడేసి ; శిత బాణములన్ = వాఁడి బాణములను ; తగన్ = బాగుగా ; క్రువ్వన్, ఏసినన్ = గ్రుచ్చుకొనునట్లు ప్రయోగింపగా.

తా. పరాక్రమశాలియైన ధ్రువుండు ధనస్సును ధరించి, తన్నెదిరింపవచ్చిన 13000 వేల యక్షులను లక్ష్యపెట్టక, యొక్కొక్కనిపై మూఁడేసి వాఁడిబాణములను ప్రయోగింపగా,

ఉ. వారు లలాటముల్ వగిలి • వారక సోలియుఁ దేఁటియమ్మహో
దారుపరాక్రమప్రకట • ధైర్యముఁ దత్కరలాఘవంబు బ
ల్మాఱు నుతించుచుం గుపిత • మానసులై పదతాడితప్రదు
ష్టోరగకోటిపోలెఁ జటు • లోగ్రభయంకరరోషమూర్తులై.

అర్థ. వారు = ఆయక్షులు ; లలాటంబులుపగిలి = నొసళ్ళువగిలి ; వారక, సోలియున్ = వరుసగాఁ పడియును; తేఁటి = తెప్పిఱిలి; ఆ, మహా; దారు = ఆఉదారవంతుని; పరాక్రమ = శౌర్యమును; ప్రకటన = ప్రసిద్ధమైన ; ధైర్యమును = ధైర్యమును; తత్ కర, లాఘవంబున్ = అతని చేతి నేర్పును: పల్మారు, నుతించుచున్ = ఎక్కువగాకొనియాడుచు ; కుపితమానస్సులై = కోపించినమనస్సుగలవారై; పద, తాడిత, ప్రదుష్ట, ఉరగకోటి,

పోలెన్ = కాలిచేఁ దొ్రొక్కఁబడిన దుష్టసర్పములవలె ; చటుల, ఉగ్ర, భయంకర, రోష, మూర్తులు, అయి = మిక్కిలి భయంకరమగు కోపముతోఁ గూడినవారై.

తా. ఆయక్షులు నొసల్లుపగిలి, సొమ్మసిల్లి, మరల తెప్పిఱిలి, ధ్రువుని ధైర్యసాహసములు కొనియాడుచు, పాదతాడనము పొందినదుష్ట సర్పములవలె భయంకరకోపముతో.

ఉ. ఆరథికోత్తముం దొడరి ♦ యందఱునొక్కటఁ జుట్టుముట్టియా
ఆఱుశిలీముఖంబులను ♦ నంగములం బగిలించి వెండి వి
స్ఫారగదా శర క్షురిక ♦ పట్టిస తోమర శూల ఖడ్గముల్
సారథియుక్తుఁడైనరథి ♦ సత్తముపైఁ గురియించి రేపునన్

అర్థ. ఆ రథికోత్తమున్, తొడరి = ఆమహారథుని దాఁకి; అందఱున్ = యక్షులందఱును ; ఒక్కటన్ = ఒక్కసారిగా ; చుట్టిముట్టి = చుట్టుకొని; ఆఱు, ఆఱు, శిలీముఖంబులను = ఆరేసిబాణములచే; అంగములన్, పగిలించి = అవయవములను భేదించి. వెండి = మఱియు; విస్ఫార = ప్రకాశించుచున్న ; గదా, శర, క్షురిక, పట్టిస, తోమర, శూల, ఖడ్గముల్ = గదలు, బాణములు, కత్తులు, అడ్డకత్తులు, చిల్లకోలలు, శూలములు, ఖడ్గములు వీనిని; సారథియుక్తుఁడైన = సారథితోఁ గూడిన; రథిసత్తముపయిన్ = మహారథుఁడైన ధ్రువుని; ఏపునన్ = గర్వముతో ; కురియించిరి = వర్షింపజేసిరి.

తా. ఆయక్షులు ధ్రువుని దాఁక, జుట్టిముట్టి, ఆరేసి బాణములచే నతని అవయవములను భేదించి, సారథితోఁ గూడిన ఆమహారథుపై గదలు మొదలగు నాయుధములను వర్షించిరి.

వ. అట్లు గురియించిన నతఁడు.                114

అర్థ. అట్లు కురియించినన్, అతండు = అట్లువర్షింపగా ఆధ్రువుఁడు

క. వెంపటి యుండెను ధారా
సంపాతచ్ఛన్నమైన • శైలముభంగిన్
గుంపులు గొని యాకసమునఁ
గంపించుచు నపుడు సిద్ధ • గణములు వరుసన్. 115

అర్థ. ధారా, సంపాత, ఛన్నము, అయిన, భంగిన్ = వర్షధారలచేత కప్పఁబడిన పర్వతమువలె; పెంపు, అటి, ఉండెను. శోభతతిగియుండెను ; అపుడు ; సిద్ధగణముల = సిద్ధులసమూహముల ; వరుసన్ = వరుసగా ; ఆకసమునందు ; గుంపులు కొని = గుంపులుగాకూడి ; కంపించుచున్ = వడకుచు (ముందుపద్యముతో నన్వయము.)

తా, వర్షధారలచే కప్పఁబడిన పర్వతమువోలె ధ్రువుండు శోభతతిగియుండెను అపుడు సిద్ధులాకాశమునందు గుంపులుగాఁగూడి, వడఁకుచున్నవారై [ముందుపద్యముతో నన్వయము.]

క. హాహాకారము లెసఁగఁగ

నోహో యీరీతి ధ్రువప • యోరుహహితుఁడు
త్సాహము సెడి యిటు దైత్యస
మూహార్ణవమందు నేఁడు • మునిఁగెనె యకటా. 116

అర్థ. హాహాకారములు ఎసఁగఁగన్ = హాహాఅనుధ్వనులు పుట్టుచుండఁగా; ఓహో = అయ్యో; ఈరీతిన్ = ఈవిధముగా; ధ్రువ, పయోరుహహితుఁడు = ధ్రువుఁడనుసూర్యుఁడు ; ఉత్సాహము చెడి = ఉత్సాహము, పోయి ; ఇటు = ఈవిధముగా ; దైత్య, సమూహ, అర్ణవమునందు = రాక్షసుల సమూహమను సముద్రమందు; నేఁడు; అకటా = అయ్యో ; మునిగెనె = మునింకినాఁడా!

తా. హాహాయనుధ్వని చేయుచు అహో! నేఁడు ధ్రువుఁడను

సూర్యుఁడు రాక్షసులను మహాసముద్రములో ముణిఁగినాఁడా !

వ. అని చింతించునవసరంబున. 117

అర్థ. అని, చింతించు, అవసరంబునన్ = అనివిచారించుచున్నసమయమందు,

క. తా మాతని గెలిచితి మని
యామనుజాశనులు వలుక ♦ నట నీహార
స్తోమము సమయించుమహో
ద్దాముం డగు సూర్యుఁ బోలి ♦ తద్దయుఁ దోఁచెన్. 118

అర్థ. తాము = తాము; అతనిన్ = ఆధ్రువుని; గెల్చితిమి,అని = జయించితిమని ; ఆ, మనుజాశనులు = ఆయక్షులు ; పలుకన్ = పలుకఁగా; అట = అప్పుడు. నీహారస్తోమున్ = దట్టమైనమంచును. సమయించు = విరియఁజేయు. మహత్, ఉద్దాముండు, అగు = మిక్కిలికాంతిగలవాఁడగు. సూర్యున్, పోలి = సూర్యునివలె. తద్దయున్ = మిక్కిలిగా. తోచెన్ = తోఁచెను.

తా. ఆయక్షులు ధ్రువుని జయించితిమని యుప్పొంగుచుండగా మంచును విరియించి కాంతిమంతుఁడై వెలుఁగు సూర్యునివలె ధ్రువుఁడు మరలగోచరించెను.

వ. అట్లు దోఁచి. 119

అర్థ. అట్లు తోఁచి = అట్లుగోచరించి.

మ. అరిదుఃఖావహమైనకార్ముకము శౌ♦ర్యస్ఫూర్తితోఁదాల్చి భీ
కరబాణావళిఁ బింజబింజగ ఱవం♦గా నేసి ఝంఝానిలుం
డురుమేఘావళిఁ బాఱఁదోలుగతి న♦త్యుగ్రాహితకూరబం
ధురశస్త్రావళి మాపుచూ వెవిలస♦ద్దోర్లీలసంధిల్లఁగన్. 120

అర్థ. అరి, దుఃఖావహము, అయిన, కార్ముకము = శత్రువులకు దుః ఖముఁగలుగఁజేయు వింటిని. శౌర్యస్ఫూర్తితోన్ = ఎక్కువశౌర్యముతో తాల్చి = పట్టుకొని. భీకర, బాణావళిన్ = భయంకరమైన బాణముల వరుసను. పింజపింజ, కఱవంగాన్. ఏసి = ఒకదానివెంటనొకటి వదల కుండునట్లు ప్రయోగించి, ఝంఝూమారుతము = ఝంఝూమారుతము. ఉరు మేఘావళిన్ = దట్టమైన మేఘములను. పాఱఁదోలుగతిన్ = తఱుమఁగొట్టు నట్లుగా. అతి, ఉగ్ర, అహిత, క్రూర, బంధుర శస్త్రావళిన్ = మిక్కిలి ఘోరమును, హింసించునదియు, క్రూరమయినదియు, దట్టమయినదియు నగు ఖడ్గములవరుసను. విలసత్ = ప్రకాశించుచున్న దోః లీల = భుజ విలాసము. సంధిల్లఁగన్ = ఒప్పుచుండఁగా. రూపుమాపెన్ = సంహ రించెను.

తా. ధ్రువుఁడు మిక్కిలి శౌర్యముతో వింటినెత్తి, బాణముల నెడతెగకుండ ప్రయోగించి, ఝంఝూమారుతము మేఘములను పాఱఁదో లునట్లు వారి శస్త్రములనన్నిటిని సంహరించెను.

చ. మఱియును నమ్మహాత్ముఁ డసమానబలుండు మహోగ్రబా
ణములఁ, గఱిగఱిఁ దాఁక నేసి భుజగర్వ మెలర్ప విరోధి
వర్మముల్, పఱిపఱి సేసి యంగములు భంగము నొందఁ
గఁ జేసె వ్రేల్మిడిన్, గిఱికొని పర్వతంబులు నొగిం దెగఁ
గొట్టెడు నిందుక్రైవడిన్. 121

అర్థ. మఱియును, అసమానబలుండు = సాటిలేని బలముగలవాఁ డైన. ఆమహాత్ముఁడు = ఆమహానుభావుఁడైన ధ్రువుఁడు, మహోగ్రబాణ ముల్ = భయంకరమైన బాణములను. గఱిగఱిదాఁకన్ = ఒకదానికొకటి తాఁకిపోవునట్లుగా. ఏసి = ప్రయోగించి. భుజగర్వము ఎలర్పన్ = తన భుజములగర్వము ఎక్కువయగుచుండఁగా. విరోధివర్మముల్ = శత్రువుల

కవచములు. పతిపతి చేసి = ముక్కముక్కలుగా చేసి. అంగములు = వారి శరీరావయవములు. వ్రేల్మిడికెన్ = ఒక్కక్షణములో. గిరికొని = పూనికతో. పర్వతములన్ = కొండలను. ఒగిన్ = వరుసగా. తెగఁగొట్టెడు = ఖండించు, ఇంద్రుకైవడిన్ = ఇంద్రునివలె. భంగమున్, ఒందఁగన్, చేసెన్ = కొట్టెను.

తా. ఇంకను అసమానబలుఁడైన ధర్మపుత్రుఁడు, ఉగ్రబాణముల వరుసను ప్రయోగించి, శత్రుకవచములను తెగఁగొట్టి, ఇంద్రుఁడు పర్వతములను కొట్టునట్లుగా వారిని కొట్టెను.

వ. ఆయ్యవసరంబున. 122

అర్థ. ఆ, అవసరంబునన్ = ఆసమయమునందు.

చ. అలఘుచరిత్రుఁ డమ్మనుకు ♦ లాగ్రణిచే వికలాంగులైనవా
రలసకిరీటకుండలవి ♦ రాజితమస్తకకోటిచే సము
జ్జ్వలమణికంకణాంగదల ♦ సద్భుజవర్గము చేత సంగర
స్థల మతిరమ్యమై తనరె ♦ సంచిత వీరమనోహరాకృతిన్.

అర్థ. అలఘు, చరిత్రుఁడు = గొప్పచరిత్రముగల అమ్మనుకులాగ్రణిచేన్ = మనువుయొక్కకులమందు శ్రేష్ఠుఁడైన ఆధర్మపుని చేత. వికలాంగులు, అయిన వారల = అవయవములు తెగిపడినవారియొక్క. స, కిరీట, కుండల, విరాజిత, మస్తక, కోటిచేన్ = కిరీటములు, కుండలములు వీనిచే ప్రకాశించుచున్న శిరస్సులసమూహముచేతను. సం, ఉజ్జ్వల, మణి, కంకణ అంగద, లసత్, భుజవర్గము చేతన్ = మణికంకణములు, భుజకీర్తులు, వీనిచే ప్రకాశించుభుజములచేతను. సంగరస్థలము = యుద్ధభూమి. అతిరమ్యము = మిక్కిలి మనోహరము. సంచిత, వీర, మనోహర, ఆకృతిన్ = కలసియున్న వీరులయొక్క చక్కనిరూపములతో తనరెన్ = ఒప్పెను.

తా. ధ్రువునిచే వికలాంగులయిన వారి కిరీటకుండలములతోఁ గూడిన తలలచేతను కంకణభుజకీర్తులతోఁ గూడిన భుజములచేతను . యుద్ధభూమి మిక్కిలి మనోహరముగా నుండెను.

వ. అంత హతశేషులు. 124

అర్థ. అంతన్, హతశేషులు = అప్పుడు మృతిఁబొందఁగా మిగిలినవారు.

క. వరబలుఁ డగు మనుమనుమని
శరసంఛిన్నాంగు లగుచు • సమరవిముఖులై
హరిరాజముఁ గని పఱచిన
కరిబృందముఁబోలెఁ జనిరి • కళవళపడుచున్. 125

అర్థ. వరబలుఁడు, అగు = గొప్పబలముకలిగిన . మనుమనుమని = మనువుయొక్క మనుమఁడైన ధ్రువుని. శర = బాణములచే సంఛిన్న = ఛేదింపఁబడిన . అంగులు, అగుచున్ = అవయవములుకలవారయి . సమర, విముఖులు, అయి = యుద్ధమునుండి మరలిపోయి. హరిరాజమున్, కని = సింహమును చూచి. పఱచిన = పరుగెత్తు • కరిబృందముపోలెన్ = ఏనుఁగుల సమూహమువలె . కళవళపడుచున్ = తొట్రుపాటుతో . చనిరి = పాఱిపోయిరి.

తా. ధ్రువునిబాణములచేత ఛేదింపఁబడిన యవయవములుగలవారై యాయక్షులు సింహమునుచూచిన ఏనుగులవలె తడఁబడుచు యుద్ధభూమినుండి పారిపోయిరి.

క. అప్పుడు రాక్షసమూయలు
గప్పిన ధ్రువుఁ డసురవరుల • కార్యం బెఱుఁగం
జొప్పడక వారిఁ బొడగని
దెప్పర మగుటయును సార • థిం గని యంతన్. 126

అర్థ. అప్పుడు ; రాక్షసమాయలు = రాక్షసులమాయలు ; కప్పి నన్ = వ్యాపింపఁగా ; ధ్రువుఁడు ; అసురవశల, కార్యంబు, ఎఱుఁగన్, చొప్పడక = రాక్షసులు చేయు కృత్యములను తెలిసికొనఁజాలక ; వారిన్, పొడఁగని = వారిని చూచి ; దెప్పరము, అగుటయున్ = ఏమియుసు తోఁచక ; సారథిన్, కని = సారథిని చూచి ; అంతన్ = అప్పుడు.

తా. అప్పుడు రాక్షసులు తమ మాయలను ప్రయోగింపఁగా ధ్రువుఁడు వారి కృత్యములను తెలిసికోలేక వారిని చూచి సారథితో నిట్లనెను.

క. తలపోయఁగ భువి మాయా
వులకృత్యా బెఱుఁగ నెవ్వ రొప్పుదు రనుచుం
బలుకుచుఁ దత్పురిఁ జొరఁగాఁ
దలఁపగఁ నది గాన రాక తద్దయు మానెన్. 127

అర్థ. తలపోయఁగన్ = ఆలోచింపఁగా ; భువిన్ = భూమియందు ; మాయావుల, కృత్యంబు = మాయావరులపనులను, ఎఱుఁగన్, ఎవరు, ఒప్పుదురు = ఎవరు తెలిసికొనఁగలరు ; అనుచున్, పలుకుచున్ = అని పల్కుచు ; తత్, పురిన్ = వారిపురమును ; చొరఁగాన్ = ప్రవేశించుటకు ; తలపఁగన్ = ఆలోచింపఁగా ; అది = ఆపురము ; కానరాక, తద్దయు, మానెన్ = కనఁబడక మాయమయ్యెను.

తా. భూమియందు మాయాపరుల కృత్యముల నెవ్వరు నెఱుంగఁ జాలరని చెప్పుచు, వారి పురముఁ బ్రవేశింపఁదలంప నది కానరాక మాయమయ్యెను.

వ. అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుండై నయోధు వ్రుండు సప్రయత్నుండై యున్న బరప్రతియోగశంకితుండై

యుండె నయ్యెడ మహాజలధి ఘోషంబు ననుకరించుశబ్దం
బు వినంబడెనంత సకలదిక్తటంబుల వాయుజనితంబయినరజః
పటలంబు దోఁచెఁ దత్క్షణంబ యాకాశంబున విస్ఫురత్తటి
త్ప్రభాకలితగర్జారవయుక్తంబు లగు మేఘంబు లమో
ఘంబులై భయంకరాకారంబులై తోఁచెనంత. 128

అర్థ. అట్లు = ఆరీతిగా; పురంబునకు = పట్టణమునకు; అరుగుట = ప్రవేశించుట; మాని = మాని; చిత్రరథుండు = చిత్రగతి కలిగినరథము గల ఆధ్రువుడు; సప్రయత్నుండు; అయ్యును = ప్రయత్నించినను; పర, ప్రతియోగ, శంకితుండు, అయి, ఉండెన్ = శత్రువుల విరోధమును గూర్చి శంకించుచుండెను; అయ్యెడన్ = అప్పుడు; మహాజలనిధి, ఘోషంబున్, అనుకరించు = మహాసముద్రముయొక్క ధ్వనినిపోలిన; శబ్దంబు = ధ్వని; వినంబడెన్ = వినబడెను; అంతన్ = అంత; సకల, దిక్, తటంబులన్ = సర్వదిక్కులందును; వాయు, జనితంబు; అయిన = వాయువుచే పుట్టిన; రజఃపటలంబు, తోఁచెన్ = ధూళి రేగెను; తత్, క్షణం బ = ఆసమయమందే; ఆకాశంబునన్ = ఆకాశమునందు; విస్ఫురత్ = ప్రకాశించుచున్న; తటిత్, ప్రభా, కలిత, గర్జారవ, యుక్తంబులు, అగు = మెఱుపులతోను; ఉఱుములతోను కూడిన మేఘములు, అమోఘంబులయి = ఎట్టముగాను; భయంకర ఆకారంబులు, అయి = భయముగలిగించు నాకారములతోను; తోఁచెన్ = కనఁబడెను; అంతన్ = అప్పుడు.

తా. స్పష్టము.

మ. అనయంబుం ధ్రువుమీఁద దైత్యకృతమాయాజాలము
ల్పైచిఁ బో, రనమస్తిష్కపురీషమూత్రపలదుర్గంధాస్థిమేద
శ్శ్మరా, సననిస్త్రింశశరాసితోమరగదాచక్రత్రిశూలాదిసా
ధనభూభృద్భుజగావళిం గురిసెను ద్దండక్రియాలోలతన్.

అర్థ. అవసరంబున్ = ఎడతెగక ; ధ్రువుమీఁదన్ = ధ్రువుని మీఁద ; దైత్యకృత, మాయాజాలము = యక్షులచే చేయఁబడిన మాయ యొక్క సమూహము ; అట్లు, ఏచి = ఆరీతిగా పెల్లురేగి ; బోరనన్ = బోరుమని ; మస్తిష్క, పురీష, మూత్ర, ఫల, దుర్గంధ, అస్థి, మేదస్, శరాసన, నిస్త్రింశ, శర, అసి, తోమర, గదా, చక్ర, త్రిశూల, ఆది, సాధన, భూభృత్, భుజగావళిన్ = మెదడు, పురీషము మూత్రము, మాంసము, కుళ్ళిపోయిన కంపుకొట్టుచున్న ఎముకలు, మూఁగు, వింట్లు కత్తులు, బాణములు, ఖడ్గములు, చిల్లకోలలు, గదలు, చక్రములు త్రిశూలములు, మొదలైన యుద్ధసాధనములను కొండలు, పాములు, మొదలగువాని, మొత్తములను ; ఉద్దండ, క్రియా, లోలతన్ = భయంకరలీలతో ; కురిసెన్ = వర్షించెను.

తా. ఆరీతిగా రాక్షసులమాయలు పెల్లురేగి, ధ్రువునిమీఁద మాంసము ఎముకలు మొదలగువానిని, ఆయుధములను, పాములను, కొండలను భయంకరముగా కురియునట్లు చేసెను.

వ. మఱియు మత్తగజసింహవ్యాఘ్రసమూహంబులును నూర్మిభయంకరంబై సర్వతః ప్లవనంబయినసముద్రంబును గానంబడియె. వెండియుం గల్పాంతంబునందుంబోలె భీషణంబైనమహోహ్రదంబునుంబోలె నివ్విధంబున నానావిధంబులు ననేకంబులును నవిరళభయంకరంబులు నయినయసురమాయలు క్రూరప్రవర్తను లగుయక్షులచేత సృజ్యమానంబులై యడరె నాసమయంబున. 130

అర్థ. మఱియున్ = ఇంకను ; మత్తగజగ, సింహ, వ్యాఘ్ర, సమూహంబులు = మదించిన ఏనుగులు, సింహములు, పెద్దపులులు వీని మొత్తములను ; ఊర్మి, భయంకరమై = తరంగములచే భయము పుట్టించుచు ; సర్వతః ప్లవనంబు, అయిన, సముద్రంబునున్ = అన్ని దిక్కులు వ్యా

పించిన సముద్రమును ; కానంబడియెన్ = కానఁబడెను; వెండియున్ = ఇంకను ; కల్పాంతంబునందున్, పోలెన్ = ప్రళయకాలమునందువలె ; భీషణంబు, అయిన = భయంకరంబైన ; మహా హ్రదంబునన్ = గొప్ప మడుఁగును; తోఁచెన్ = కనపడెను; ఇవ్విధంబునన్ = ఈరీతిగా; నానా విధంబులును = అనేకవిధములయినట్టియు ; అనేకంబులును = మితిలేనివియు ; అవిరళ, భయంకరంబులును, అయిన = మిక్కిలిభయముగొల్పునవియైనగు ; అసురమాయలు = యక్షులమాయలు ; క్రూరప్రవర్తనులు, అగు, యక్షులచేత = క్రూరాచారములుగల యక్షులచేత; సృజ్యమానంబులు, అయి = పుట్టింపఁబడి ; ఆడరెన్ = వ్యాపించెను ; ఆసమయంబునన్ = అప్పుడు

తా. స్పష్టము.

క. అనయంబును నయ్యక్షుల
ఘనమాయ నెఱింగి మునినికాయము వరుసన్
మనుమనుమని మను మను మని
మనమునఁ దలఁచుచును దత్సమక్షంబునకున్. 131

అర్థ. అనయంబును = ఎక్కువగా ; ఆ, యక్షుల = ఆయక్షులయొక్క ; ఘనమాయన్ = గొప్పమాయను ; ఎఱింగి = తెలిసికొని ; మునినికాయము = మునులసమూహము ; వరుసన్ = వరుసగా ; మను, మనుమని = మనువుమనుమడైన ధ్రువుని; మను, మనుము, అని = జీవింపుము జీవింపుమని; మనమునన్ = మనస్సునందు ; తలఁచుచును = ఆశీర్వదించుచు;తత్సమక్షంబునకున్ = ఆ నివద్దకు (ముందుపద్యముతో నన్వయము)

తా. యక్షులు ప్రయోగించు మాయలను తెలిసికొని మునులు, తమమనస్సులలో ధ్రువుఁడు చిరంజీవియగుగాక యని ఆశీర్వదించుచు నతని యొద్దకు (ముందుపద్యముతో నన్వయము)

వ. చను దెంచి యా ధ్రువునిం గని యిట్లనిరి. 132

అర్థ. చనుదెంచి = వచ్చి. ఆధుశివునిన్ = ఆధుశివుని ; కని = చూచి, ఇట్లు అనిరి = ఇట్లు పలికిరి

సీ. అనఘాత్మ లోకు లె ✱ వ్వని దివ్యనామంబు
సమత నాకర్ణించి ✱ సంస్మరించి
దుస్తరం బైన మృ ✱ త్యువునైన సుఖవృత్తిఁ
దరియింతు రట్టి యీ ✱ శ్వరుఁడు పరుఁడు
భగవంతుఁడును శార్ఙ్గ ✱ పాణియు భక్తజ
నార్తిహరుండును ✱ నైనవిభుఁడు
భవదీయవిమతులఁ ✱ బరిమార్చుఁ గా కని
పలికిన మునులసం ✱ భాషణములు
తే. విని కృతాచమనుఁ డయి మా ✱ విభునిపాద
కమలముఁ దలంచి రిపుభయం ✱ కరమహోగ్ర
కలితనారాయణాస్త్రంబుఁ ✱ గార్ముకమునఁ
బూనఁ దడవఁ దదీయసం ✱ ధానమునను. 131

అర్థ. అనఘాత్మ = పాపరహితుఁడా ; లోకులు = జనులు ; ఎవని దివ్యనామంబున్ = ఎవనిపవిత్రనామమును ; సమతన్ = యోగబుద్ధితో ; ఆకర్ణించి = విని . సంస్మరించి = జ్ఞాపకముంచుకొని . దుస్తరంబు , అయిన = దాఁటశక్యముగాని . మృత్యువును, అయినన్ = చావునైనను . సుఖవృత్తిన్ = సౌఖ్యముగా. తరియింతురు = దాటుదురో . అట్టి = అటువంటిఁ ఈశ్వరుఁడు = శ్రీమహావిష్ణువు . పరుఁడు = శ్రేష్ఠుడు . భగవంతుండును = ఐశ్వర్యవంతుఁడును . శార్ఙ్గంగపాణియు = శార్ఙ్గమనువింటిని ధరించినవాఁడును. భక్తజన,ఆర్తిహరుండును = భక్తులదుఃఖమును పోగొట్టువాఁడును . అయిన, విభుఁడు = అయినట్టిప్రభువు భవదీయ, విమతులన్ = నీశ

త్రువులను . పరిమార్చును, అని, కాక, అని = చంపునుగాక అని . పలికి నన్ = పలుకఁగా. మునులసంభాషణములు = మునులమాటలనువిని . కృత. అచమనుఁడు, అయి = అచమనము చేసి. మా. విభుని, పాదకమలము, తలంచి = లక్ష్మీనాథుని పాదపద్మముతలంచి. రిపు, భయంకర, మహోగ్ర, కలిత. నారాయణాస్త్రంబు = శత్రుభయంకరంబగు నారాయణాస్త్రమును . కార్ముకమునన్ = వింటియందు . పూనన్, కడవన్ = సంధించుటకు వేతుకగా.తదీయ, సంధానమునను = దాని నెక్కుపెట్టగానే.

తా. ధ్రువుఁడా ! శ్రీమహావిష్ణువు పావననామమును యోగబుద్ధితో విని, ధ్యానించి, జనులు, మృత్యువునుదాఁటుదురు. అట్టిభక్తజనపాలకుఁడగు విష్ణువు . నీశత్రువులను పరిమార్చునుగాక అని పలుకగా, మునులమాటలువిని అచమనము చేసి, లక్ష్మీనాథుని పాదపద్మములను తలంచి, శత్రు భయంకరమగు నారాయణాస్త్రము వింటియందు సంధించుచుండఁగనే.

తే. కడఁగి గుహ్యకమాయాంధ కారమపుడు
వెరవు సెడి దవ్వుదవ్వుల విరిసి పోయె
విమలమైనవివేకోద యమునఁ జేసి
సమయు రాగాదికంబుల సరణి నంత 134

అర్థ. కడఁగి = పూని . గుహ్యక,మాయా, అంధకారము = యక్షులమాయయనుచీఁకటి, అపుడు. విమలమైన = స్వచ్ఛమైన, వివేక, హృదయమునన్, చేసి = జ్ఞానముకలుగుట చేత. సమయు = తొలఁగిపోవు; రాగాధికంబులసరణిన్ = కామము, మోహము రాగము, ద్వేషము పొందలగువానివలె; అంతన్, అపుడు; వెరవుచెడి = దారి తెలియక ; దవ్వుదవ్వులన్ = దూరముగా; విరిసిపోయెన్ = తొలగిపోయెను,

తా. జ్ఞానముకలుగుటవలన రాగద్వేషాదులు నశించునట్లు అయక్షులమాయయను నంధకారము దూరదూరముగా తొలఁగిపోయెను

మ. వరనారాయణబాణరాడ్జనితదుర్వారప్రభాహేమపుం
ఖరుచిస్ఫారమరాళరాజసితపక్షక్రూరధారారణ
చ్ఛరసాహస్రము లోలి భీషణవిపక్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునఁ గానఁ జొచ్చుశిఖిసంఘాతంబుచందంబునన్.

అర్థ. వర = శ్రేష్ఠమైన. నారాయణబాణ రాట్ = నారాయణాస్త్రబాణరాజమునుండి జనిత = పుట్టిన. దుర్వార = అడ్డులేని. ప్రభా = కాంతులుగల. హేమపుంఖ = బంగారుమొనల. రుచి = కాంతిగలిగి, స్ఫార = ఒప్పుచున్న - మరాళరాజ = రాజహంసల. శితపక్ష = తెల్లని ఱెక్కలవలె. క్రూరధారా = వాడియైనయంచుకలిగి. రణత్ = ధ్వనిచేయుచున్న. శరసాహస్రముల = వేలకొలదిబాణములు. ఓలిన్ = వరుసగా. భీషణ, విపక్ష, శ్రేణిపయిన్ = భయంకరశత్రుసమూహముపై. భీకరారవంబునన్ = భయంకరమగు ధ్వనితో. కానన్, చొచ్చు = అడవిని ప్రవేశించు. శిఖిసంఘాతంబు. చందంబునన్ = అగ్నులసమూహమువలె. వ్రాలెన్ = పడెను.

తా. ధర్మపుని నారాయణాస్త్రమునుండి తేజోవిరాజితములైన బాణసమూహములు పుంఖానుపుంఖములుగా అడవియందు ప్రవేశించు నగ్నులవలె శత్రుకోటిపైఁబడెను.

వ. అట్లేసిన. 136

అర్థ. అట్లు, ఏసినన్ = అప్రకారము ప్రయోగింపఁగా.

చ. ఖరనిశితపదీప్తఘనకాండపరంపరవృష్టిచేఁ బొరిం
బొరివికలాంగులై యడరి పుణ్యజనుల్ పృథుహేతిపాణులై
గరుడునిఁ జూచి భూరిభుజగప్రకరంబు లెదిర్చి పేర్చి చె
చ్చెరనడతెంచుచందమునఁ జిత్రరథుం బలుపూని తాఁకినన్

అర్థ. ఖర, విశిత, ప్రదీప్త, ఘన, కొండ, పరంపర, వృష్టి చేన్ = వాఁడియై, తీక్ష్ణమై ప్రకాశించు దట్టమైన, బాణములవర్షము చేత . పొరిన్ బోరిన్ = ఎక్కువగా . వికలాంగులు, అయి, విఱిగిన అవయవములుగలవారై; అడరి = పూని; పుణ్యజనుల్ = రాక్షసులు. పృథు, హేతి; పాణులు, అయి = పెద్దఖడ్గములను పట్టుకొని ; గరుడునిన్ = గరుత్మంతుని చూచి; భూరి, భుజగప్రకరంబులు = గొప్పసర్పంబుల సమూహములు ; ఎదిర్చి = ఎదిరించి . పేర్చి = పెచ్చుపెరిగి . చెచ్చరన్ = వేగముగా ; నడతెంచుచందమునన్ = వచ్చువిధముఁగా . చిత్రరథున్ = విచిత్రగతులతో నడచుచున్న రథమునెక్కినధ్రువుని. బలుపు = బలమును, ఊని = కలిఁగి ; తాఁకిరన్ = ఎదిరింపగా

తా. గరుడునిపై పాము లెదిరించి వచ్చునట్లా రాక్షసులు పెద్ద ఖడ్గములను ధరించి ధ్రువుని దాఁకిరి. అట్లు తాఁకఁగా.

ఉ. వారలఁ జండతీవ్రశర వర్గముచేత నికృత్తపాదజం
ఘోరుశిరోధరాంబకక రోదరకర్ణులఁ జేసి యోగి పం
కేరుహమిత్రమండలని కృత్తత నెట్టిపదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ బంపె భుజావిజృంభియై.

అర్థ. వారలన్ = వారిని. చండ, తీవ్ర, శరవర్గము చేతన్ = తీక్ష్ణమైన బాణములచే. నికృత్త, పాద జంఘ, ఊరు శిరస్ అధర అంబక, కర ఉదర కర్ణులన్ చేసి = పాదములు పిక్కలు శిరస్సులు పెదవులు కన్నులు చేతులు కడుపులు చెవులు కోసి విభేదించి. యోగి పంకేరుహమిత్ర మండల నికృత్తతన్ = సూర్యమండలమును భేదించుటవలన ; ఏమిపదంబున్ చెందున్ = ఏపదవిని పొందునో ; ఆ భూరిపదంబునన ఆశ్రేష్ఠమైనపదవిని ; పెలుచన్ = మిక్కిలిగా . పొందగన్ = చేరునట్లు . భుజా విజృంభి. అయి = భుజగర్వముతో. పంపెన్ = పంపెను

తా. ఆరాక్షసులను తన బాణములచేత, సకలావయవములను ఛేదించి, యోగులు భేదించుకొనుపోవు సూర్యమండలమును చేరునట్లు చేసెను.

వ. ఇవ్విధంబున నాచిత్రరథుండగుధ్రువుని చేత నిహన్యమానులును నిరపరాధులును నయిన గుహ్యకులం జూచి యతని పితామహుండైన స్వాయంభువుండు ఋషిగణపరివృతుండై చనుదెంచి ధ్రువునిం జూచి యిట్లనియె వత్సా నిరపరాధులైన యీపుణ్యజనుల నెట్టిరోషంబున వధియించితి విట్టినిరయహేతువైన రోషంబు సాలు భ్రాతృవత్సలభ్రాతృవధాభితప్తుండవై కావించునీయత్నంబు నుడుగుము. 139

అర్థ. ఇవ్విధంబునన్ = ఈరీతిగా ; ఆ, చిత్రరథుండు, అగు, ధ్రువుని చేతన్ = రథముపై చిత్రముగ సంచరించు నాధ్రువుని చేత; నిహన్యమానులును = చంపఁబడుచున్నవారును ; నిరపరాధులును = ఎట్టితప్పునులేనివారును ; అయిన, గుహ్యకులన్, చూచి = యక్షులను చూచి; అతని, పితామహుండు అయిన, స్వాయంభువుండు = ఆతనితాత యగు స్వాయంభువమనువు ; ఋషిగణపరివృతుండై = ఋషులతోఁగూడి ; చనుదెంచి = వచ్చి; ధ్రువునిన్, చూచి, ఇట్లనియెన్ = ధ్రువుని చూచి యిట్లు పలికెను; వత్సా = బాలకా; నిరపరాధులైన = ఎట్టితప్పునులేని ; ఈపుణ్యజనులన్ = ఈరాక్షసులను ; ఎట్టిరోషంబునన్ = ఏమికోపము చేత ; వధియించితివి = చంపినావు; ఇట్టి = ఇటువంటి; నిరయహేతువు, అయిన = పాపకారణమైన ; రోషంబు, చాలున్ = కోపము చాలును ; భ్రాతృవత్సల = సోదరునియందు ప్రేమగలవాఁడా ; భ్రాతృవధ, అభితప్తుండవు అయి = నీసోదరునివధ చేత కోపించినవాఁడవయి ; కావించు = చేయుచున్న; నీయత్నంబు = నీప్రయత్నమును; ఉడుగుము, అని = మానుము. ని

తా. స్పష్టము.

క. అనఘా మనుకులమున కిది
యనుచితకర్మంబ యొకని కై పెక్కండ్రి
ట్లని మొనఁ దునిఁగిరి యిది నీ
కనయంబును వలవ దుడుగు మయ్య కుమారా. 140

అర్థ. అనఘా = పాపములేనివాఁడా ; మనుకులమునకు = మనువు వంశమునకు; ఇది = ఇట్లు చేయుట; అనుచితకర్మంబు = కూడని కార్యమే; ఒకనికై = ఒకనికోసము; పెక్కండ్రు = అనేకులు ; ఇట్లు = ఈరీతిగా ; అని మొనన్ = యుద్ధముఖమున ; తునింగిరి = మృతినొందిరి . అయ్యా, కుమారా = ఓయి బాలకా ! ఇది = ఈపని ; నీకు = నీకు , అనయంబును = ఎప్పటికిని; వలదు = కూడదు ; ఉడుగుము = మానుము ;

తా. కుమారకా ! ఒక్కనికొఱకు అనేకులను మృతినొందించుట మనువంశమునపుట్టిన నీకుతగదు. కావున యుద్ధము మానుము.

వ. అదియునుంగాక దేహాభిమానంబునం బశుప్రాయులై భూతహింస గావించుట హృషీకేశానువర్తు లయినసాధువుల కుం దగదు నీవు సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలఁచి సర్వభూతావాసుండును దురారాధ్యుండును నైనవిష్ణునిపదంబులఁ బూజించి తత్పరమపదంబునం బొందితి - వట్టిభగవంతుని హృదయంబున ననుధ్యాతుండవు భాగవతులచిత్తంబులకును సమ్మతుండవు మఱియు సాధువర్తనుండ వన నొప్పునీ వీపాపకర్మం బెట్లు సేయ సమకట్టితి వేపురుషుండైన నేమి మహాత్ములయందుఁ దితిక్షయు

నములయందు మైత్రియు హీనులయందుఁ గృపయు నిత
రంబు లగునమస్తజంతువులయందు సమత్వంబును గలిగి
వర్తించువానియందు సర్వాత్మకుం డైనభగవంతుండు
ప్రసన్నుం డగు నతండు ప్రసన్నుం డయిన వాఁడు ప్ర
కృతిగుణంబులం బాసి లింగశరీరభంగంబు గావించి
బ్రహ్మానందంబునం బొందు నదియునుంగాక కార్యకార
ణసంఘాతరూపం బయినవిశ్వం బయస్కాంతసన్నిధానం
బు గలిగినలోహంబుచందంబున నేసర్వేశ్వరుండు నిమి
త్తమాత్రంబుగాఁ బరిభ్రమించు నట్టియీశ్వరుని మా
యాగుణవ్యతికరంబున నారబ్ధంబు లయినపంచభూతంబు
లచేత యోషిత్పురుషవ్యవాయంబువలన యోషిత్పురు
షాదిరూపసంభూతి యగు నివ్విధంబునఁ దత్సర్గంబుఁద
త్సంస్థానంబుఁ దల్లయంబు నగుచుండు నిట్లు దుర్విభా
వ్యంబైనకారణశక్తిం జేసి గుణక్షోభంబున విభజ్యమానవీ
ర్యుండు ననంతుండు ననాదియునై జనంబులచేత జనంబు
లం బుట్టించుచుండుటం జేసి జగదాదికరుండును మృత్యు
హేతువు నగుజనంబుల రయంబునొందించుటం జేసి యం
తకరుండును ననాదియగుటం జేసి యవ్యయుండును నైన
భగవంతుండు జగత్కారణుం డగుం గావున నీసృష్టిపా
లనవిలయంబులం గర్త గాని వాఁడునుంబలెఁ జేయుచుం
డు నిట్లు మృత్యురూపుండును బయుండును సమవర్తియు
నైనయీశ్వరునికి స్వపక్షపరపక్షంబులు లేవతనికిఁ గర్మా

ధీనంబు లయినభూతసంఘంబులు మోహపాశమ్ము ననుస
రించురజ్జువులచాడ్పున నస్వతంత్రంబులగుచు ననువర్తిం
చునతండును జంతుచయమ్మునకు నుపచయాపచయకరణంబు
లం దస్వతంత్రుండును నగుజీవుండు కర్మబద్ధుండగుటం జేసి
కర్మంబ వానికి నాయురుపచయాపచయంబులం జేయుచుం
డు మఱి నను సర్వజగత్కర్మసాక్షి యగుసర్వేశ్వరుని.

అర్థ. అదియునుంగాక = అంతేకాక ; దేహాభిమానంబునన్ = శరీరమునందలి యభిమానముచేత ; పశుప్రాయులై = పశువులవంటివారై ; భూతహింస, కావించుట = ప్రాణులను హింసచేయుట ; హృషీకేశ, అనువర్తులు అయిన, సాధువులకున్, తగదు = విష్ణుభక్తులయిన సజ్జనులకు కూడదు; నీవు; సర్వభూతంబుల = సమస్తప్రాణులను, ఆత్మభావంబునన్, తలఁచి = నీవలెనే యని ఆలోచించి, సర్వభూత ఆవాసుండును = సర్వప్రాణులయందు నుండువాఁడును ; దురారాధ్యుఁడును, అయిన = ఆరాధింపశక్యముకాని వాఁడునగు ; విష్ణుపదంబులన్ = విష్ణుమూర్తి యొక్క పాదములను పూజించి ; తత్, పరమపదంబునన్, పొందితివి = అత్యంతశ్రేష్ఠస్థానమును పొందితివి; అట్టి = అటువంటి; భగవంతుని = విష్ణువుయొక్క ; హృదయంబునన్ = హృదయమునందు ; అనుధ్యాతుండవు = ధ్యానింపఁబడుచుండువు ; భాగవతుల చిత్తంబులకును, సమ్మతుండవు = విష్ణుభక్తులమనసులకు ప్రియుఁడవు; మఱియు = ఇంకను ; సాధువర్తనుండవు, అనన్ = సాధుచరిత్రముగలవాఁడ వని; ఒప్పు = ఒప్పునట్టి ; నీవు ఈ, పాపకర్మంబు, ఎట్లు, చేయన్, సమకట్టితివి = ఈపాపకార్యమును ఎట్లు చేయనారంభించితివి ; ఏపురుషుండు, అయినన్, ఎటు = ఏ పురుషుఁడైనను; మహాత్ములయందున్, తితిక్షయున్ = మహాత్ములయెడల ఓర్పును. సములయందు మైత్రియున్ = సమానులయెడల స్నేహము ; ను

హీనులయందు . కృపయున్ = తనకంటె తక్కువవారియందు దయయు ; ఇతరంబులగు, సమస్తజంతువులయందున్, సమత్వంబున్ = తక్కినసర్వ ప్రాణులయందును సమబుద్ధియు ; కలిగి ; వర్తించువానియందున్ = ప్రవర్తించువానికి ; సర్వాత్మకుండు, అయిన = సమస్తమునకును ఆత్మవంటి ; భగవంతుండు = శ్రీమహావిష్ణువు, ప్రసన్నుండు, అగున్ = దయగలవాడగును అతండు = ఆవిష్ణువు; ప్రసన్నుండు, అయినవాఁడు = దయచూచినవాఁడు ; ప్రకృతిగుణంబులన్, పాసి = సత్త్వరజస్తమోగుణములను విడిచి ; లింగశరీరభంగంబు, కావించి = స్థూలశరీరమును విడిచిపెట్టి . బ్రహ్మానందంబునన్, పొందున్ = బ్రహ్మానందమును పొందును . అదియునున్, కాక = అంతేకాక, కార్యకారణ, సంఘాత, రూపంబు, అయిన = కార్యము, కారణమునను గానికూడిక చేకలిగిన . విశ్వంబు = ప్రపంచము. అయస్కాంత, సన్నిధానంబు, కలిగిన, లోహంబుచందంబునన్ = సూదంటురాయి దగ్గఱగానున్న యినుమువలె ఏసర్వేశ్వరుండు = ఏవిష్ణుమూర్తి . నిమిత్తమాత్రంబుగాన్ = తాత్కాలికకారణమై . పరిభ్రమించున్ = తిరుగుచుండునో . అట్టి = అటువంటి . ఈశ్వరుని = విష్ణుమూర్తి యొక్క . మాయాగుణ, వ్యతికరంబునన్ = మాయవలనగలుగు గుణముల కలయికచేత ఆవిర్భూతంబులు అయిన = సృష్టిపొందిన . పంచభూతంబుల చేతన్ . యోషిత్, పురుష, వ్యవాయంబువలనన్ = స్త్రీపురుషులకూడిక వలన యోషిత్, పురుష, ఆది, రూపసంభూతి, అగున్ = స్త్రీపురుషుల రూపంబులు పుట్టుచుండును . ఇవ్విధంబునన్ = ఈరీతిగా. తత్ సర్గంబు = ఆసృష్టియు . తత్ సంస్థానంబు = ఆస్థితియు . తత్ లయంబును = ఆనాశమును . అగుచున్, ఉండున్ = కలుగుచుండును . ఇట్లు ఈ విధముగా, దుర్విభావ్యంబయిన = ఊహింపశక్యముగాని . కాలశక్తిన్, చేసి = కాలముయొక్క శక్తిచేత, గుణ, క్షోభంబునన్ = గుణములుతారుమారగుచుండుటచేత . విభజ్యమాన, వీర్యుండును = భాగింపఁబడినవీర్యముగలవాఁడును . అనంతుండును = అంతములేనివాఁడును . అనాదియు

ను = మొదలులేనివాఁడును . అయి జనంబులచేతన్ = జనులచేత. జనంబులన్ = జనులను, పుట్టించుచుండుటన్, చేసి = పుట్టించుచుండుటవలన . జగదాది, కయుండును = ప్రకృతికిమూలమయినవాఁడును . మృత్యుహేతువులు, అగు జనంబులన్ = మృత్యువులకు కారణములగు జనులను . లయంబు పొందించుటంజేసి = నాశనముచేయుటచేత . అంతకరుండును = లయకారఁకుఁడును , అనాది, అగుటంజేసి = పుట్టుకలేక పోవుటచేత . అవ్యయుండును = నాశనములేనివాఁడును . అయిన . భగవంతుండు = అయిన శ్రీమహావిష్ణువు; జగత్, కారణుండు. అగున్ = జగములకు కారణమగును. కావునన్ = కాఁబట్టి. ఈ, సృష్టి, పాలన, విలయంబున్ = ఈసృష్టి, స్థితి సంహారములందు , కర్త కాఁడునుం బలెన్ = కాను కర్త కానట్లు. చేయుచుండున్ = ప్రవర్తించుచుండును . ఇట్లు = ఈవిధముగా . మృత్యురూపుండును = మృత్యురూపముగలవాఁడును . పరుఁడును = శ్రేష్ఠుఁడును . సమవర్తియు = సర్వభూతములయెడల నొక్కరీతిగా ప్రవర్తించువాఁడును . అయిన . ఈశ్వరునికిన్ = అయిన మహావిష్ణువునకు . స్వపక్ష పరపక్షంబులు , లేవు = తనవారు పరులనుమాటలేదు . అతనికిన్ = అతనికి . కర్మాధీనంబులు, అయిన = కర్మమునకు కట్టుబడియున్న . భూతసంఘంబులు = ప్రాణికోట్లు, మహావాయువున్, అనుసరించి, రజంబుల చాడ్పునన్ = గాలితోఁగూడ పోవుచుండు దూళివలె . అస్వాతంత్రింబులు గుచున్ = స్వాతంత్ర్యములేక . అనువర్తించున్ = వెంటనంటియుండును, అతండును = ఆమహావిష్ణువును . జంతుచయ = జంతుసమూహములయొక్క . ఆయున్ = జీవితము; ఉపచయ, అపచయ కరణంబులందు = ఇచ్చుట, ఈయక పోవుట అనుపానియందు .అస్పృహుండును, అగు = సంబంధములేని. జీవుండు = జీవాత్మ కర్మబద్ధుండు ఆగుటంజేసి = కర్మముచేత కట్టుబడినవాఁడగుటవలన. కర్మంబ = కర్మమే. వానికి = ఆ జీవాత్మకు . ఆయుస్, ఉపచయ, అపచయంబులన్ = ఆయువునిచ్చుటను ఈయకుండుటను . చేయుచుండును = కలుగఁజేయుచుండును . మఱి

యున్ = ఇంకను . సర్వ, జగత్, కర్మ; సాక్షి, అగు = సమస్త జగముల యొక్క పనులను చూచుచున్న వాఁడగు . సర్వేశ్వరుని = శ్రీమహా విష్ణువును.

తా. స్పష్టము.

క. కొందఱు కర్మం బందురు
కొందఱు స్వాభావ్య మందు్రు కొందఱు కాలం
బందురు కొందఱు దైవం
బందురు కొంద ఱొగిఁ గామ మంద్రు మహాత్మా. 142

అర్థ. కొందఱు = కొందఱు . కర్మంబందురు = కర్మమని చెప్పుదురు; కొందఱు = మఱికొందఱు ; స్వాభావ్యమందు్రు = స్వభావశక్తియే అని పలుకుదురు; కొందఱు = ఇంకనుకొందఱు; కాలంబందురు = దానినే కాలమని చెప్పుదురు ; కొందఱు = మఱికొందఱు ; దైవదైవంబందురు = దానినే దైవమని చెప్పుదురు ; కొందఱు, ఒగిన్ = మఱికొందరింకను ; మహాత్మా = ధ్రువుఁడా; కామమంద్రు = కామమని చెప్పుదురు

తా. ఈశ్వరుని ,,కర్మము, స్వభావశక్తి, కాలము, దైవము, కామము,, నని యనేకవిధములుగా తలంచుచుందురు.

వ. ఇట్టులవ్యక్తరూపుండును నప్రమేయుండును నానాశక్త్యుదయహేతుభూతుండును నైన భగవంతుఁడు సేయుకార్యంబులు బ్రహ్మాదులు దెలియంగ రఁట యతనితత్త్వంబు నెవ్వ రెఱుంగ నోపుదు రాభగవంతు సృష్టిస్థితిలయంబులు సేయుచుండియు ననహంకారుం డగుట గుణకర్మంబులం బొరయఁడు సర్వభూతాత్ముఁడును సర్వభూ

తనియంతయు సర్వభూత భావనుండునైన భగవంతుండు తనమాయతోడ గూడి భూతసృష్టిస్థితిసంహారంబులు సేయుచుండుc గావునc బుత్రా! యిట్లుత్పత్తిస్థితిలయంబులకు దైవంబు కారణంబై యుండ నీధనదానుచరులు భవదీయభ్రాతృహంత లగుదురే యదియునుం గాక యీప్రజాపతులు విశ్వసృష్ణామంబుల నియంత్రితులై ముకుcదాళ్ళ వెట్టినపశువులుంబోలె నెవ్వనియాజ్ఞాధీనకృత్యులై వర్తింతు రట్టి దుష్టజనమృత్యువును సుజనామృతస్వరూపుండును పరాత్మనుండును జగత్పరాయణుండును నైనయీశ్వరుని సర్వప్రకారంబుల శరణంబుc బొందుమదియునుంగాక. 143

అర్థ ఇట్టులు = ఈరీతిగా ; అవ్యక్త రూపుండును = వ్యక్తముకాని రూపముకలవాcడును, అప్రమేయుండును = పరిమితిదెలిసికొన నశక్యుండును ; నానా, శక్తి, ఉదయ, హేతుభూతుండును = వివిధములగు శక్తులుకలవాcడును ; అయిన; భగవంతుండు = శ్రీమహావిష్ణువు, చేయు = చేయునట్టి; కార్యంబులు = పనులు ;బ్రహ్మరుద్రాదులు = బ్రహ్మ, రుద్రుడు మొదలగువారు ; ఎఱుంగరట = తెలిసికొనజాలరcట ; అతని తత్త్వంబున్ = అతని సత్యస్వరూపమును; ఎవరు, ఎఱుంగన్, ఓపుదురు = ఎవరు తెలిసికొనcగలరు, ఆ,భగవంతుండు = ఆయీశ్వరుcడు; సృష్టి, స్థితి, సంహారములను ; చేయుచుండియున్ = చేయుచున్నను ; అనహంకారుండు అగుటన్ = అహంకారము లేనివాcడగుటచేత ; గుణ, కర్మంబులన్ = పొరయcడు = గుణములను, కర్మములను, అంటియుండcడు ; సర్వభూతాత్ముండును = సర్వప్రాణులయందును ఆత్మయై మెలcగువాcడును ; సర్వ

భూత, నియంతయు = సర్వభూతములకును నియామకుఁడును, సర్వభూత భావనుండును = సమస్తప్రాణుల చేతను ధ్యానింపఁబడువాఁడును ; అయిన భగవంతుండు = అయిన ఈశ్వరుఁడు ; తనమాయతోడన్, కూడి = తన మాయతోఁగూడ ; భూత, సృష్టి, స్థితి, సంహారంబులు = ప్రాణములను పుట్టించుట, పాలించుట, చంపుట, అను కార్యములను ; చేయుచుం డున్ = చేయుచుండును ; కావునన్ = గనుక ; పుత్రా = కుమారుఁడా; ఇట్లు = ఈప్రకారముగా; ఉత్పత్తి; స్థితి, లయంబులకున్ = సృష్టి, స్థితి, సంహారములకు ; దైవంబు, కారణంబు, అయి, ఉండఁగన్ = దైవమే కారణ మయియుండఁగా ; ఈ, ధనద, అనుచరులు = ఈకుబేరుని సేవకులైన యక్షులు ; భవదీయ, భ్రాతృహంతలు, అగుదురే = నీసోదరుని చంపిన వారలగుదురా? అదియునుంగాక, ఈప్రజాపతులు = ఈబ్రహ్మలు, విశ్వ సృట్, నామంబులన్ = విశ్వమును సృజించువారను పేర ; నియంత్రితులు; అయి = నియమింపఁబడినవారయి ; ముకు దారిత్ర్యు, పెట్టిన, పశువులున్, పోలెన్ = ముక్కునకు త్రాళ్లుకట్టిన పశువులవలె; ఎవ్వని, ఆజ్ఞా, అధీన కృత్యులు, అయి = ఎవని ఆజ్ఞకు లోఁబడి పనులచేయుచు ; వర్తింతురు = సంచరింతురో ; అట్టి = అటువంటి ; దుష్టజన, మృత్యువును = దుష్టులకు మృత్యువువంటివాఁడును ; సుజన, అమృత స్వరూపుండును = సజ్జనులకు అమృతమువంటివాఁడును ; సర్వ, ఆత్మకుండును = సమస్తప్రాణులకును ఆత్మవంటివాఁడును, జగత్, పరాయణుండును = లోకములకు ఆశ్రయ మయినవాఁడును ; అయిన, ఈశ్వరునిన్ = అయిన విష్ణుమూర్తిని; సర్వ ప్రకారంబులన్ = అన్నివిధముల చేతను ; శరణంబు, పొందుము = శరణు చొరుము; అదియునుంగాక = అంతేకాక;

తా. స్పష్టము.

సీ. అనఘాత్మ నీవు పం ♦ చాబ్దవయస్కుఁడ
వై పినతల్లి ని ♦ న్నాడినట్టి

మాటల నిర్భిన్న • మర్మండ వగుచును
జనయిత్రి దిగనాడి • వనము కేఁగి
తపమునఁ జేసి య • చ్ఛపుభక్తి నీశ్వరుఁ
బూజించి మహితవి • భూతి మెఱసి
రమణఁ ద్రిలోకోత్త • రం బైనపదమును
బొందితి వది గాన • భూరిభేద

తే. రూప మైనప్రపంచంబు • రూఢి నేమ
హాత్మునందుఁ బ్రతీత మై • యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును • నక్షరుండు
నైన యీశ్వరుఁ బరమాత్ము • ననుదినంబు. 144

అర్థ. అనఘాత్మ = పాపరహితుఁడా ; నీవు, పంచాబ్దవయస్కుం డవయి = అయిదేండ్ల బాలుఁడవయి ; పినతల్లి = నీపినతల్లియైన సురుచి ; నిన్ను, ఆడినట్టి = నిన్నుపలికినట్టి ; మాటలన్ = మాటలచేత ; నిర్భిన్న. మర్మండవగుచు = మనస్సునొచ్చినవాఁడవై ; జనయిత్రిన్, దిగనాడి = తల్లినివిడిచిపెట్టి. వనము కేగి = వనమునకుపోయి ; తపమునన్, చేసి = తప స్సువలన ; అచ్ఛపుభక్తిన్ = స్వచ్ఛమైనభక్తితో ; ఈశ్వరున్, పూజించి = ఈశ్వరునిపూజచేసి ; మహితవిభూతిన్, మెఱసి = మిక్కిలి వైభవముతో ప్రకాశించి ; రమణన్ = ప్రీతితో, త్రిలోకోత్తరంబైన = మూఁడులోక ములకంటె నున్నతమైన ; పదమును = స్థానమును ; పొందితివి = సంపా దించితివి ; అది, కానన్ = అందుచేత ; భూరి, భేద, రూపమైన = అనేక భేదములచే రూపములుపొందిన ; ప్రపంచంబు = విశ్వము ; రూఢిన్ = స్థిరముగా ; ఏమహాత్మునందున్ = ఏమహానుభావునియందు ; ప్రతీతమై, అలరున్ = ప్రఖ్యాతిని పొందియుండునో ; అట్టి = అటువంటి ; అగుణుఁ

డు = గుణములులేనివాఁడును ; అద్వితీయుఁడును = తనకంటె నితరుఁడు లేనివాఁడును, అక్షయుండున్ = నాశనములేనివాఁడును ; అయిన ఈశ్వరున్ = అయిన విష్ణుమూర్తిని ; పరమాత్మున్ = పురుషోత్తముని; అనుదినంబున్ = దినదినమును.

తా. ఓయి ధ్రువుఁడా ! నీవైదేండ్ల ప్రాయముననే సవతితల్లి యాడిన మాటలకు సహింపక, యడవికిపోయి, తపస్సుచేసి, ఈశ్వరుని పూజించి, ఆతనిదయవలన యుల్లోకములకంటె నున్నతమైన స్థానమును పొందితివి కావున నీవాపరమాత్మను ప్రతిదినమును (ముందుపద్యముతో నన్వయము.)

సీ. కైకొని శుద్ధంబు ♦ గతమత్సరంబును
  నమలంబు నగుహృద ♦ యంబునందు
 పొలవ కన్వేషించు ♦ చును బ్రత్యగాత్ముండు
  భగవంతుఁడును బర ♦ బ్రహ్మమయుఁడు
 నానందమాత్రుండు ♦ నవ్యయుఁడుపపన్న
  సకలవీర్యుండును ♦ నగుణుఁ డజుఁడు
 నయిననర్వేశ్వరు ♦ నం దుత్తముం బైన
  సద్భక్తిఁ జేయుచు ♦ సమత నొప్పి
తే. యాఢి సోహమ్మ మేతి ప్రి ♦ యాథ మగుచు
 ఘనత కెక్కినవిద్య యుఁ ♦ గ్రంథి నీవు
 దెంచి వైచితి కావున ♦ ధీవరేణ్య
 సర్వశుభహాని యైన రో ♦ షంబు వలదు.

అర్థ. కైకొని = పూని ; శుద్ధంబున్ = పరిశుద్ధమును ; గతమత్సరంబున్ = మత్సరముపోయినవాఁడును ; అమలంబున్ = నిర్మలమయినది

యును ; అగు = అయిన ; హృదయంబునందున్ = మనస్సునందు ; సొలప
క = అలయక ; అన్వేషించుచున్ = వెదకుచును ; ప్రత్యగాత్ముండున్ =
జీవాత్మస్వరూపుఁడును ; భగవంతుఁడును = మంగళస్వరూపము గలవాఁ
డును ; పరమాత్మమయుఁడున్ = పరమాత్మస్వరూపియును ; ఆనందమా
త్రుండున్ = నాశనము లేనివాఁడును ; ఉపపన్న సకలవీర్యుండును = సం
భవమొందిన వీర్యములన్నిటిని గలవాఁడును ; సగుణుఁడు, ఐ = మంచి
గుణములచేత ; దనరారువాఁడును = తిరుగువాఁడును ; అజుఁడు = జన్మము
లేనివాఁడును ; అయినసర్వేశ్వరునందున్ = అయినటువంటి శ్రీవిష్ణుమూ
ర్తియందు ; సద్భక్తిన్, ఒప్పుచున్ = మంచినిర్మలమయినభక్తినిగలిగి వెల
యువాఁడును ; సమతన్ = సమత్వముతో ఒప్పి = ఒప్పుచు ; రూఢిన్,
సోహం, మమ, ఇతి = అది, నిజముగా, నాదియనుటచే ; పరిరూఢమగు
చున్ = నిరూఢిని జెందినదై ; ఘనకెక్కు = గొప్పతనమునుపొందు ; అవి
ద్యయన్, గ్రంథిన్ = మాయయనెడిముడిని ; త్రెంచివైచితి, కావునన్ =
కోసివేసితివి గాన ; ధీవరేణ్య = బుద్ధిశాలురలో శ్రేష్ఠుఁడవవాఁడా ! స
ర్వశుభహానియైన = మంగళములన్నిటిని పోఁగొట్టునదియైన, రోషంబు =
కోపంబు ; వలదు = వలదు.

తా. పవిత్రమును ద్వేషములేనిదయునగు హృదయమందు వెతకు
చు, జీవాత్మస్వరూపుఁడై పరబ్రహ్మమయియొప్పు సర్వేశ్వరుని అతఁడే
నేనను జ్ఞానముకలిగి అవిద్యను తరించి యున్నావు కావున నో ధ్రువు
డా, సర్వశుభములకును హానికలిగించు కోపమును వదలుము.

క. విను రోషహృదయుచేతను
ననయము లోకము నశించు నౌషధములచే
ఘనరోగములు నశించిన
యనువున నది గాన రోష మడఁపు మహాత్మా. 146

అర్థ. ఔషధములచేన్ = మందులచేత. రోగములు నశించినవను వునన్ = రోగములుపోవునట్లు; వినుము = వినుము. రోషహృదయుచే తన్ = రోషముగలవానిచేత. అనయమున్ = ఎప్పటికిని. లోకమునశించున్ = లోకము చెడును.

తా. ఔషధముచేత రోగమునశించునట్లు, రోషముచేత లోకములు నశించును.

తే. అనఘ నీదుసహోదర ✽ హంత లనుచుఁ
బెనఁచి యీపుణ్యజనులఁ జం ✽ పితి కడంగి
పరఁగ నిదియె సదాశివ ✽ భ్రాతయైన
యర్థవిభునకు నపరాధ ✽ మయ్యెఁ గాన. 147

అర్థ. అనఘ = పాపరహితుఁడా! నీదుసహోదరహంతలను చున్ = నీతోఁబుట్టువయిన యుత్తముని చంపినవారని; పెనచి = పెనఁగునట్లుచేసి. ఈపుణ్యజనులన్ = ఈరాక్షసులను. కడంగి = పూని చంపితి = వధియించితివి పరఁగన్ = ఒప్పునట్లు ఇదియె = ఇట్టిదియె. సదాశివభ్రాతయైన = ఈశ్వరునకు సోదరుఁడైన అర్థవిభునకున్ = కుబేరునకు. అపరాధమయ్యె = తప్పాయెను. కానన్ = అందుచే. (ముందుపద్యముతోనన్వయము)

తా. ఈయక్షులు నీసోదరుని చంపిరని వారిని నీవు చంపితివి, వీరు శివుని సోదరుఁడైన కుబేరుని భటులు, అందుచేత నీవు కుబేరునికి అపరాధము చేసితివి కాబట్టి,

క. నతినుతులచేత నీ విపు
డతనిఁ బ్రసన్నునిఁగఁ జేయు ✽ మని మనువు దయా
మతిఁ జెప్పి ధ్రువునిచే న
త్కృతుఁడై నయ మొప్పఁ జనియె ✽ ఋషియుక్తుండై.

అర్థ. నతి = నమస్కారము చేతను. నుతుల చేతన్ = స్తోత్రముల చేతను; ఈవిప్రుడు. అతనిన్ = ఆకుబేరుని. ప్రసన్నునిఁగాఁజేయుము = దయగలవానిగా ఒనర్పుము. అని, మనువు = తని, స్వాయంభువుఁడు. దయామతిన్, చెప్పి. ధ్రువుని చేసత్కృతుండై = ధ్రువుని చే సత్కరింపబడినవాడై, నయ మొప్పన్ = నెమ్మది ఒప్పునట్లుగా. ఋషియుక్తుండై = ఋషిగణములతోఁ గూడినవాఁడై. చనియెన్ = పోయెను.

తా. నీవాతని బ్రతిమాలుకొని, నీకు ప్రసన్నుఁడగునట్లు చేసికొనుము. అని మనువు చెప్పి, ధ్రువుని చేత సత్కరింపబడి, ఋషులతో కలసి వెడలిపోయెను.

వ. అంత. 149

అర్థ. అంతన్ = అటుపిమ్మట.

తే. యక్షచారణసిద్ధవిద్యాధరాది
జనగణస్తూయమానుఁడై ధనదుఁ డంతఁ
బుణ్యజనవైశసనివృత్తిఁ భూరిరోష
రహితుఁడైనట్టిధ్రువునిఁ జేరంగ వచ్చె. 150

అర్థ. అంతన్ = అప్పుడు ధనదుఁడు = కుబేరుఁడు యక్ష, చారణ, సిద్ధ, విద్యాధర = యక్షులు, చారణ సిద్ధ, విద్యాధర, ఆది = మొదలగు. జన = పరివారముల చేత. స్తూయమానుఁడై = పొగడఁబడువాఁడై పుణ్యజన = రక్కసులను. వైశస = చంపుటను. నివృత్తిన్ = వదలినవానిని; భూరి = అధికమైన; రోష = రోషమునుండి; రహితుండు = తొలఁగినవానిని. ఐనట్టిధ్రువునిన్ = అయినటువంటి ధ్రువుని, చేరంగవచ్చెన్ = సమీపించెను.

తా. యక్షులు, చారణులు, సిద్ధులు, విద్యాధరులు, మొదలగువారు తన్ను పొగడుచుండ, కుబేరుఁడు రాక్షసులపై కోపము నుపసంహరించుకొని యున్న ధ్రువునియొద్దకు వచ్చెను

సీ. చనుదెంచి వెసఁ గృతాం । జలి యైనధ్రువుఁ జూచి
తిప్పుట నిట్లనియె । క్షత్త్రియకుమార
తగ భవదీయపి । తామహాదేశంబు
నను దుస్త్యజం బైన । ఘనవిరోధ
ముడిగితి పటు గాన । యొనరంగ నిపుడు నీ
యందుఁ బ్రసన్నుండ । నైతి భూత
జననలయంబుల । కనయంబుఁ గాలంబె
కర్తయై వర్తించుఁ । గాన యుష్మ

తే. దనుజుఁ జంపినవారలీ । యక్షవరులు
గారు తలపోయ వీయక్ష । గణము నిట్లు
నెఱి వధించినవాఁడవు । నీవు గావు
వినుతగుణశీల మాటలు । వేయు నేల. 151

అర్థ. చనుదెంచి = వచ్చి. కృతాంజలి, యైన = నమస్కరించినట్టి ధ్రువున్, చూచి = ధ్రువునికనుగొని. తివుటన్ = కోరెకతో. ఇట్లని యెన్ = ఈప్రకారముఅనియెను. క్షత్రియ కుమార = ఉత్తానపాదునికుమారుండయినధ్రువుడా! తగన్ = ఒప్పునట్లు. భవదీయ, పితామహ = నీయొక్క తాతయొక్క. ఆదేశంబునన్ = ఆనతిచేత. దుస్త్యజంబైన = త్యజించుటకు శక్యముకాని. ఘనవిరోధమున్ = అధికమైన వైరమును. ఉడిగితివి = వదలితివి. అట్లు గానన్ = ఆకారణమునుబట్టి. ఒనరంగన్ = ఒప్పునట్లు. ఇప్పుడు, నీయందు ప్రసన్నుఁడనైతిన్ = ఈసమయమందు నీ యందు దయగలవాఁడనైతిని. భూత = భూతకోటులయొక్క. జనన, లయంబులకున్ = పుట్టువులకునుచావులకును. అనయంబున్ = ఎల్లప్పుడును

కాలంబె = కాలమే. కర్త్రయై, వర్తించున్ = కారణంబై రూపఁగుచుండు ను. కానన్ = కాబట్టి. యుష్మత్ అనుజున్ = నీతమ్ముని. చంపినవార లు = వధించినవారలు. ఈయక్షవరులుగారు = ఈ యక్షులుగారు త లపోయన్ = ఆలోచింపగా. ఇట్లు = ఈవిధముగా. ఈయక్షగణ మున్ = ఈరాక్షసుల మూకను. నెఱిన్ = మెండుగా. వధించిన వాఁడవు నీవు గావు = నీవుకానేరవు. వినుత = పొగడఁదగిన. గుణశీల = సుగుణములను శీలమునుగలవాఁడా! మాటలు వేయు నేల = ఏలపలు మాటలు?

తా. ఇట్లు వచ్చితనకు దోసిలొగ్గియున్న ధ్రువుని మాచి ఓయి క్ష త్రియబాలకుఁడా! నీ తాతయుపదేశమున కోపమును చాలించియున్నావు. నీయెడల నేను ప్రసన్నుండనయితి, సృష్టిస్థితిలయములకు కాలమే కార ణముగాని మరియొండుగాదు. ఈ యక్షులను నీవు చంపలేదు, ఈ యక్షులు నీసోదరుని చంపలేదు.

వ. అదియునుంగాక యేబుద్ధిం జేసి కర్మసంబంధదుఃఖాది కంబులు దేహాత్మానుసంధానంబునం జేసి సంభవించు నట్టి యహంత్వమ్మనుకనపార్థజ్ఞానంబు స్వప్నమందుంబోలెఁ బు రుషునకుం దోఁచు నది గావున సర్వభూతాత్మవిగ్రహుం డును నధోక్షజుండును భవచ్ఛేదకుండును భజనీయపా దారవిందుండును ననంతామేయశక్తియుక్తుండును గుణ మయాత్మమాయావిరహితుండును నైనయీశ్వరుని సేవిం పుము నీకు భద్రం బయ్యెడు భవదీయమనోగతంబైన వరంబుఁ గోరుము నీవంబుజనాభపాదారవిందసేవనం బుఁ దిరంబుగఁ జేయుదువని యెఱుంగుదు ననిన రాజ రాజుచేత నిట్లు మహామతియు భాగవతోత్తముండు నైన

ధ్రువుండు ప్రేరేపింపఁబడి యేహరిస్మరణంబుచేత నప్ర
యత్నంబున దురత్యయం బైన యజ్ఞానంబుఁ దరియింతు
రట్టిహరిస్మరణం బచలితం బగునట్లొసంగు మని యడిగిన
నట్ల కాక యని యంగీకరించి యంతం గుబేరుండు సంప్రీ
తచిత్తుం డయి ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్లుపదేశించి
యంతర్ధానంబు నొందె నంత ధ్రువుండు యక్షకిన్నరకిం
పురుషగణసంస్తూయమానవైభవుం డగుచు నాత్మీయపు
రంబునకు మరలి చనుదెంచె నంత. 152

అర్థ. అదియునుగాక. ఏబుద్ధిం జేసి = ఏబుద్ధిచేత. కర్మ, సంబంధ = ప్రారబ్ధకర్మకు సంబంధించిన దుఃఖాదికంబులు = దుఃఖము మొదలగునవి. దేహ, ఆత్మాను, సంధానంబునన్. చేసి = శరీరమునకును. మనస్సునకును జేరికగలవియగుటచేత. సంచరించున్ = కలుగుచుండునో. అట్టి. అహం = నేను. త్వమ్ = నీవు. అనునపారజ్ఞానము = అనెడి విపరీతఅర్థముతో తెలివి; స్వప్నమంను బోలెన్ = స్వప్నావస్థయందువలెనే. పురుషునకున్ తోఁచున్ = మనుష్యునకుతోఁచును; అదిగావునన్ = ఆకారణముచేత. సర్వభూత = అన్నిభూతములకొటుబనే. ఆత్మవిగ్రహుండు = శ్రీవిష్ణుమూర్తియును. భవ, ఛేదకుండును = జన్మములనశింపచేయువాఁడును; భజనీయ, పాదారవిందుండును = భజింపఁదగిన పాదకమలములు గలవాఁడును; అనంత = అంతములేనిదియు; అమేయ = మేరలేనిదియు నైన; శక్తి = శక్తిచేత. యుక్తుండును = కూడినవాఁడును; గుణమయ = గుణములయొక్క ప్రచురత్వమును చెందిన. ఆత్మమాయా = తనమాయనుండి; విరహితుండును = తొలఁగినవాఁడును; ఐన, ఈశ్వరునిన్, సేవింపుము = ఐనట్టి శ్రీవిష్ణుమూర్తిని కొలువుము; నీకు, భద్రంబు, అయ్యెడు =

నీకు మేలొనరూడెదును; భవదీయమనోగతంబైన = నీ మనస్సునందుగల; వరంబున్ కోరుము = కోర్కెనుకోరుము; నీవు. అంబుజనాభ = విష్ణుమూర్తి యొక్క పాద, అరవింద, సేవనంబున్ = పాదకమలములపూజను; తిరంబుగన్, చేయుదువని, ఎఱుంగుదున్ = స్థిరముగాఁ జేయుఁగలవవని యెఱుఁగుదును; అనిన, రాజరాజు చేతన్ = అనన్తునిబేరని చేత; అట్లు = ఆవిధముగా; వరంబువేఁడుమని; మహామతియున్ = గొప్పబుద్ధిగలవాఁడును; భాగవత, ఉత్తముండును = భక్తవరేణ్యుండును; ఐనధ్రువుండు; ప్రేరేపింపబడి; ఏహరిస్మరణంబు చేతన్ = ఎట్టివిష్ణుమూర్తి యొక్క ధ్యానము చేత; అప్రియత్నంబునన్ = ప్రయత్నములేకయే; దురత్యయంబు = చేటులేనిది; ఐనయజ్ఞానంబున్ = ఆయినట్టి తెలివిలేమిని; తరియింతురు = దాఁటుదురో; అట్టి, హరిస్మరణంబున్ = అటువంటి మహిమగల హరియందలిస్మృతిని; అచలితంబగునట్లు, ఒసగుము = స్థిరమైనట్లు ఇమ్ము. అని యడిగినన్ = అనివేడఁగా; అట్లకాకయని = ఆట్లేయగునుగాకని; కుబేరుఁడు = కుబేరుండు; అంగీకరించి = ఒప్పుకొని; అంతన్ = అంతట; సంప్రీతచిత్తుండయి = ప్రీతితోఁ గూడినమనసుగలవాఁడయి; ధ్రువునికిన్, శ్రీహరిస్మరణంబున్ = శ్రీహరిధ్యానమును; ఆట్లుపదేశించి = అప్రకారముబోధించి; అంతర్ధానంబు నొందెన్ = మాయమాయెను; అంతన్ = అటుపిమ్మట; ధ్రువుండు, యక్ష, కిన్నర = కించిన్నరరూపముగల దేవతలు, కింపురుష; గణ = సమూహము చేత; సంస్తూయమాన = పొగడఁబడు; వైభవుండు, అయి = విభవముగలవాఁడై; ఆత్మీయ, పురంబునకున్ = తననగరమునకు; మరలెన్, చనుదెంచెను = మరలివచ్చెను అంతన్ = అంతట.

తా॥ స్పష్టము.

సీ॥ గణుతింప భూరిద ♦ క్షిణలచేఁ గడు నొప్ప
యజ్ఞముల్ సేయు న ♦ య్యజ్ఞవిభుఁడు

ద్రవ్యక్రియాదేవ • తాఫలరూపస
త్కర్మఫలప్రదా • తయును నైన
పురుషోత్తముని నర్థిఁ • బూజించి మఱియు స
ర్వోపాధివర్జితుఁ • డుత్తముండు
సర్వాత్మకుఁడు నగు • జలజాక్షునందుఁ దీ
వ్రంబై ప్రవాహరూ • పంబు నైన
తే. భక్తి నలుపుచు సకల ప్ర • పంచమందు
నలరు దనయందు నున్నమ • హాత్ము హరిని
జిదచిదానందమయుని ల • క్ష్మీవరుఁ బరము
నీశ్వరేశ్వరుఁ బొడగనె • సిద్ధచరిత. 153

అర్థ. గణుతింపన్ = విచారింపగా ; భూరిదక్షిణలచేన్ = అధికములయిన దక్షిణలచే ; కడున్, ఒప్పన్ = మిగుల దేజరిల్లుచుండఁగా ; యజ్ఞముల్, చేయన్ = యాగములొనరింపఁగా ; అయ్యజ్ఞవిభుఁడు = ఆ యజ్ఞమునకు యజమానుఁడు; (ధ్రువుఁడు); ద్రవ్య = ధనము ; క్రియ = పనులు ; దేవతా = దైవమును ; ఫల = ప్రయోజనమును ; వీని; రూప = రూపముగల ; సత్కర్మ = సత్కార్యములయొక్క ; ఫలప్రదాతయును = ప్రయోజన మొసంగువాఁడును ; ఐన, పురుషోత్తమునిన్ = అయినట్టి శ్రీహరిని ; అర్థిన్, పూజించి = మనసార సేవించి; మఱియును ; సర్వ ఉపాధివర్జితుఁడు = తాపత్రయమునుండి తొలఁగినవాఁడు; ఉత్తముండు = ఘనుఁడు. స్వరూపాత్మకుండు = అన్నిటినిగలవాఁడు ; అగుజలజాక్షునందున్ = అగునట్టి పుండరీకాక్షునియందు, తీవ్రంబై = చుఱుకుదనముగలదై; ప్రవాహరూపంబునన్ = ప్రవాహరూపముతో ; అఖిలప్రపంచమందున్ = లోకమునందంతటను ; తనరన్, తనయందు = ఒప్పునట్లుగా తనలోన;

ఉన్నమహోత్క్రతున్ = ఉన్నతమైనట్టి క్రతువు. హరిన్ = విష్ణుమూర్తిని. చిత్ అచిత్, ఆనందమయునిన్ = చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అను మూడువిధములవనరూపుడైనవానిని. లక్ష్మీపతిన్ = శ్రీకాంతుని. పరమున్ = శ్రేష్ఠుని. ఈశ్వరేశ్వరునిన్ = ప్రభువులకుఁ బ్రభువును. ఇద్ధచరిత = శ్రేష్ఠమైన నడవడిక గలవాఁడా. పొడగనెన్ = దర్శించెను.

తా. ఎన్నో యజ్ఞములను చేసి శ్రీహరిని నిశ్చలభక్తితో ధ్యానించి ఎట్టియుపాధియు లేనివాఁడును, సర్వాత్మకుఁడును, అవ్యయానందముగల వాఁడును, అగు ఈశ్వరుని కనుగొనెను.

వ. ఇట్లు సుశీలసంపన్నుండును బ్రహ్మణ్యుండును ధర్మసేతురక్షకుండును దీనవత్సలుండు నయి యవని పాలించు ధ్రువుండు తన్నుఁ బ్రజలు తండ్రియనఁ దలంప నిరువదియాఱువేలేండ్లు భోగంబులచేతఁ బుణ్యక్షయంబును నభోగంబు లైన యాగాదులచేత నశుభక్షయంబుం జేయుచు బహుకాలంబు ననుకఁ ద్రివర్గసాధనంబుగా రాజ్యంబు సేసి కొడుకునకుఁ బట్టంబు గట్టి యచలితేంద్రియుండై యవిద్యారచిత స్వప్నగంధర్వనగరోపమంబును దేహాదికంబగు విశ్వంబు భగవన్మాయారచితంబని యాత్మం దలంచుచు వెండియు.

అర్థ. ఇట్లు = ఈవిధముగా. సుశీలసంపన్నుండును = మంచి సుశీలము నే సంపదగాఁ గలిగినవాఁడును. ధర్మసేతురక్షకుండును = ధర్మమును అనకట్టను రక్షించువాఁడును. దీనవత్సలుండును = దీనులయెడ ప్రేమగలవాఁడును. అయి, అవనిన్ పాలించుధ్రువుండు = రాజ్యపరిపాలనము చేయుచున్నట్టి ధ్రువుండు తన్నున్ = తన్ను. ప్రజలు = జనులు. తండ్రిని,

తలంపన్ = జనకునిగా భావింపగా. ఇసవదియూతువేలయేండ్లు. భోగంబులచేతన్ = సుఖానుభవముల చేత. పుణ్యక్షయంబును = పుణ్యముయొక్క క్షీణతయును అభోగంబులయిన = శ్రీమంతమ స్థానములయిన ; యాగాదులచేతన్ = యజ్ఞములు మొదలగు సత్కర్మాచరణముల చేత. అశుభతతులంబును = అమంగళములను పోగొట్టుటయును. చేయుచున్ = చేయుచును. బహుకాలంబునకున్ = చాలకాలంబునకును. త్రివర్గసాధనంబుగా = ధర్మార్థకామములకై పరిజనపరిపాలన మొదలగు కొడుకునకుంబట్టంబుగట్టి. అచలిత, ఇంద్రియుండై = చలింపని యింద్రియములుగలవాడై. అవిచార్యరచిత = మాయ చేగలిగిన. స్వప్న = స్వప్నమునందలి. గంధర్వనగరోపమంబు = (కనబడు) గంధర్వనగరమునకు ఉపమింపందగినది. అయిన = అయినటువంటి. దేహాదికంబు = శరీరము, మొదల గువానినిగల. విశ్వంబు = ప్రపంచంబు. భగవన్మాయావిరచితంబు = ఈశ్వరునిమాయ చేత గలిగినది. అని ఆత్మంబలంచుచు = అని మనస్సునందు తలంచుచు. వెండియున్ = మఱియును (ముందుపద్యముతో నన్వయము.)

తా. స్పష్టము.

చ. మనునిభుఁ డంత భృత్యజన ♦ మంత్రిపురోహితబంధుమిత్రనం
దనపశువిత్తరత్నవని ♦ తాగృహరమ్యవిహారశైలవా
రినిధిపరీతభూతలహ ♦ రిద్విపముఖ్యపదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములు ♦ గాఁ దలపోసివిరక్తచిత్తుఁడై.

అర్థ. మనునిభుఁడు = మనువులకు సముఁడయిన యాధ్రువుడు. అంతన్ = అంతట. భృత్యజన = సేవకులు మంత్రి = ప్రధానులు. పురోహిత = పురోహితులు. బంధు = బంధువులు. మిత్ర = స్నేహితులు నందన = పుత్రులు. పశు = గోవులు. విత్త = ధనము రత్న = రత్నములు, వనితా = స్త్రీలు. గృహ = ఇండ్లు. రమ్యవిహారశైల = రామణీయకములైన క్రీడాము (మొదలగువానినిగల) వారినిధిపరీతభూతల = సముద్రపర్యం

తనకుఁగలభూప్రదేశమునంతటి. హరిత్ ద్విప = దిగ్గజములు. ముఖ్య = వీని చే ముఖ్యములుగాఁగల . పదార్థజాతమున్ = వస్తుసమూహములు . ఘనమతి చేన్ = పరిశుద్ధమయిన బుద్ధిచేత . అసత్యములుగాన్ = మిథ్యాస్వరూపములుగా, తలపోసి = తలంచి . విరక్తచిత్తుఁడై = అనురక్తిలేని మనస్సుగల వాఁడై,

తా. ఆధ్రువుఁడు తనకుఁగలసేవకులు, మంత్రులు, పురోహితులు బంధువులు, మిత్రులు, మేడలు, రత్నములు, పశువులు ఇవియును అవనేల సమస్తమును ననిత్యములని తలంచి, మనసువిరక్తిఁ బొందినవాఁడై (ముందుపద్యముతో నన్వయము)

సీ. పురము వెల్వడి చని ॥ పుణ్యభూబదరికా
ఘనవిశాలానదీ ॥ కలితమంగ
ళాంబుపూరంబుల ॥ ననురక్తిమైఁ గ్రుంకి
కమనీయపరిశుద్ధ ॥ కరణుఁ డగుచుఁ
బద్మాసనస్థుఁడై ॥ పవనుని బంధించి
నెలకొని ముకుళిత ॥ నేత్రుఁ డగుచు
హరిరూపవైభవ ॥ ధ్యానంబు సేయుచు
భగవంతు నచ్యుతుఁ ॥ బద్మనేత్రు
తే. నందు సతతంబు నిశ్చల ॥ మైనయట్టి
భక్తిఁ బ్రవహింపఁ జేయుచుఁ ॥ బరమమోద
బాష్పధారాభిషిక్తుండు ॥ భవ్యయశుఁడుఁ
బులకితాంగుండు నగుచు ని ॥ మ్మలఁ దపర్చె. 156

అర్థ. పురమున్ = పట్టణమును . వెల్వడి = విడిచి చని = పోయి పుణ్యభూబదరికా, ఘన, విశాలానదీ = పుణ్యమును కలిగింపు బదరికా

శ్రమమునందలి విశాలయను నదియందు. కలిత, మంగళ, అంబుపూరంబుల
న్ = స్వచ్ఛమయినట్టియును, మంగళకరము లయినట్టియును, నిండుజలములు
యందు. అనురక్తిమైన్ = వేడుకతో. తర్పించి = స్నానముచేసి. కమనీయ
పరిశుద్ధ, కరణుఁడు. అగుచున్ = చక్కని శుద్ధమైన మనస్సుకలవాఁడై
యి పద్మాసనస్థుఁడై, అయి = పద్మాసనమునవైచుకొని; పవనుని, బంధిం
చి = వాయునిరోధము చేసి, నెఱకొని = పూనికతో. ముకుళిత, నేత్రుఁడు,
అగుచున్ = కన్నులమూసికొని. హరిరూపవైభవ, ధ్యానంబున్ = శ్రీ
హరియొక్క దివ్యరూపధ్యానమును, చేయుచున్ = చేయుచు. భగవం
తున్ = ఐశ్వర్యయుక్తుఁడయిన వానిని. అచ్యుతున్ = నాశములేనివా
నిని, పద్మనేత్రున్ = పుండరీకాక్షుని. అంతన్ = అస్థలమునందు, సత
తంబున్ = ఎల్లప్పుడును. నిశ్చలము, అయినట్టి = ఏకాగ్రమయిన, భ
క్తిన్ = భక్తిని. పరివహింపన్, చేయుచున్ = వ్యాపించునట్లు చేయుచు
పరమ, మోద, భాష్పధారా, అభిషిక్తుండు = ఆనందాశ్రువులచే తడపు
బడినవాఁడును. భవ్యయశుఁడు = గొప్పకీర్తి గల వాఁడును. పులకితాంగుఁ
డున్ = గగుర్పొడిచిన దేహముగలవాఁడును. అగుచున్ = అగుచు. ఇమ్ము
లన్, తనర్చి = ఎక్కువప్రీతితో.

తా. ధ్రువుఁడు బదరికాశ్రమమున పాఱుచున్న విశాలయను పుణ్యనదియందు స్నానముచేసి నిర్మలాంతఃకరణుఁడయి, పద్మాసనమును వైచుకొని శ్వాసమునుబంధించి, కన్నులను మూసికొని శ్రీహరి మంగళరూపమున నేకాగ్రమనస్సుతో ధ్యానించుచు ఆనందాశ్రువుల విడుచుచు ఒడలుగగుర్పొడువ [ముందుపద్యముతో నన్వయము]

వ. మఱియు విగతక్లేశుండును ముక్తలింగుండును నై ధ్రువుండు తన్నుఁ దా మఱచి యుండుసమయంబున దిశదిక్కుల నున్న ద్రాకానిశానాయకుండునుం బోలె వెలింగించుచు నాకాశంబుననుండి యొక్కవిమానంబు సనుదేర

నందు దేవశ్రేష్ఠులును జతుర్భుజులును రక్తాంబుజేక్షణు
లును శ్యామవర్ణులును గదాధరులును సువాసులును గిరీ
టహారాంగదకుండలధరులును గౌమారవయస్కులును
నుత్తమశ్లోకకింకరులు నయినవారల నిద్దఱం గని సంభ్ర
మంబున లేచి మధుసూదనునామంబులు సంస్మరించుచు
వారల భగవత్కింకరులంగాఁ దలంచి దండప్రణామంబు
లాచరించిన విష్ణుపాదారవింద విన్యస్తచిత్తుండుఁ గృ
తాంజలియు వినమితకంధరుండు నైనధ్రువుని గనుంగొని
పుష్కరనాభభక్తులైనసునందనందనులు ప్రీతియుక్తులై
మందస్మితులగుచు నిట్లనిరి. 158

అర్థ. ఇటియున్ = యింకను ; విగతక్లేశుండును = కష్టమును మఱచినవాఁడును . ముక్తలింగుండును = స్థూలదేహమును మఱచినవాఁడును. అయి, ధ్రువుండు = ధ్రువుండు, తన్నున్, తాన్, మఱచి తన్ను తానుమఱచి, ఉండుసమయంబునన్ = ఉండునపుడు . దశదిక్కులన్ = పదిదిక్కులను. ఉద్యత్, రాకా, నిశానాయకుండున్, పోలెన్ = ప్రకాశించుచున్న చంద్రునివలె వెలిగించుచున్ = ప్రకాశింప జేయుచు ఆకాశంబుననుండి = ఆకాశమునుండి, ఒకవిమానంబు, చనుదేరన్ = ఒకవిమానమురాగా . అందున్ = ఆవిమానమునందు. దేవశ్రేష్ఠులును = దేవతులలో ముఖ్యులును . చతుర్భుజులును = నాలుగేసిభుజములు గలవారును. రక్త, అంబుజ, ఈక్షణులును = ఎఱ్ఱతామరవంటి కన్నులుగలవారును, శ్యామవర్ణులును = చామనచాయగలవారును . గదాధరులును = గదలను ధరించినవారును. సువాసులును = మంగళాకారులును. కిరీట, హార అంగద, కుండల, ధరులును = కిరీటములు, హారములు, భుజకీర్తులు, కుం

డలము లు ధరించినవారును ; కౌమారవయస్కులును = యౌవనవంతులును ఉత్తమ, శ్లోక కింకరులను, అయినవారలన్ = మంచిచరిత్రము గల భటులను ; ఇద్దఱన్ = ఇద్దఱిని ; కని = చూచి, సంభ్రమంబునన్ = తొట్రుపాటుతో ; లేచి, మధుసూదను, నామంబులు = శ్రీహరి నామములను, సంస్మరించుచున్ = తలఁచుచు ; వారలన్ = వారిని ; భగవత్, కింకరులను, కాన్ = విష్ణుదూతలుగా ; తలఁచి = ఆలోచించి ; దండప్రణామంబులు ఆచరించినన్ = దండప్రణామంబులు చేయఁగా ; విష్ణుపాదారవింద, విన్యస్త, చిత్తుఁడుగాన్ = విష్ణుమూర్తి యొక్క పాదపద్మములయందుంచఁబడిన మనస్సుగలవాఁడును ; కృతాంజలియున్ = దోసిలొగ్గినవాఁడును ; వినమిత కంధరుండును = వంచఁబడిన మెడలు గలవాఁడును ; అయి ; ధూమ్రవుని = ధూమ్రవుని; కనుంగొని = చూచి ; పుష్కరనాభ, భక్తులు, అయిన = పద్మనాభుని భక్తులయిన ; సురవందనవదనులు = సురవంద్యులు, నందుఁడు అను విష్ణుకింకరులు ; ప్రీతియుక్తులై = సంతోషించినవారయి మందస్మితులు, ఆడుచున్ = మందహాసముతో ; ఇట్లు, అనిరి = ఇట్లు పలికిరి.

తాత్పర్యము.

ఉ. ఓనృప నీకు భద్రమగు • నొప్పగు చున్న మదీయ వాక్యముల్
వీనులయందుఁ జొన్పుము వి• వేకముతో నయి దేండ్లనాఁడు మే
ధానిధి వై యొనర్చియు ను• దాత్తతపోవ్రతనిష్ఠ చేతఁ దే
జోనయశాలివైన మధు• సూదనుఁ దృప్తి నహింపఁ జేయవే

అర్థ. ఓనృప = ఓరాజా ; నీకున్ = నీకు ; భద్రము, అగున్ = మేలు కలుగును ; ఒప్పగుచున్న = నీకుహితములయిన ; మదీయ వాక్యముల్ = మామాటలను ; వీనులయందున్, చొన్పుము = చెవులఁబెట్టుము ; వివేకముతోన్ = జ్ఞానముతో, అయిదేండ్లవాఁడు = ఐదేండ్ల బాలుఁడవైనపుడు ; మేధానిధివై = గొప్పబుద్ధిగలవాఁడవయి ; ఒనర్చి = చేసి, ఉదాత్త, తపోవ్రతనిష్ఠ చేతన్ = గొప్పతపస్సును చేయుటచేత ; తేజోనయశాలి, అయిన = తేజస్వంతుఁడైన ; మధుసూదనున్ = విష్ణుమూర్తిని ; తృప్తిన్, వహింప

పన్ ; చేయువే = సంతోషింపచేయులేదా!

తా. ఓరాజా! నీవు హితములగు మాటలనువినుము, నీవైదేండ్ల పిల్లవాఁడవయి యున్నప్పుడు జ్ఞానవంతుఁడవయి, తపస్సుచేసి, శ్రీహరి ని సంతోషపెట్టితివి.

ఆ. అట్టి శార్ఙ్గపాణి ♦ యఖిలజగద్భర్త

దేవదేవుఁ డతుల ♦ దివ్యమూర్తి

మమ్ముఁ బనుప మేము ♦ మాధవపదమున

కర్థి నిన్నుఁ గొనుచు ♦ నరుగుటకును 159

అర్థ. అట్టి = అటువంటి ; శార్ఙ్గపాణి = విష్ణుమూర్తి ; అఖిలజగత్ భర్త = సకలలోకాధినాయకుఁడు, దేవదేవుఁడు = దేవతలకు ప్రభువు , అతుల, దివ్యమూర్తి = సాటిలేని మంగళాకారముగలవాఁడు, మమ్మున్ పనుపన్ = మముపంపఁగా ; మేము ; మాధవపదమునకు వైకుంఠమునకు అర్థిన్ = కోరికతో ; నిన్నున్ = నిన్ను ; కొనుచున్ = తీసికొని; అరుగుటకును = వెళ్ళుటకు,

తా. దేవాదిదేవుఁడైన శ్రీమహావిష్ణువు మమ్ముపంపగా మేమునిన్ను వైకుంఠమునకు తీసికొనివెళ్లుటకు (ముందువచ్యముతో నన్వయము)

వ. వచ్చితిమి యేపదంబు నేఁడు సూరిజనంబులు సర్వోత్తమం బని పొందుదురు దేనిఁ జంద్రదివాకరగ్రహనక్షత్రతారాగణములు ప్రదక్షిణంబుగాఁ దిరుగు చుండు మఱియు నీదుపితరులచేతను నన్యులచేతను ననధిష్ఠితంబును జగద్వంద్యంబును భక్తజనాతిమర్జ్యంబును నయినవిష్ణుపదంబుం బొందుటకు రమ్మిదె విమానశ్రేష్ఠం బుత్తమశ్లోకజనమౌళిమణి యైన శ్రీహరి పుత్తెంచె దీని నెక్కను ర్హుండవనిన నురుక్రమప్రియుండయినధ్రువుండు తన్మధు

రవాక్యంబులు విని కృతాభిషిక్తుండయి యచ్చటిమునుల
కుఁ బ్రణమిల్లి తదాశీర్వాదంబులు గైకొని విమానంబు
నకుం బ్రదక్షిణార్చనంబులు గావించి హరిపార్షదులైన
సునందనందులకు వందనం బాచరించి భగవద్రూపవిన్య
స్తచక్షురంతఃకరణాదికుం డగుచు విమానాధిరోహణం
బు గావించుటకు హిరణ్మయరూపంబు ధరియించెనప్పుడు.

అర్థ. వచ్చితిమి = వచ్చినాము ; ఏపదంబున్, ఏనిన్ = ఏస్థానము
ను ; సూరిజనంబులు = బుద్ధిమంతులు ; సర్వోత్తమంబు, అని = అన్నిటి
కంటె నుత్తమస్థానమని ; పొందుదురు = చేరుదురో ; దేనిన్ = దేనిని
చంద్ర, దివాకర, గ్రహ, నక్షత్ర, తారాగణంబులు = సూర్యచంద్రు
లును, గ్రహములును, నక్షత్రములును, తారలును ప్రదక్షిణంబు గాన్, తిరు
గుచుండున్ = చుట్టునుతిరుగుచుండునో ; మఱియున్ ; ఇంకను, నీదు,
పితరుల చేతను = నీపూర్వుల చేతను ; అన్యులచేతను = ఇతరుల చేతను, అనధి
ష్ఠితంబును = పొందబడునట్టిదియు ; జగద్వంద్యంబును = జగత్తు చేత పూ
జింపఁబడునదియు ; భక్త, జన, అతి, దుర్లభంబును = భక్తుల చేత నతికష్ట
ముతో సంపాదింపఁబడునదియు, అయిన విష్ణుపదంబున్ = అయినట్టి
ధ్రువమండలమును ; పొందుదువు = చేరుదువు ; రమ్ము ; ఇదే = ఇదిగో ; వి
మానశ్రేష్ఠంబు = శ్రేష్ఠమైన విమానము ; ఉత్తమశ్లోక, జన, మౌళిమణి
అయిన = ఉత్తమచరిత్రములుగల ; జనులకు, తలమానికము వంటివాఁడ
గు ; శ్రీహరి = శ్రీమహావిష్ణువు ; పుత్తెంచెన్ = పంపినాఁడు, దీనిన్, ఎ
క్కన్ ; అర్హుండవు = దీనినెక్కుటకు తగినవాఁడవు ; అనినన్ = అనగా ;
ఉరుక్రమ, ప్రియుండు, అయిన, ధ్రువుండు = విష్ణుమూర్తికి ప్రియుండ
యిన ధ్రువుఁడు, తత్ మధురవాక్యంబులు విని = ఆతీయని మాటలనువిని
ఆకృతఅభిషిక్తుండు, అయి = స్నానము చేసి ; అచ్చటిమునులకున్, ప్రణ
మిల్లి = అచ్చటిమునులకు నమస్కరించి, తత్, ఆశీర్వాదంబులు గైకొని =
వారిఆశీర్వచనములను స్వీకరించి ; విమానంబునకున్ = ఆవిమానమునకు

ప్రదక్షిణ, అర్చనంబులు, కావించి = ప్రదక్షిణములు, పూజలు చేసి ; హరి పార్షదులు, అయిన = విష్ణుభటులైన ; సునందనందులన్ = సునందుఁడు నందుఁడనను వారికి ; వందనంబాచరించి = నమస్కరించి ; భగవత్, రూప, విన్యస్త, చక్షుః అంతఃకరణ, ఆదికుండు, అగుచున్ = భగవంతు నిరూపమునందు కన్నులు, మనస్సు మొదలగువాని నుంచినవాఁడయి ; విమాన, అధిరోహణంబు, కావించుటకున్ = విమానము నెక్కుటకు ; హిరణ్మయము, రూపంబున్, ధరియించెన్ = బంగారు వికారమైనరూపమును దాల్చెను; అప్పుఁడు = అప్పుడు

తా. స్పష్టము

క. సురదుందుభిపణవానక
మురజాదులు మొరసె విపుల ♦ ముసురు గురిసెఁ గి
న్నరగంధర్వులపాటలు
భరితములై చెలఁగె నపుడు ♦ భవ్యచరిత్రా. 161

అర్థ. సుర = దేవతలయొక్క . దుందుభి; పణవ, ఆనక, మురజ, ఆదులు = భేరులు ; తప్పెటలు, ఢక్కలు, మద్దెలలు, మొదలైనవి. మొరసెన్ = ధ్వనించెను విపుల, ముసురు, కురిసెన్ = పుష్పవర్షము కురిసెను; భవ్యచరిత్రా = పూజ్యచరిత్రుఁడయిన విదురుఁడా!: అపుడు; కిన్నరగంధర్వుల పాటలు = కిన్నరులయొక్కయు, గంధర్వులయొక్కయు పాటలు ; భరితములై. అంతటను నిండినవై. చెలగెన్ = అతిశయించెను.

తా. అపుఁడు సురదుందుభులు మొదలగు వాద్యములు మ్రోగెను పుష్పవర్షము కురిసెను . కిన్నరగంధర్వులు దివ్యగానములను చేసిరి

వ. అట్టిసమయంబున ధ్రువుండు దుర్గమం బగుత్రివిష్టపంబు నకు నేఁగువాఁ డగుచు దీన యగుజననిం దిగనాడి యెట్లు పోవుదునని చింతించు వానిం బార్షదు లవలోకించి యగ్రభాగంబున విమానారూఢయై యేఁగుచున్న జననిం జూపిన సంతుష్టాంతరంగుం డగుచు.

అర్థ. అట్టిసమయంబునన్ = అటువంటిసమయమునందు. ధ్రువుం
డు = ధ్రువుండు; దుర్గమంబు, ఆగు = పరశక్యముగానిదగు. త్రివిష్టపం
బునకున్ = వైకుంఠమునకు; ఏఁగువాఁడు, అగుచున్ = పోవుచు; దీన, అ
గు, జననిన్ = దీనురాలైన తల్లిని. దిగనాడి = విడిచిపెట్టి. ఎట్లుపోవుదు
న్, అని = ఎట్లువెళ్ళగలనని, చింతించువానిన్ = ఆలోచించుచున్న ధ్రు
వుని. పార్షదులు = విష్ణుభటులు. అవలోకించి = చూచి. అగ్రభాగంబు
నన్ = తనముందు, విమాన, ఆరూఢ, అయి = విమానము నెక్కి. ఏగుచు
న్న = వెళ్ళుచున్న, జననిన్ = తల్లిని, చూపినన్ = చూపఁగా. సంతుష్ట
అంతరంగుండు, అగుచున్ = సంతోషించిన మనస్సుగలవాఁడై.

తా. స్పష్టము.

క. జనని సునీతిని మున్నిడి
కొని యతులవిమాన మెక్కి • గోనకొని విబుధుల్
దనమీఁదఁ బుష్పవర్షము
లనయముఁ గురియింప ధ్రువుఁడు • హర్షముతోడన్. 163

అర్థ. జనని, సునీతిని = తల్లియైన సునీతిని. మున్నిడుకొని = తనకు
ముందరగానుంచుకొని. అతులవిమానము ఎక్కి = సాటిలేని విమానము నె
క్కి, గోనుమని = కోరికతో. విబుధుల్ = దేవతలు తనమీఁదన్ = తనమీఁ
ద. పుష్పవర్షములు = పూలవానలు, అనయమునన్ = తరచుగా. కురియిం
పన్ = కురియింపఁగా ధ్రువుండు. హర్షముతోడన్ = ఎక్కువఆనందముతో

తా. తల్లినిముందుంచుకొని విమానమెక్కి, దేవతలు పుష్పవర్షము
లు కురియించుచుండగా ధ్రువుఁడు పరమానందముతో [ముందుపద్య
ముతో నన్వయము]

క. చని చని పెస గ్రహమండల
మును త్రైలోక్యంబు సప్త • మునిమండలముఁ
ఘనుఁ డుత్తరించి యవ్వలఁ
దనరెడు హరిపదము నొందెఁ • దద్దయుఁ బ్రీతిన్. 164

అర్థ. చనిచని = పోయిపోయి. వెసన్ = శీఘ్రముగా. గ్రహమండలమును = గ్రహములను. త్రైలోక్యంబు = మూడులోకములను. సప్తముని మండలమున్ = సప్తఋషిమండలమును. ఘనుఁడు = మహానుభావుఁడు. ఉత్తరించి = దాటి. అవ్వలన్ = ఆవల. తనరెడు = ఒప్పుచున్న. హరిపదమున్ = ధ్రువమండలమును, తద్గమున్. ప్రీతిన్ = మిక్కిలి వేడుకతో. పొందెను = చేరెను.

తా. అట్లాతఁడు పోయిపోయి, గ్రహమండలమును, త్రిలోకములను, సప్తఋషిమండలమును దాఁటి యావలనున్న ధ్రువమండలమును చేరెను.

వ. అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపం జేయుచు నిర్దయాగమ్యంబును శాంతులు సమదర్శనులు శుద్ధులు సర్వభూతానురంజనులు నచ్యుతభక్తబాంధవులు నయినభద్రాచారులకు సుగమ్యంబును నయి గంభీరవేగంబు ననిమిషంబు నగుజ్యోతిశ్చక్రంబు సమాహితంబై గోగణంబు మేధియందుంబోలె నెందుఁ బరిభ్రమించుచుండ నట్టియచ్యుతపదంబునం విష్ణుపరాయణుండైన ధ్రువుండు త్రిలోకచూడామణియై యొప్పుచుండె నప్పుడు భగవంతుండైన నారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేతస్సత్త్రంబునందు వీణ వాయించుచు.

అర్థ. అది = ఆధ్రువమండలము. మఱియున్ = ఇంకను. నిజకాంతిన్ తనకాంతిచేత. త్రిలోకంబులన్ = మూఁడులోకములను. ప్రకాశింపన్ చేయుచున్ = వెలుగుచేయుచు. నిర్దయ, అగమ్యంబును = దయారహితులైనవారిచేత చేరరానిదియు. శాంతులు, సమదర్శనులు, సర్వభూతానురంజ

నులు, అచ్యుత, భక్త, బాంధవుల = శాంతముగలవారును, సుఖదుఃఖము లను ఒక్కరీతిగాఁ చూచువారును, పవిత్రులును, సర్వభూతములను సంతోషింపచేయువారును, విష్ణుభక్తులచుట్టములను అయిన, భద్ర, ఆచారులకున్ = శుభ చరిత్రముగలవారికి . సుగమ్యంబును, అయి = చేర వీలుగా నుండి . గంభీర వేగంబును = గొప్ప వేగమును . అనిమిషంబును = ఒక్క నిమిషమైన ఆగనిదియు . అగు = అయిన. జ్యోతిస్, చక్రంబు = కాంతిచక్రము . సమాహితంబై = చక్కఁగా. గోగణంబు = గోవుల సమూహము . మేధియందున్, పోలెన్ = కట్టుకంబమునందువలె . ఎందున్ = ఎప్పుడును. పరిభ్రమించుచుండున్ = తిరుగుచుండునో . అట్టి = అటువంటి . అచ్యుత, పదంబునన్, పొంది = ధ్రువసుండలము చేరి . విష్ణుపరాయణుండు, అయి విష్ణువునందే మనస్సును చేర్చిన. ధ్రువుండు = ధ్రువుఁడు . త్రిలోకచూడామణి, అయి = మూఁడులోకములను తలమానికము(యి . ఒప్పుచుండెన్ = ఒప్పుచుండెను . అపుడు . భగవంతుండు, అయిన నారదుండు = పూజ్యుఁడైన నారదుఁడు. ధ్రువుని మహిమన్ = ధ్రువుని మాహాత్మ్యమును. కనుంగొని = తెలిసికొని . ప్రచేతస సత్రమునందుక్ = ప్రచేతస్ సత్రయాగమునందు. వీణవాయించుచు = వీణనుమీఁటుచు,

తా. స్పష్టము.

సీ. పతియె దైవంబుగా ♦ భావంబులోపలఁ
దలఁచుసునీతి నం ♦ దనుత పగవ్ర
భావముక్రియ ధర్మ ♦ భవ్యనిష్ఠలఁ బొందఁ
జాలరు బ్రహ్మర్షి ♦ జనము లనిన
క్షత్రియకులు నెన్నఁ ♦ గా నేల యెవ్వఁడు
పంచసంవత్సర ♦ ప్రాయముసను
సురుచి దురుక్త్యుగ్ర ♦ శరభిన్నహృదయుఁడై
మద్వాక్యహితబోధ ♦ మతిఁ దనర్చి

తే. వనమునకు నేఁగి హరిభక్తి వశత నొంది
యజితుఁ డగుహరి తనవశుఁ డై చరింపఁ
జేసి వెసఁ దత్పదంబును జెందె నట్టి
హరిపదంబును బొంద నెవ్వరికిఁ దరము. 166

అర. పతియె = భర్తయే. దైవంబుగాన్ = దేవునిగా. భావంబులోపలన్ = మనస్సులో. తలఁచు = భావించు. సునీతినందను = సునీతికుమారుఁడైన ధ్రువునియొక్క. తపఃప్రభావముకిన్ = తపోమహిమవలె. బ్రహ్మఋషిజనములు = బ్రహ్మఋషులుగూడ. ధర్మభవ్యనిష్ఠలన్ ధర్మము చేత = పవిత్రములయిన, ఆచారమును పొందఁజాలరు. అనిన = అనఁగా. క్షత్రియకులుని = క్షత్రియవంశమునందు పుట్టినవానిని. ఎన్నఁగాన్, ఏల = లెక్కింపనక్కరలేదు. ఎవ్వఁడు = ఎవఁడు పంచసంవత్సర ప్రాయమున = ఐదేండ్లవయసున. సురుచి, దురుక్తి, ఉగ్ర, శర, భిన్న, హృదయుఁడు, అయి = సవతితల్లియైన సురుచియొక్క దుర్భాషలను బాణములచే భేదింపఁబడిన మనస్సుగలవాఁడై, మద్వాక్యబోధన్ = నామాటలయందలి మంచి యుపదేశమును. మతిన్, తనర్చి = మదిలోపెట్టుకొని. వనమునకున్, ఏఁగి = అడవికిపోయి. హరిభక్తివశతనొంది = శ్రీహరికిభక్తివశుఁడై. అజితుఁడు అగుహరి = ఇంతకుమునుపెవరిచేతను జయింపఁబడని శ్రీహరి. తనవశుఁడై, చరింపన్, చేసి = తనకువశుఁడై తిరుగునట్లుచేసి. వెసన్ = వేగముగా. తత్పదంబును = విష్ణుపదమైన ధ్రువమండలమును. చెందెన్ = పొందెను. అట్టి = అటువంటి. హరిపదంబును = ధ్రువమండలమును, పొందన్ = చేయుటకు, ఎవరికిన్. తరము = ఎవరికిశక్యమగును?

తా. బ్రహ్మఋషులయినను ధ్రువునివలె తపోమహిమను సంపాదింపజాలరన సాధారణ క్షత్రియులమాట వేఱుచెప్పనేల? ధ్రువుఁడు ఐదేండ్లబాలుఁడయి యున్నపుడే సవతితల్లి యాడినమాటలకునొచ్చి, అడవికేగి, శ్రీహరిని తనవశముచేసికొని, విష్ణుపదమునుపొంద వరికితరము? నె

క. అని పాడె ననుచు విదురున
కనఘుఁడు మైత్రేయుఁ డనియె నంచితభక్తిన్
వినుతోద్దామయశస్కుం
డనఁ గలయాధ్రువునిచరిత మార్యస్తుత్యా. 167

అర్థ. అని, పాడెను, అనుచును = అని గానము చేసెనని, విదురునకు = విదురునితో. అనఘుఁడు, మైత్రేయుఁడు = మహానుభావుఁడైన మైత్రేయుఁడు ఆర్యస్తుత్యా = పెద్దలపొగడ్తకు పాత్రుఁడవయిన పరీక్షిన్మహారాజా ; అంచితభక్తిన్ = నిర్మలమయినభక్తితో. వినుత, ఉద్దామ, యశస్కుండు అనఁగల = గొప్పకీర్తిగలవాఁడు అనదగు ఆధ్రువుని చరిత్రమును; అనియెన్ = చెప్పెను.

తా. ఓరీ పరీక్షన్మహారాజా; నారదుఁడట్లు గానము చేసెనని మైత్రేయుఁడు విదురునితో భక్తిపూరితుఁడై చిరకీర్తియైన యాధ్రువుని చరిత్రమును దెల్పెను.

—: ఫల శ్రుతి :—

సీ. మహితసత్పురుషస న్మతమును ధన్యంబు
స్వర్గప్రదంబు య శస్కరంబు
నాయుష్కరంబుఁ బు ణ్యప్రదాయకమును
మంగళకర ముఘ మర్షణంబు
సౌమనస్యముఁ బ్రశం సాయోగ్యమును బాప
హరమును ధ్రువపద ప్రాపకంబు
నై యొప్పునీయుపా ఖ్యానంబుఁ దగ నీకు
నెఱిఁగించితిని దీని నెవ్వఁ డేని

తే. తివుట శ్రద్ధాగరిష్ఠుఁడై తీర్థపాద
చరణసరసీరుహద్వయాశ్రయుఁడు నైన
భవ్యచరితుఁడు దినాంత ప్రభాతవేళ
నలఘుమతిఁ బూర్ణిమావాస్యలందు మఱియు. 168

అర్థం. మహిత, సత్పురుష సమ్మతమును = సజ్జనులైన మహానుభావులకు ; ప్రీతికరమైనదియు ; ధన్యంబు = కృతార్థతను కలిగించునదియు ; స్వర్గప్రదంబు = స్వర్గమునిచ్చునదియు ; యశస్కరంబు = కీర్తినికలుగ చేయునదియు, ఆయుష్కరంబు = ఆయుర్వృద్ధిని కలుగఁజేయునదియు, పుణ్యప్రదాయకమును = పుణ్యమునిచ్చునదియు ; మంగళకరము = శుభములను గలుగ చేయునదియు ; అఘమర్షణంబు = పాపములను కడఁగివేయునదియు ; సౌమనస్యము = మంచిమనస్సులు కలుగ చేయునదియు . ప్రశంసా యోగ్యమును = ప్రశంసింపఁబడినదియు పాపహరమును = పాపమును పోఁగొట్టునదియు. ధ్రువపదప్రాపకంబు = నిలుకడయైనపదవిని (వైకుంఠమును) పొందించునదియు ; ఐ ఒప్పు = ఒప్పునట్టి . ఈ, ఉపాఖ్యానంబున్ = ఈకథను. తగన్ = బాగుగా ; నీకున్ = నీకు, ఎఱింగించితిని = తెలిపితిని ; దీనన్ = దీనిని, ఎవ్వఁడేనిన్ = ఎవ్వఁడైనను, తివుటన్ = ఆసక్తితో శ్రద్ధాగరిష్ఠుఁడయి = ఎక్కువశ్రద్ధతో ; తీర్థపాద, చరణ, సరసిరుహ, ద్వయ = పుణ్యముల పాదములుగల, లేదా!, గంగానుద్భవించిన పాదములుగల ; శ్రీహరి పాదపద్మములజంటను . ఆశ్రయుఁడును, అయిన = ఆశ్రయించినవాఁడును అయిన ; భవ్యచరితుఁడు = పుణ్యచరిత్రముగల ధ్రువుని ; దినాంత, ప్రభాతవేళన్ = సాయంకాలమందును ; ఉదయమునను ; అలఘుమతిన్ = మంచిబుద్ధితో పూర్ణిమ అమావాస్యలందున్, పున్నమనాఁడును అమావాస్యనాఁడును ; మఱియున్ = ఇంకను ; (ముందుపద్యముతో నన్వయము)

భా. ఈకథ, సజ్జనసమ్మతము, పవిత్రము, యశస్కరము, ఆయు

ష్కారము, పాపహరమునైనది. దీని నీకెఱింగించితిని శ్రీవిష్ణుభక్తులలో నగ్రేసరుడైన యాధుర్నివుని, ప్రాతఃకాల సాయంకాలములయందును, పున్నమ అమావాస్యలందును ఇంకను (ముందుపద్యముతో నన్వయము).

తే. ద్వాదశిని బద్మ బాంధవ వాసరమున
శ్రవణనక్షత్రమున దిన క్షయమునందుఁ
బరఁగ సంక్రమణవ్యతీ పాతలందు
సభల భక్తిని వినునట్టి సజ్జనులకు. 169

అర్థ. ద్వాదశిని = ద్వాదశినాఁడును; పద్మబాంధవవాసరమునన్ = ఆదివారమునాఁడును; శ్రవణనక్షత్రమునన్ = శ్రవణనక్షత్రమందును; దినక్షయమునందున్ = క్షయతిథినాఁడును; పరఁగన్ = బాగుగా; సంక్రమణ = సంక్రమణము; వ్యతీపాతలందున్ = వ్యతీపాత యోగములందును; సభలన్ = సభలలో; భక్తితో, వినునట్టి, సజ్జనులకు = వినుసత్పురుషులకు (ముందుపద్యముతో నన్వయము)

తా. ద్వాదశి, ఆదివారము, శ్రవణనక్షత్రము, క్షయతిథి, సంక్రమణము, వ్యతీపాతయోగము, ఇట్టిసమయములందు సభలలో భక్తితో వినునట్టి సత్పురుషులకు (ముందుపద్యముతో నన్వయము)

వ. క్లేశనాశంబును మహాప్రకాశంబును నైనభగవద్భక్తియు శీలాదిగుణంబులును గలుగు మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబును మనఃకామునకు మనంబును నిష్కామునకుఁ దత్త్వవిజ్ఞానంబును గలుగు దీని వినిపించువారికి దేవతానుగ్రహంబు గలుగు నిట్టియుపాఖ్యానంబు నీకెఱింగించితి నని మైత్రేయుండు విదురునకుఁ జెప్పినక్రమంబున శుకయోగి పరీక్షిత్తున కెఱింగించె.

అర్థ. క్లేశనాశనంబును = దుఃఖమును పోఁగొట్టునదియు; మహాప్రకాశంబును = గొప్పవెలుతురు నిచ్చునదియు. అయిన . భగవద్భక్తియు = విష్ణుభక్తియు. శీల ఆదిగుణంబులును = సదాచారము మొదలైన సద్గుణములును, కలుగున్ = కలుగును; మఱియున్ = ఇంతేకాక, తేజఃకామునకు = తేజస్సుకోరువానికి . తేజంబును = తేజస్సును . మనఃకామునకు = మర్యాదకావలసినవానికి . మనంబును = మర్యాదయును . నిష్కామునకున్ = కోరికలేనివానికి . తత్త్వవిజ్ఞానంబును = బ్రహ్మజ్ఞానమును . కలుగున్ కలుగును. దీనిన్ = ఈకథను . వినిపించువారికిన్ = చెప్పువారికి . దేవతా, అనుగ్రహంబు, కలుగున్ = దేవతలదయకలుగును . ఇట్టిఉపాఖ్యానంబున్ = ఇట్టికథను నీకు, ఎఱిగించితిన్, అను = నీకుతెల్పితిని . మైత్రేయుండు, విదురునకున్, చెప్పిన, క్రమంబునన్ = మైత్రేయుఁడు విదురునకుచెప్పినరీతిగా . శుకమహర్షి . పరీక్షిత్తునకున్ = పరీక్షిన్మహారాజునకు ఎఱిగించెన్ = తెలిపెను.

తా. దుఃఖమును పోఁగొట్టునదియు గొప్ప ప్రకాశముగలదియు నగు, భగవద్భక్తియు, సద్గుణములును కలుగును. తేజస్సుకావలసినవానికి తేజస్సును మర్యాదకావలసినవానికి మర్యాదయు, కోరికలులేనివానికి బ్రహ్మజ్ఞానమును కలుగును. దీనినివినుపించువారికి దేవతలయనుగ్రహము కలుగును . అట్టికథను నీకుతెల్పితినని మైత్రేయుఁడు విదురునకు చెప్పినరీతిగా శుకుఁడు పరీక్షిన్మహారాజునకు తెలిపెను.

ధ్రువోపాఖ్యానము

సంపూర్ణము.



శ్రీచింతామణిముద్రాక్షరశాల:—రాజమండ్రి.

# నీతిచంద్రిక.

పరవస్తు చిన్నయసూరి ప్రణీతము.

లఘుటీక, ఉపోద్ఘాతములు కలవు. చక్కని అచ్చు. అత్యుత్తమమైన కాగితము. ఇందలిటీకను చూడకున్న చిన్నయసూరి యభిప్రాయము. సాధారణముగా పట్టుబడదు.

వెల రు 0—8—0.

# సీతాదేవివనవాసము.

అనగా నుత్తరరామచరిత్ర. కరుణరసపూరితము. పండిత ఈశ్వరచంద్రవిద్యాసాగరులవారి వంగభాషయందలి సీతాదేవి వనవాసమును దాని కాంధ్రీకరణము. ఈగ్రంథము ఆంధ్ర స్త్రీ పురుషుల హస్తములయందలరారతగినది. పాఠశాలలలోకూడ పఠనీయముగ నుంచబడుచున్నది. రు 0-10-0

# తుకారాముచరిత్రము.

మహాభక్తుడును మహారాష్ట్రజాతీయోద్ధారకుడును నగు తుకారాముని చరిత్రనెల్లరు బఠింపదగినది. ఏతద్గ్రంధపఠనమువలన భక్తులచర్యల నొకింత దెలిసికొనవచ్చును. భక్తిరసపూరితము. పాఠశాలలలోగూడ పఠనీయముగ నుంచబడుచున్నది. రు 0-10-0

# విదుషీమణులు.

అపూర్వగ్రంథము.

శ్రీకొాపల్లె హనుమంతరావు పంతులు యం. ఏ. బి. యల్. గారు పీఠికను వ్రాసియున్నారు. వేదకాలము మొదలుధారావాహికముగ

భారతవర్షమునందలి విద్వాంసురాండ్ర చరిత్రలిందు వర్ణింపబడినవి. వివాహములు మొదలగు శుభకార్యములయందును పండుగులయందును పర్వములయందును బాలికలకు బహుమతియొసగుటకు నింతకంటె నుత్తమగ్రంథము మరియొకటి లేదు.

పాఠశాలలలో పఠనీయముగ నుంచుటకు చాలనుపయోగము

వెల రు 0—12—0 క్యాలికో రు 1—0—0

# సావిత్రీదేవి.

సుప్రసిద్ధమగు భారతకథ మృత్యువువాత బడనున్న సత్యవంతుని వరించి, యమధర్మరాజు మన్ననకు పాత్రయై ధర్మస్వరూపిణిగా వినుతికెక్కిన సావిత్రిచరిత్ర మిక్కిలి మనోహరముగా వర్ణితము. శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి పీఠిక అంతయు పఠనార్హము. పాఠశాలలలో పఠనీయముగ నుంచబడుచున్నది. వెల రు 0-12-0

# సతీదేవి.

పరమేశ్వరుని యర్ధాంగియగు సతీదేవి చరిత్ర. పతికొరకే పతివ్రత నిలువునప్రాణములువిడిచిన ఘట్టమెంతయు రసపూరితము. పాఠశాలలలో కూడా పఠనీయముగ నుంచబడుచున్నది.

వలయువారు:—

ఆర్యపుస్తకాలయము,

రాజమహేంద్రవరము.

